# పండుగలు ★ పరమార్థములు



(వసంతగ్రీష్మములు)

రచయిత

ఆంధ్ర శేషగిరి రావు

# పండుగలు: పరమార్థములు

ప్రథమముద్రణ: డిసెంబరు - 2000

ప్రతులు - 1000

వెల - 50 రూ॥

"This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to Publish Religious Books".

ప్రాప్తిస్థానము:
ఆంధ్రశేషగిరిరావు
ప్లాటునెం 63, M.I.G.
లాసన్స్‌బే కాలనీ
విశాఖపట్నం-530 017
ఫోన్ - 530289

ముద్రణ :
Sathyam Offset Imprints
46-18-10, Mandavari Peta,
Visakhapatnam-530 016.
✆ : 735878.

# అర్చన

సర్వమున్ కదలం జేయు కాలమూర్తికి నమస్కారము సత్క్రియకిన్! అన్నాడు భర్తృహరి.

'కాలముదాటదుస్తరమెట్టివారికిన్' అన్నాడు అనుభవజ్ఞుడయిన మరోకవి.

'కాలః కలయతామహమ్' - అని శ్రీకృష్ణ భగవానుడు.

కాలపురుషుడే భగవంతుడనీ, ఆ భగవత్స్వరూపుణ్ణి మన వైజ్ఞానికులు నిర్విరామంగా కొలుస్తూనే, నిశితంగా కొలిచిన్నీ ఉన్నారు.

మన్వంతరాలు, కల్పాలు, యుగాలు, సవంత్సరాలు, ఋతువులు, మాసాలు, పక్షాలు, వారాలు, దివారాత్రాలు ఇత్యాదిగా.

అమావాస్య, పూర్ణిమా తిథులు, నక్షత్రాలు మొదలయిన కొలబద్దలతో హద్దులు ఏర్పరచారు. ప్రత్యక్ష నారాయణుడైన సూర్యుణ్ణి సర్వలోక కలనాత్మకుడైన 'కాలమూర్తి' అన్నారు మన పెద్దలు.

"మాయ అనే కాగులో కాలపురుషుడు సమస్తాన్ని ఉడకపెడతాడు. దివారాత్రాలు ఇంధనాలు, సూర్యుడు, అగ్ని. ఋతువులు, మాసాలు అనే తెడ్లు ఆకాగులోని పదార్థాన్ని నిరంతరం కలియ తిప్పుతూ ఉంటాయి." వార్త అంటే ఏమిటి? అనే యక్షుని ప్రశ్నకు ధర్మరాజు చెప్పిన సూటి సమాధానం ఇది.

పచనమయ్యే పదార్థం ఉడక్కపోవడం, చిమిడిపోవడం, మాడిపోవడం మొదలైన దోషాలకు లోను కాకుండా తెడ్లవలె ఋతువులు, మాసాలు జాగ్రత్త వహిస్తాయి.

ఆ జాగృతికి ఫలితంగా పండుగలూ పర్వాలు ఏర్పడ్డాయి. లోక సంక్షేమార్థులైన మన పూర్వఋషులు, నక్షత్రగమనాన్ని బట్టీ, ఋతు ధర్మాన్ని బట్టి ఈ పండుగల నన్నింటినీ ఏర్పరచారు. మానవుడు ఆరోగ్యంగా, ఆహ్లాదంగా జీవించడానికి ఏయే ఋతువుల్లో ఏయే రకాల క్రియాకలాపాలు చేయాలి. ఏయే పదార్థాలు సేవించాలి అనే విషయాలన్ని పండుగలలో ఆచారాల రూపంలో స్థిరపరచి తమ సంతతికి అందించారు.

కొన్ని పండుగలు ఆయా ప్రదేశాల శీతోష్ణస్థితిగతుల్ని పట్టి ఏర్పడ్డాయి. కొన్ని ఆయాసామాజిక జీవన విధానంలోంచి పుట్టుకొచ్చాయి.

వ్రతాలు, నియమాలు ఇవన్నీ మానవుడికి ఒక సంస్కారాన్ని అలవరచాయి. ఆయా నియమాలు మానవులకు ఆరోగ్యప్రదాలుగా పరిణమించాయి. ఎన్నెన్నో వ్రతగ్రంధాలు వ్రాసిపెట్టారు ఋషికల్పులయిన మన పెద్దలు.

పండుగల సందర్భంలో ఆయా పండుగల గురించి మానాన్నగారు వ్యాసాలు వ్రాసి ప్రచురిస్తూ ఉండేవారు.

పండుగల గురించిన విషయాలన్నీ సేకరించి ఉంచారు. ఈపండుగలు మన సంస్కృతికి దర్పణాలు. వారు పరిశీలించిన గ్రంధాలు. ప్రధానంగా - నీలమతపురాణం, స్మృతికౌస్తుభం, చతుర్వర్గ చింతామణి, గదాధర పద్ధతి, పురుషార్ధచింతామణి, ధర్మసింధువు, నిర్ణయసింధువు, వ్రతోత్సవచంద్రిక, తిధితత్త్వము, స్మృతిదర్పణము, పురాణనామచంద్రిక, అమాదేర్ జ్యోతిషీ, హిందువుల పండుగలు - ఆయా పత్రికల్లోని వివిధ వ్యాసాలు కూడా.

ఇంతకృషి చేసి సేకరించిన విషయాల్ని క్రోడీకరించి ప్రచురించడం నాకనీస బాధ్యతగా భావించి ఈ పుస్తకానికి నా నేర్పువిధంబుగా ఒక రూపాన్ని ఇచ్చి అచ్చు వేయడం జరిగింది.

తెలుగు వారి ఈ సాంస్కృతిక వారసత్వాన్ని భావితరాల వారికి అందించాలనే తపనే ఈ పుస్తకం ముద్రించడానికి కారణం.

తక్కిన నాలుగు ఋతువులలోని పండుగల వివరాలు త్వరలో ముద్రించాలని ఆకాంక్ష.

**మలయవాసిని**

# విషయసూచిక

## చైత్రము


| | | |
|---|---|---|
| చైత్ర శుద్ధ పాడ్యమి | ఉగాది | -1 |
| చైత్రశుద్ధ విదియ | అరుంధతీవ్రతము | -21 |
| చైత్రశుక్లతదియ | శివడోలోత్సవము, | -25 |
| చైత్ర శుక్ల చతుర్థి | దమనపూజ | -33 |
| చైత్రశుక్ల పంచమి | శాలిహోత్రహయపంచమి | -33 |
| చైత్ర శుక్లషష్ఠి | స్కందదమనపూజ | -34 |
| చైత్రశుక్ల సప్తమి | సూర్యదమన పూజ | -34 |
| చైత్రశుద్ధ అష్టమి | భవానీ అష్టమి | -35 |
| చైత్ర శుద్ధ నవమి | శ్రీ రామ నవమి | -40 |
| చైత్రశుద్ధ దశమి | ధర్మరాజదశమి | -47 |
| చైత్రశుద్ధ ఏకాదశి | కామదైకాదశి | -50 |
| చైత్రశుద్ధ ద్వాదశి | భాతృప్రాప్తివ్రతము | -59 |
| చైత్రశుద్ధ త్రయోదశి | మదనత్రయోదశి | -60 |
| చైత్ర శుద్ధ చతుర్దశి | శైవచతుర్దశి | -61 |
| చైత్ర పూర్ణిమ | హనుమజ్జయంతి | -62 |
| చైత్రబహుళ పాడ్యమి | పాతాలవ్రతం | -73 |
| చైత్రబహుళపంచమి | మత్స్య జయంతి | -73 |
| చైత్రబహుళ ఏకాదశి | వరూధినిఏకాదశి | -75 |
| చైత్రబహుళ త్రయోదశి | వరాహజయన్తి | -76 |
| చైత్రబహుళ చతుర్దశి | శైవనక్తవ్రతం | -77 |
| చైత్రబహుళ అమావాస్య | కూర్మకల్పః | -77 |


## వైశాఖము


| | | |
|---|---|---|
| వైశాఖశుద్ధపాడ్యమి | స్నానవ్రతము | 80 |
| వైశాఖ శుక్ల తదియ | అక్షయతృతీయ | 80 |
| వైశాఖ శుద్ధ పఞ్చమి | శంకరజయంతి | 93 |
| వైశాఖ శుద్ధ షష్టి | రామానుజాచార్యజయంతి | 99 |
| వైశాఖ శుద్ధ సప్తమి | గంగాసప్తమి | 104 |
| వైశాఖ శుద్ధ అష్టమి | దేవీపూజ | 104 |
| వైశాఖ శుద్ధ ఏకాదశి | మోహినిఏకాదశి | 105 |

ఉగాది పున ఉగాదితో జతపరుచుతూ ఉండుటవలన ఒక విషయం ఊహింపనగుచున్నది. ఆర్యులు, పార్సీలు కలసి ఉండిన కాలమునకే ఈ పర్వం ఏర్పడి ఉండునని. పార్సీలు ఉగాదిని 'నౌరోజ్' అంటారు. నౌరోజ్ అనగా కొత్తదినము అని అర్థము.

స్థితి ఇట్టిదికాగా ఈ పండుగ ఆర్యావర్తమనబడే ఉత్తర హిందూస్థానములో ఇప్పుడు నామమాత్రమై పోయినది.

వ్రతోత్సవచంద్రికాకారుని వ్రాతనుపట్టి ప్రస్తుతము వింధ్య పర్వతానికి ఉత్తరాన ఒక్క మాళవదేశంలోనే చైత్రాది పర్వం కొద్దిగా ఉన్నట్లు తేలుతూ ఉంది. ఈనాడు గృహాలంకరణం, పంచాంగ శ్రవణం, అక్కడ సక్రుతుగా ఉంది. ఉత్తర హిందూదేశాన ఇతర ప్రాంతాల్లో ఈమాత్రం కూడా లేదు. ఆర్యా వర్తములో ఈ ఆర్యాచారం ఎందుకులుప్తమైపోయింది?

కాలాంతరాన అమలులోనికి వచ్చిన సౌరబార్హస్పత్యమన్వాది కా పరిగణనములో గల తేడాలు ఇందుకు ఒక కారణం కావచ్చు.

వింధ్యకు దక్షిణమున శాలివాహన శకమున్నూ, ఉత్తరమున విక్రమార్క శకమున్నూ ప్రచారములోనికి రావడము ఇందుకు మఱి ఒక కారణం కావచ్చు.

ఈ రెండు శకముల సందర్భంలో మహారాష్ట్రంలో ప్రచారంలో ఉన్నగాథ ఇక్కడ వివరింపతగినదిగా ఉంటుంది.

పురంధరపురంలో ఒక వర్తకుడు. అతడు చాలా ధనవంతుడు. అతనికి నలుగురు కొడుకులు. చనిపోయేముందు అతడు తన కొడుకులకు నాలుగు సీళ్లు వేసిన పాత్రలు ఇచ్చాడు. తాను చనిపోయిన పిమ్మట కాని సీళ్లు తెరపవద్దని అతడు కొడుకులిని ఆదేశించాడు.

అట్లే ఆనలుగురు కొడుకులూ తండ్రిమరణానంతరం ఆపాత్రల సీళ్లు తొలగించిచూచారు. మొదటిపాత్రలో మట్టి -రెండవదానిలో బొగ్గులు- మూడవదానిలో ఎముకలు -నలుగవదానిలో తవుడు ఉన్నాయి.

దీని అర్థం వారికి తెలిసింది కాదు.

ఆనాటి హైందవ చక్రవర్తి విక్రమార్కుడు. ఆ సెట్టి కొడుకులు నలుగురూ దాని అర్థాన్ని బోధింపవలసిందిగా విక్రమార్కుని కోరారు. కాని విక్రమార్కునికి దాని అంతరార్థం అవగాహన కాలేదు.

అప్పుడు వారు ప్రతిష్ఠానపురానికి వెళ్లారు. అక్కడ కూడా రాజుగాని, మరి ఎవ్వరు కాని దాని అంతరార్థాన్ని తేల్చలేకపోయారు. కాని ఆవూరిలోని వింత బాలుడు ఒకడు ఆ సమస్యను విడమర్చి చెప్పాడు.

ఆ వింత బాలుడు ఒక బ్రాహ్మణ వింతంతువు కొడుకు. ఆ బ్రాహ్మణ స్త్రీ మిక్కిలి చిన్నతనములోనే భర్తను పోగొట్టుకుంది. అమెకు ఇద్దరు సోదరులు. నాగకుమారుడైన తక్షకుని వలన ఆమె గర్భం ధరించింది. ఇందుకు ఆమె సోదరులు చిన్నబుచ్చుకొని దేశాంతర్గతులై పోయారు.

దిక్కులేని ఆ దీన వితంతువుకి అప్పుడు ఒక కుమ్మరి వాడు ఆశ్రయమిచ్చాడు. ఆ కుమ్మరి యింటిలో ఆమె ఒక కుమారుణ్ణి ప్రసవించింది. కుమారునికి తల్లి శాలివాహనుడు అని పేరు పెట్టింది. అతడు క్రమంగా పెరిగి పెద్దవాడు అవుతూ వుండెను.

అట్టివాడు వర్తకుని నాలుగు పాత్రల సమస్యను విని దానిని తాను పరిష్కరిస్తానని రాజు వద్దకు వెళ్లి ఇట్లా చెప్పాడు. మట్టితోనిండిన పాత్ర వచ్చిన కుమారుడు భూమినీ - బొగ్గులతో నిండిన పాత్రను పొందిన పుత్రుడుకలపనూ, ఎముకలతో నిండిన పాత్రను వడసిన తనయుడు ఏనుగులు, గుర్రాలు, పశువులు మొదలయిన జంతువుల్నీ - తవుడుతో నిండిన పాత్రవచ్చిన సుతుడు ధాన్యాల్నీ పంచుకోవాలని వర్తకుని తాత్పర్యమని శాలివాహనుడు చెప్పాడు.

శాలివాహనుడు ఇంత సముచితంగా ఈ సమస్యను పరిష్కరించిన సంగతి విని విక్రమార్కుడు అతన్ని చూడ్డానికి కుతూహల పడి కబురు చేశాడు. విక్రమార్కుని అంతటి వాడు కబురు చేసినా శాలివాహనుడు పోలేదు. నేను పోయేది లేదని చెప్పివేశాడు. పైగా విక్రమార్కుడే తన దర్శనానికి వచ్చే రోజు వస్తుందని చెప్పాడు.

దీనికి విక్రమార్కుడికి కోపం వచ్చింది. శాలివాహనున్ని మట్టు పెట్టడానికి అపార బలసమేతుడై ఎత్తి వచ్చాడు. ఇది విని శాలివాహనుడు మట్టితో మనిషి బొమ్మలు చేసి వాటికి ప్రాణం పోసి విక్రమార్కుని సేనల మీదకి పంపాడు. పోరు ఘోరమై సాగింది.

శాలివాహనుడు సమ్మోహనాస్త్రం ప్రయోగించి విక్రముని సేనల్ని నిద్రపోయేటట్లు చేశాడు. అందుకు విక్రముడు వాసుకి అనే నాగరాజును

ప్రార్థించి విరుగుడు మందు తెప్పించుకొని తన సేనల్ని తిరిగి తేర్చుకున్నాడు. అప్పుడు ఉభయులకూ రాజీ జరిగింది.

మరో కథ ప్రకారం యుద్ధ సమయంలో ఆకాశవాణి ఆ ఇద్దరు రాజుల్నీ ఉద్దేశించి నర్మదానదికి ఉత్తరాన్ని విక్రమార్కుని, దక్షిణాన్ని శాలివాహనుని రాజ్యం చేయమని తీర్పు చెప్పి యుద్ధాన్ని మానిపించిందని తెలియవస్తూ వుంది.

శాలివాహనుడు శకస్థాపకుడు అయ్యారు. ఆ శకానికి మొదటి దినం చైత్ర శుక్ల పాడ్యమి, కాగా ఈ పర్వము అతని శకస్థాపనతో సంబంధం కలది ఐంది.

ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటకులకు చైత్రాది దినమే సంవత్సరాది.

ఆదిలో ఈనాడే బ్రహ్మ సృష్టిని ప్రారంభించాడు. ఈనాడే బ్రహ్మ దేవతల్ని ఆయాపనులకు నియోగించాడు. నాటి నుంచి ఇది సంవత్సరాది అయింది. ఇట్లని బ్రహ్మాండ పురాణ వాక్యము.

ఆదిలో ఈనాడు ఆంరంభమైన సృష్టి కార్యకలాపం నేటివరకు అవిచ్ఛిన్నంగా, దిన క్రమాభివృద్ధిగా సాగుతూ ఉంది.

ఈ హేతువు చేతనే ఈనాడు కొత్తగా లెక్కలు పెట్టడం, కొత్త వ్యాపారాలు ప్రారంభించడం అనూచానమైన ఆచారమై ఉంది.

బ్రహ్మ సృష్టికి ఆరంభంచేయడం వల్లనే కాకుండా ఇంకా ఇతర కారణాల చేతకూడా చైత్రశుక్ల పాడ్యమి పర్వమైందని పెద్దల వచనం.

వనవాసానంతరం శ్రీరాముడు సీతా సహితముగా అయోధ్యకు చైత్ర శుక్ల పాడ్యమి నాడు తిరుగు ప్రయాణ సన్నాహం చేశాడని కలదు. ఈ కారణం చేత కూడా ఇది పండుగ అయింది.

వసురాజు తపస్సుచేసి రాజ్య పదవి సంపాదించిన పిమ్మట ఇంద్రుడు చైత్ర శుక్ల పాడ్యమి నాడు ప్రత్యక్షమై అతనికి నూతన వస్త్రాలు ఇచ్చి అభినందించాడు. ఈ సందర్భం వల్ల కూడా ఈ పండుగ గణనకెక్కిందని అంటారు.

ఇన్ని విధాల గణన కెక్కిన ఈ పర్వాచరణ విధానాలను ధర్మ సింధువు 'నూతన సంవత్సర కీర్తనాద్యారంభం' ప్రతిగృహధ్వజారోహణం- నింబ పత్రాశనం - సంవత్సరాది శ్రవణం - నవరాత్రారంభో" అని చెబుతూ ఉంది.

మన పంచాంగ కర్తలు ఈనాడు చేయవలసిన పనులను ఇట్లా చెబుతున్నారు. 'అబ్దాది తైలాభ్యంగం - నూతన వస్త్రాభరణ ధారణం - నింబ కుసుమ భక్షణం - పంచాంగ శ్రవణం - ప్రపాదానం - రాజదర్శనం- వాసంత నవరాత్రి ప్రారంభం.

వ్రత గ్రంథాల్లో, ఈ పనులుకాక అధికంగా ఛత్రచామరాది స్వీకారం, బ్రహ్మపూజనం, దమనకపూజ, ఉమామహేశ్వర పూజ, సర్వాపచ్ఛాంతికర మహాశాంతి, పౌరుష ప్రతిపద్వ్రతము మున్నగునవి ఈనాటి కృత్యాలుగా చెప్పబడుతున్నాయి.

వీనిని అన్నిటిని సమన్వయము చేసి పరిగణిస్తే ఆనాటి విధాయక కృత్యాలలో క్రింది పదిన్నీ ముఖ్యమైనవిగా తేలుతూ ఉంది.

**(1) ప్రతిగృహధ్వజారోహణం**

**(2) తైలాభ్యంగం**

**(3) నవవస్త్రాభరణధారణం, ఛత్రచామరాదిస్వీకారం**

**(4) దమనేన బ్రహ్మపూజనము**

**(5) సర్వాపచ్ఛాంతకరమహాశాంతి, పౌరుషప్రతిపద్వ్రతము.**

**(6) నింబకుసుమ భక్షణం**

**(7) పంచాంగ పూజ, పంచాంగ శ్రవణం**

**(8) ప్రపాదాన ప్రారంభం**

**(9) రాజదర్శనం**

**(10) వాసంత నవరాత్రి ప్రారంభం**

ఉగాది నాటి ఈ పది విధాయకకృత్యాల వివరాలను తెలిసుకోవడం మంచిది.

శాస్త్ర చోదితమైన ఈ పది ఆచారాల్లో ఈనాడు మనము ఎన్ని ఆచరిస్తున్నాము!

## ప్రతి గృహధ్వజారోహణం

పూర్వ గ్రంథాల్లో ఈనాడు ప్రతియింట ధ్వజారోహణం విధాయకకృత్యంగా చెప్పబడింది.

ప్రతి యింటి యందునూ ధ్వజాన్ని నిలపడం విజయచిహ్నం. ప్రతిదేవాలయానికి ధ్వజస్తంభం ఉంటుంది. మనకు స్వరాజ్యం వచ్చినప్పటి నుంచీ జెండా ప్రతిష్ఠాపనోత్సవాలు పరిపాటిగా ఉంటున్నాయి. సంవత్సరాది

నాడు పూర్వం మనదేశాన ప్రతియింట ఈ ధ్వజారోహణోత్సవాలు సాగుతూ ఉండేవి.

కొన్ని వ్రత గ్రంథాల్లో ఉగాదినాడు బ్రహ్మధ్వజాన్నికాని, ఇంద్రధ్వజాన్ని కాని పూజించాలని ఉంది.

ధ్వజారోహణకృత్యం ఆంధ్రుల్లో అంతగా ఆచరణలో లేదు. ఆనాడు గృహాలను శుభ్రపరచి గుమ్మాలకు మావిడాకులు కట్టడం మాత్రమే ఇప్పట్లో ఆంధ్రుల ఆచారమై ఉంది.

కాని ధ్వజారోహణోత్సవం మన పొరుగు వారైన మహారాష్ట్రులు ఈనాడున్నూ ఆచరిస్తున్నారు. ఈ సందర్భంలో హిందువుల పర్వాలు (హిందూ హాలిడేస్) అనే గ్రంథంలో కొథారి అను మహారాష్ట్ర మాన్యుడు ఇట్లా వ్రాస్తున్నాడు.

ఆధ్రులలాగే "మహారాష్ట్రులు కూడా శాలివాహన శకాన్నే అవలంబిస్తారు. చైత్రమాసాది దినమే మహారాష్ట్రులకున్నూ సంవత్సరాది దినము.

కొత్తగా ఇల్లు కట్టడానికి కాని, కొత్తగా ఏ పనిని ప్రారంభించడానికి కాని ఇది చాలా శుభదినమని మహారాష్ట్రుల నమ్మిక.

వారు తమ ఉగాదిదినాన్ని "వర్షప్రతిపదపర్వమనీ" "గుడి పర్వ" పర్వమనీ, ధ్వజారోహణపర్వమనీ అంటారు.

నాటి ఉదయాన్ని మహారాష్ట్ర స్త్రీలు తమ యింటి ముంగిళ్ల ముందు పేడనీళ్లు చల్లి ముగ్గులు పెడతారు. ఆ ముగ్గులు మీద మధ్యను చౌరంగం అనే కర్రపీట ఉంచుతారు. ఆ పీటమీద మధ్యను నీళ్లతో నింపిన పాత్రను నెలకొల్పుతారు. ఆ పాత్రలో ఒక రూపాయి వేస్తారు. ఆపాత్రమీద ఒక టెంకాయ నిలుపుతారు. పూజ చేస్తారు. అనంతరం మధురమైన భక్ష్యాలు భుజిస్తారు.

ఆనాడు మహారాష్ట్రులు తమ యింటి ముందు ఒక ధ్వజాన్ని కూడా నెలకొల్పుతారు. దానిమీద వెండిదో, రాగిదో, ఇత్తడిదో పాత్రను ఉంచుతారు. బంగారు జరీపోగులు గల పట్టు పీతాంబరాన్ని ఆ ధ్వజానికి చుట్ట బెడతారు. ఆ ధ్వజానికి మరి కొన్ని జెండాలు, పూలగుత్తులు కూడా కడతారు.

ఇంద్రలోకంలో ఇంద్రుడు ఈనాడు ఇట్టి ధ్వజస్తంభాలను నెలకొల్పు

తాడనీ, తాము ఇక్కడ నెలకొల్పే ఈ ధ్వజాలు వాటికి అనుకరణాలనీ మహారాష్ట్రుల విశ్వాసం"

ఈ రెండు ఆచారాలు ఆంధ్రులలో ఉన్నట్లు కనపడదు.

### (2) తైలా భ్యంగనము

సంవత్సరాది కృత్యాలలో తైలాభ్యంగ స్నానం అతిముఖ్యమైంది.

తైలాభ్యంగనమనగా నువ్వులనూనెతో తలంటి పోసుకోవడం.

సకల శుభ కార్యాలకు ముందుగా తలంటి పోసుకోవడం మన మత విధుల్లో ఒకటి.

సంవత్సరంలోని మొదటి పండుగకు అట్టి మంగళస్నానం మరీ ముఖ్యం.

ఉగాదినాడు ఎవడు తలంటి పోసుకోడో అతడు నరకలోకానికి పోతాడని శాస్త్రవచనం.

తలంటు వలన శరీరంలోని అన్ని ఇంద్రియములకు పాటవము కలుగుతుంది. సుఖనిద్ర కలుగుతుంది.

### (3) నవ వస్త్రాభరణధారణం, ఛత్రచామరాది స్వీకరణం

సంవత్సరాది నాటి విధాయక కృత్యాలలో కొత్తబట్టలు, కొత్త నగలు, ధరించడం కొత్తగొడుగు కొత్త విసనకర్ర స్వీకరించడము, చెప్పబడ్డాయి.

ఈ పండుగనాడు స్నానం చేసి శుచి అయి కొత్తబట్టలు కట్టుకుని కొత్తనగలు పెట్టుకొని దేహాన్ని అలంకరించుకోవడం మంగళకరమైంది. సంతోషప్రదమైంది, ఉత్సాహజనకమైంది.

ఎండాకాలము ప్రారంభమవుతూ ఉంది కాబట్టి ఇప్పటి నుంచి గొడుగు వేసి కోవడం చాలా అవసరము. కాగా ఉగాదినాడు కొత్త గొడుగు సంపాదించి ఉంచుకొనవలెనని హితవు. ఛత్రధారణము నేత్ర శాంతికరము; ఎండ, గాలి, వాన మున్నగు వానినుండి కాపాడి సౌఖ్యప్రదంగా ఉంచును.

ఉగాదినాడు చామరము కూడా స్వీకరించాలి. వచ్చేవి గాలికోరే రోజులు. చామరములతో విసురుకోవడం అవసరం. కాబట్టి వింజామరలు సేకరించి భద్రపరుచుకోవాలి. పూర్వం ఇవి బాగా వాడుకలో ఉంటూ ఉండేవి. ఇప్పుడు వీనిని మనం దేవాలయాల్లో మాత్రం చూస్తున్నాము. నేడు సంపన్నుల ఇళ్లలో ఎలక్ట్రిక్ పంకాలు చోటుచేసుకున్నాయి. కాని

రెండు తావుల్లోనూ వసంతోత్సవ ప్రస్తావన ఉంది. కాని ఒక చోట నింబకుసుమ భక్షణం అనీ, వేఱొక చోట చూతకుసుమ భక్షణం అనీ ఉంది.

వసంతోత్సవాలు శాస్త్రాల్లో చెప్పిన దానిని పట్టి చూస్తే మామిడి చెట్టు క్రింద చేయాలి. మామిడి చెట్టు క్రిందనడిచే కార్యకలాపం గల పండుగ నాటి ఇతర కార్యకలాపాల్లో మామిడి పూతవాడకం ఉండడమే సముచితముని తోచకమానదు.

అయితే వారి ఉగాది వలెనే వసంతోత్సవమైన మన ఉగాదికి మామిడి పూత కాక వేప పూత ఎందుచేత చేకొనబడింది!

మన ప్రాంతాల్లో ఉగాది నాటికి చూతకుసుమం అరుదై పోతుంది. శివరాత్రి నాటికే మన ప్రాంతాల్లో మామిడి జీడి పిందెలు ఏర్పడుతాయి.

మామిడి పూతకంటే వేపపూత ఆరోగ్య దృష్ట్యా వరణీయమైంది. అదిన్నీ కాక మామిడిపూత ఆఘ్రాణింపుకేకాని ఆరగింపుకు అంతగా పనికి రాదనిన్నీ అనవచ్చు.

కాగా చూతకుసుమానికి బదులు ఉగాదినాడు మనకు నింబకుసుమ భక్షణం విధింపబడింది. మనకు ఉగాదినాడు చూతకుసుమ భక్షణం లేదు. మామిడి పూతకు బదులు అప్పటికి బాగా దొరికే లేత మామిడికాయ ముక్కలు మనం ఉగాది పచ్చడిలో వేసుకుంటాము. ఈ విధంగా మనవసంతోత్సవానికి మామిడి సంబంధం.

మన ఉగాది నాటికి వేపచెట్లు ముమ్మరంగా పూతపూసి ఉంటాయి. వేపపువ్వు గుణవంతమైన ఓషధి. రక్తమును శుద్ధిచేసి వృద్ధి పరిచేగుణం దానికి ఉంది. పైగా అది వసంత ఋతుసంబంధమైన పువ్వు. వైద్యానికి ఉపయోగించే వేపచెట్టు పంచాంగాల్లో అది ఒకటి.

వేప సర్వాంగాలుమనవారు వైద్యంలో వాడతారు. మానవునికి ఆరోగ్యం కూర్చే వృక్షరాజాల్లో వేప ఎన్నిక అయింది. స్వర్గలోకంలోని Ambrosia వృక్షం యొక్క అంశతో భూలోకంలో వేప చెట్టు పుట్టిందని మాహారాష్ట్ర సంప్రదాయక విజ్ఞానం ద్వారా వెల్లడి అవుతూ ఉంది.

వేపచెట్టుగాలి కూడా చాలా ఆరోగ్య ప్రదమై ఉంటుంది. దీనికి నిదర్శనంగా మన పెద్దలు ఒక కథ చెబుతారు.

మనసులు కలిసి మెలిసే దంపతులువారు. అందులో మగడు కార్యార్థి అయి దూరప్రాంతాలకు ప్రయాణం పెట్టుకున్నాడు. భర్త త్వరగా తిరిగి వచ్చే ఉపాయం ఏదైన చెప్పమని భార్య ఓషధీ విజ్ఞానం గల ఒక వృద్ధురాలిని ప్రాధేయపడింది. ఆ వృద్ధురాలు ఆ భర్త వెళ్లేటప్పుడు ప్రతిరాత్రి చింతచెట్టు కింద పడుకుంటూ వెళ్లేటట్లు, తిరుగు ప్రయాణంలో ప్రతిరాత్రి వేపచెట్టు కింద పడుకుంటూ వచ్చేటట్లు కోరమంది. భార్య ఆవిధంగా కోరింది. భర్త అందుకు ఒప్పుకున్నాడు. చింత చెట్టుగాలి చాలా జబ్బుగాలి. అందుచేత భర్తకు ప్రయాణ మధ్యలోనే జబ్బు చేసింది. కాగా అతడు ఎట్లాగో గమ్యస్థానంచేరి పనిముగించుకొని రాత్రిళ్లు వేపచెట్టు కిందపడు కుంటూ ఇంటికి తిరిగి వచ్చాడు. వేపచెట్టుగాలి ఒంటికి మంచిది కావడంచేత ఇంటికి వచ్చేసరికి అతని ఆరోగ్యం పూర్తిగా బాగుపడింది.

వేపచెట్టుకు వృక్షశాస్త్రనామం Helia Azadirachta అని ఇందులో Melia అన్నది గ్రీకుభాషాపదం. Azadirachta అన్నది పారశీకభాషా పద తద్భవం. పారశీకభాషలో వేప చెట్టుకు Azar Durachta అనిపేరు. దాని అర్థం ఉత్తమ వృక్షం అని. ఈపేరువల్లనే వేపచెట్టు శ్రేష్ఠత్వం తెలియవస్తూవుంది.

అట్టిచెట్టు అంగమొకటి ఈ పర్వ కార్యకలాపంలో మన పెద్దలు ప్రవేశ పెట్టారు.

పంచాంగంలో నింబకుసుమభక్షణం అని ఉన్నా ధర్మసింధువులో ఈ పర్వపు ఆచరణ విధానంలో 'నింబపత్రాశనం' అని ఉంది. దీనినిబట్టి ఉగాదినాడు వేపాకు తినాలని తేలుతూఉంది.

పూవుఅయినా, ఆకుఅయినా వేపచెట్టువి సేవించడం ఉగాదివిధాయక కృత్యాలలో ఒకటిగా మన మత గ్రంథాలు చెబుతున్నాయి. కాగా ఉగాది దినాలువేరైనా నాడు వేపసంబంధమైనపూవో, ఆకో తినడం హిందూదేశంలోని వివిధప్రాంతాల్లో ఆచారంలో ఉంటూఉంది.

ఆంధ్రప్రాంతంలో ఉగాది పచ్చడిలో వేప సంబంధమైనది పూవే వేస్తారు. మనకు పొరుగువారైన కర్ణాటకులకు కూడా ఉగాది మనతోపాటే. వారున్నూ ప్రాయకంగా వేపపువ్వే వాడతారు.

అరవవారి ఉగాది వేరేరోజు అయిఉన్నా వారుకూడా ఆనాడు పూవే వాడతారు. అయితే వారిలో చాలామంది వేపపువ్వును పంచదారతో నలుపుకొని తినేస్తారు. ఆంధ్రులతో సంపర్కం ఉన్నతావుల్లో వాళ్ళు

ఆంధ్రులలాగే వేపపువ్వు వేసి ఉగాది పచ్చడి చేసు

ఇక మాళవ, మహారాష్ట్ర, వంగదేశస్థులు ఉ
కాక వేప ఆకులు వాడతారు.

మాళవ దేశస్థులు ఉగాదినాడు వేపాకు
సేవిస్తారు. ఆనాడు ఇట్లా వేపపదార్థం తినడంవ
విధమైన రక్తవికారపు బాధ ఉండదని వారి నమ్మ

మహారాష్ట్రుల ఉగాది మన ఉగాది నాడే. క
వేపపూవు కాక వేపాకులు వాడతారు.

వంగదేశస్థుల ఉగాది మనకంటే నెలరోజు
వేపపువ్వు అరుదు అవుతుంది. వారు ఉగాది న
ఉగాదినాడే కాదు సంవత్సరం పొడుగునా వారు వే
వాడేటట్లు - వాడుతూ ఉంటారట.

ఆకు, పూవు - ఈరెండింటిలో దేని వాడ
ఈ సందర్భంలో పొడసూపడం సహజం.

ఆయుర్వేద వైద్యులు వాడే వేపపంచాంగ
చర్మవ్యాధుల్లో పచ్చివేపాకు నలుగుపెట్టుకుంటార
రోగులకు వీచోపు నిమిత్తం ఆకులు దట్టంగా ఉం
మశూచికాది రోగులు ఉండే ఇంటి ముంగిళ్ళ
కడతారు. ఇట్లా వేప ఆకు వైద్యోపయోగాలు, ఇ
అయినా చెప్పవచ్చు.

అయితే ఏమి! ఉగాదినాడు వేప ఆకుక

ఈ పర్వంనాడు తినడంలో ఎక్కువ విశిష్టత ఉందని చెప్పలేము. అందుచేత ఉగాదినాడు వేపపువ్వు వాడే ఆంధ్రుల ఆచారమే సంప్రదాయసిద్ధమైందీ. స్తవనీయమైందీ, సర్వోత్తమమైందీ.

వేప పువ్వు పచ్చిది పచ్చడిలో వేసుకుని ఉగాదినాడు తినడమేకాదు. అది విరివిగా దొరికే ఆ రోజులలో దానిని విశేషంగా సేకరించి ఎండబెట్టి ఉంచుకొని ఏడాది పొడుగునా వేయించుకుని కూరగానో, పచ్చడిగానో చేసుకొనీ - అది వేసుకొని చారుకాచుకునీ సేవిస్తూ రక్తశుద్ధిని, రక్త వృద్ధిని కలిగించుకోవడం ఆరోగ్యకాములగు ఆంధ్రులు తడవులను బట్టి పాటిస్తూ ఉన్న చక్కని ఆచారం.

ఏడాది పండుగనాడు ఏమి చేస్తే ఏడాది పొడుగునా అదే చేస్తు ఉంటారనే నానుడి వేపపువ్వు వాడకం విషయంలో మనకు బాగా హత్తింది.

**ఉగాది పచ్చడి ఉయివు**

వేపపువ్వు ప్రధాన ద్రవ్యంగా ఉగాదినాడు ఒక విధమైన పచ్చడి చేస్తారు. దీనికి ఉగాది పచ్చడి అనిపేరు. ఇది ఒక ఔషధయోగమని చెప్పవచ్చును.

కొత్త చింతపండు తెచ్చి నీటితో పిసికి గింజలు, ఉట్లు, తొక్కలు మొదలగునవి లేకుండా తీసివేసి చిక్కటి గుజ్జు తయారు చేయాలి. ఆగుజ్జులో కావలసినంత కొత్త బెల్లము వేయాలి. అందులో వేపపూవులను కాడలు, పుల్లలు లేకుండా బాగు చేసి వేయాలి. అట్లు తయారు చేసిన గుజ్జులో కొద్దిగా నెయ్యి చేర్చి కలియపెట్టి పుచ్చుకోవాలి. దీనిని పరగడుపున మొదటి జాములోనే పుచ్చుకోవాలి. దీనికి శాస్త్ర ప్రమాణం -

**శ్లో. యద్వర్షాదౌ నింబసుమం**
**శర్కరామ్ల ఘృతైర్యుతమ్**
**భక్షితం పూర్వయామేస్యా**
**త్తద్వర్షం సౌఖ్యదాయకమ్.**

ఉగాదినాడు ఆ సంవత్సరపు వేపపువ్వు, చక్కెర, చింతపండు, నెయ్యి కలిపి మొదటి జామునందే తింటే ఆ సంవత్సర మంతా సుఖంగా జరుగుతుందని పై శ్లోక తాత్పర్యము.

శాస్త్రంలో చక్కెర అని చెప్పబడి ఉన్నా కొత్త బెల్లము వేయడము సంప్రదాయంగా ఉంది.

మన పెద్దలు కొన్ని కొన్ని వస్తువుల వాడకానికి కొన్ని కొన్ని తిథులు గడవాలని నియమాలు విధించారు. వినాయక చవితి వెళితే కాని వెలగకాయలు, నాగులచవితి వెళితేకాని తేగలు తినకూడదని మన పెద్దల మాట. అట్లే కొత్త చింతపండు, కొత్త బెల్లము సంవత్సరాది వరకు ముట్టరాదన్నారు. సంవత్సరాదితో ఆయా పదార్థాలకు పురుడు వెళ్లిపోతుందనీ, కాగా అప్పటినుంచి వానిని తినవచ్చుననీ వారి అభిప్రాయం. ఇప్పుడు ఇట్టి నియమాలు అంతగా పాటించబడటం లేదు. ఇప్పుడు సంక్రాంతి నాటికే కొత్త బెల్లము, కొత్త చింతపండూ వస్తున్నాయి. వానిని అప్పటి నుంచే ప్రజలు ఆత్రంతో సేవిస్తూ ఉన్నారు. ఇది ఒకవిధంగా ఆరోగ్యనియమాలను ఉల్లఘించడమే. మన పూర్వుల దేహదార్ఢ్యాదులు ఈనాడు మనకు లేకుండా ఉండడానికి ఇట్టినియమోల్లంఘనం ఒక కారణంగా ఉంటున్నది.

కొత్త చింతపండు, బెల్లములలో ఉండే దోషాలయొక్క తీక్ణత ఉగాదినాటికి తగ్గి అవి అప్పటినుండి భుజింపతగినవై ఉంటాయని మన పెద్దల అభిప్రాయము.

శాస్త్రంలో వేపపువ్వు, చింతపండు, బెల్లము, నెయ్యి వీనితోనే ఉగాది పచ్చడి చేయాలని స్పష్టంగా చెప్పబడి ఉండగా వాడుకలో ఇంకా ఇందులో అనేకమైన వస్తువులు చేరుస్తూ ఉండడం కనిపిస్తూ ఉంది.

చాలామంది ఈ గుజ్జులో మామిడి కాయ ముక్కలు చేరుస్తున్నారు. మామిడి కాయలు శివరాత్రి నాటికి జీడి పిందెలుగా అవుతాయి. అయితే వానిని సంవత్సరాదికి పూర్వం తినకూడదని మన పెద్దలు నిషేధించి ఉన్నారు. సంవత్సరాదితో మామిడికాయలకు పురుడు వెళ్లిపోతుందికాబట్టి ఆనాటి పచ్చడిలో మామిడి కాయ ముక్కలు చేర్చడం చిరకాలంగా ఆచారమై ఉంది.

వేసవిలో తప్పక సేవించవలసిన ప్రకృతిదత్త పదార్థాలలో మామిడి కాయలు ప్రముఖమైనవి. వడదెబ్బకు తట్టుకునే శక్తిని మానవునకు ప్రసాదించే కాయలలో మామిడికాయలు ముఖ్యంగా పేర్కొన తగినవని ఆయుర్వేద గ్రంథములు చెబుతున్నవి. కాగా ఉగాదిపచ్చడిలో మొదటిసారిగా మామిడి కాయముక్కలను చేర్చుకొని సేవించి ఆమీదటవసంత గ్రీష్మ ఋతువులలో మామిడికాయలు యథేచ్ఛగా

ఉపయోగిస్తూ రావడం ఆరోగ్య మార్గమని గుర్తింపవచ్చును.

చెరుకుముక్కలు, అరటిపళ్లు మొదలయినవి కూడా ఈ ఉగాది పచ్చడిలో చేర్చడం కొన్ని ప్రాంతాల్లో ఆచారమై ఉంది. ఇవి చేర్చే విషయంలో .అభ్యంతరం చెప్పడానికి ఏమీ ఆస్కారం కనిపించదు.

ఈ పచ్చడిలో కొందరు తేనె కూడా కలుపుతారు. యూదులు తమ సంవత్సరాదినాడు ద్రాక్షపండ్లు తేనె తింటారనే విషయం తెలుసుకోవడానికి ఈ సందర్భంలో ముచ్చటగా ఉంటుంది. "హిందువుల పండుగల"లో శ్రీసురవరము ప్రతాపరెడ్డి వ్రాసిన దానినిపట్టి ఈ పచ్చడిలో గసగసాలు, చారపప్పు మొదలయిన మసాలా దినుసులు వేయడం కూడా కొన్ని ప్రాంతాల్లోవాడుకగా ఉన్నట్లు కనిపిస్తుంది. వృద్ధాచారరీత్యాకాని, ఆరోగ్యవిజ్ఞానదృష్ట్యా కాని ఈ ఉగాదిపచ్చడిలో మసాలా దినుసులు చేర్చడం సమర్థనీయం కాదని చెప్పవలసి ఉంటుంది.

ఈ పచ్చడిలో ఉప్పు ఎంత మాత్రం చేర్చకూడదు.

వసంత ఋతువు ప్రారంభంలో ఆకాలాన దొరికే వేపపువ్వు, చింతపండు, బెల్లము కలిపి పచ్చడి చేసి సేవించడం రాగల కాలానికి ఒకవిధముగా స్వాగతోపచారం చేయడమే కదా! మధురామ్ల ద్రవ్యాలతో చేర్చి చేదురసము గల వేప పువ్వును గుజ్జు పచ్చడిగా చేసికొని తినడంలో వేదాంతార్థం కూడా కొంత యిమిడి ఉందనవచ్చు. ఈ పచ్చడి తినడం తియ్యనినోట చేదు మేపడమే. వేప తిక్తరస ప్రధానమైనది. తిక్త పదార్థాన్ని మధురామ్ల ద్రవ్యాలతో కలిపి తినడం కాలం కొనిరాగల కష్టసుఖాలకు తాము సంసిద్ధులమై ఉన్నామని చాటడం. కష్టాలుకానీ, సుఖాలురానీ మేము అనుభవిస్తామనడానికి ఈ పచ్చడి సేవనంఒక సూచన. రాగల అరిష్టాలకు, అదృష్టాలకు మేము సిద్ధంగా ఉంటామని శపథం తీసుకొన్నదానికి ఈ పచ్చడి లక్ష్యమై ఉంటుందని భావించవచ్చు.

## (7) పంచాంగ శ్రవణం

ఉగాదినాడు పంచాంగ పూజ సల్పి మధ్యాహ్నం పంచాంగ శ్రవణం చేయడం ఆచారమైఉంది.

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు అనే అయిదు అంగములు గలది పంచాంగము.

సంపదకోరేవాడు తిథి విషయమై జాగ్రత్త వహించాలి.

దీర్ఘాయువును కోరేవారు వారం విషయంలో మెలకువవహించాలి.

పాపం నుంచి విముక్తి కోరువాడు నక్షత్ర విషయం గమనించాలి.

రోగాలనుండి రక్షణ కోరేవారు యోగవిషయం శ్రద్ధ పెట్టాలి.

తాను చేసే పనులలో విజయం కోరేవారు కరణం విషయం జాగ్రత్త పడాలి.

పంచాంగముల ప్రయోజనమిట్టిది.

గ్రహాదుల ప్రభావం సరిగ్గా తెలుసుకొని జాగ్రత్తగా వర్తిస్తే మానవుని జీవితం సుఖాస్పదమున్నూ, జయప్రదమున్నూ అవుతుంది. గ్రహాదుల ప్రభావం సరిగ్గా తెలుసుకోవడానికి పంచాంగ పరిజ్ఞానం చాలా అవసరం. తెలివైన వాళ్లు నక్షత్రాలను తమకు అనుకూలంగా నడుపుకుంటారనేనానుడి ఈ సందర్భంలో పుట్టిందే.

అయితే పూర్వకాలంలో పంచాంగాలు ఇప్పటిలాగ అచ్చుపడి అందరికి అందుబాటులో ఉండేవికావు. అప్పుడు పంచాంగాలు తాటాకులమీదకాని, భూర్జర పత్రాలమీద కాని వ్రాసి ఉండేవి. ఒక్కొక్క గ్రామానికి ఆ గ్రామ పురోహితుడి వద్ద మాత్రమే అపురూపంగా ఒక పంచాంగం ఉండేది.

ఆ పంచాంగం ఆధారంగా పెట్టుకుని అతడు గ్రామస్థులకు పండుగలు, పబ్బములు, నోములు, వ్రతాలు, చేయవలసిన రోజులు, ప్రయాణాది విషయాలలో మంచి చెడ్డలు, ముహూర్తములు మొదలయినవి చెప్పేవాడు.

సంవత్సరాదినాడు ఊళ్లో దేవాలయంలో అతడు కొత్త పంచాంగానికి పసుపుబొట్టు పెట్టి పూజ చేసేవాడు. అచట చేరినవారికి పంటపర్యాయాలు, వర్షయోగాలు, రాజపూజ్యావమానాలు, ఆదాయవ్యయాలు, కందాయ ఫలాలు, గ్రహణ కాలాలు మొదలయినవి చెప్పేవాడు.

దీనినే పంచాంగ శ్రవణ మంటారు. అబ్దఫలము తెలిసికోవడానికి ఇది అవసరము.

విద్వాన్ కావ్యతీర్థ శీమద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి పంచాంగ శ్రవణ ఫలమును ఇట్లు చక్కగా వివరిస్తున్నారు.

"వత్సరాదినాడు పంచాంగ శ్రవణము మహాఫలప్రదము. నూతన సంవత్సరమునందు గలుగబోయెడి ఫలాఫలములు ఆదాయ వ్యయములు, గ్రహచారములు మొదలగునవేక విషయములు ముందుగా దెలిసికొన దగినవిగా నుండును. ఇక ముందు సంవత్సరము పొడుగునను ఆచరింప దగిన శ్రౌత స్మార్తాది కర్మముల కన్నిటికిని కాలవిశేషములను దెలియజేయునది పంచాంగవే గనుక ఆ నూతన సంవత్సర పంచాంగమును బూజించి వత్సరాదినాడే భగవత్సన్నిధానమున వినిపించి తామును శ్రవణము చేయవలయును. కనుకనే

**శ్లో: శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం**
**గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్**
**ఆయుర్వృద్ధిద ముత్తమం శుచికరం సంతాన సంపత్ప్రదం**
**నానా కర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.**

అని పంచాంగ శ్రవణమునకు ఫలశ్రుతి చెప్పబడినది.

## (8) ప్రపాదాన ప్రారంభం

ఉగాదినాడు చేయవలసిన మరి ఒక విధాయక కృత్యము ప్రపాదాన ప్రారంభం.

ప్రప అనగా చలిపందిరి. ప్రపాదాన మనగా చలివేంద్రం పెట్టి దాహతీర్థములు ఇవ్వడం. అట్లా ఇవ్వడానికి సంవత్సరాదినుంచి ప్రారంభం చేయాలి.

సంవత్సరాది వసంతఋతువుకు మొదటి దినం. వసంత ఋతువు పై బడ్డ కొద్దీ ఎండలు మెండై గ్రీష్మ ఋతువులో భరింపరానివిగా ఉంటాయి. కాగా ఈ రోజులలో దప్పిక కొన్నవారికి దాహతీర్థాలు ఈయడం పుణ్యకార్యము. ప్రతివారు చలివేంద్రాలు పెట్టలేరు. యథాశక్తిని దాహతీర్థాలు ఇస్తూ ఉండాలి.

**"సలిలమున నిల్చు బ్రాణము సలిలదాత**
**ప్రాణదాత యనంబడు"**
**మధుసుమాసంబు మొదలుగా మంచినీళ్లు**
**చల్లతోగల్పి పానీయశాలగట్టి**
**పోయువారల పుణ్యంబు పోలు వారలు**
**భయలోకంబులందును శుభము గంద్రు - శేష ధర్మము.**

## (9) రాజదర్శనం

స్వప్నంలో అయినా రాజదర్శనమయితే శుభప్రదమంటారు. అందులో ఉగాది రోజున రాజదర్శనం చేస్తే శ్రేయోదాయకమవుతుంది. ఉగాదినాడు మన శ్రేయస్సు కోరేవారిని, మనకి వృత్తి దాతలైనవారిని చూస్తూ రావడం చిరకాలంగా ఆచారమై ఉంది. దూరప్రదేశాన ఉండి అప్పట్లో చూడ వీలు లేకుండా ఉంటే వారికి తపాలు ద్వారా శుభాకాంక్షలు పంపడం ఇప్పుడు ఆచారమై ఉంది.

## (10) వాసంత నవరాత్రి ప్రారంభం

మన ఉగాది చైత్ర మాసపు తొలిరోజుకదా! చైత్రమాసంతో వసంత ఋతువు ఆరంభం. చైత్ర వైశాఖ మాసాలు వసంతఋతువు.

చైత్రమాసానికి మధుమాసమని, మధువు అని కూడా పేళ్లు ఉన్నాయి. మధువు అనగా అనేకార్థాలతోబాటు చైత్రమాసమనీ, వసంత కాలమనీ. మధుమాసమనగా వసంత మాసం. వేదకాలంలో చైత్రమాసానికి మధుమాసమనే పేరు ఉండినట్లు 'మధుశ్చ మాధవశ్చ వాసంతి కావృత్' అనే యజుర్వేద వాక్యాన్ని పట్టి చెప్పవచ్చునని అంటున్నారు.

కాలం వసంతకాలం. పేరు వసంత ఋతు సందర్భాన్ని సూచిస్తూ ఉంది. వసంతము ఋతురాజము. కాగా అతనికి స్వాగతోపచారాలు చేయడానికి మన పెద్దలు తొమ్మిది రోజులు నిర్దేశించారు.

ఏడాదినాడు కలశస్థాపన చేసి నాటి నుంచి తొమ్మిది రోజులు వసంత నవరాత్ర పూజ చేస్తే అప మృత్యుభయం ఉండదని ధర్మ సింధువు చెబుతూ వుంది. ఈ తొమ్మిది రోజులకు వాసంత నవరాత్రులు అనిపేరు.

నవరాత్రమనగా తొమ్మిది రాత్రులు అని అర్థము. రాత్రి శబ్దము సమాసవశమున రాత్రమై ఈ రూపం ఏర్పడుతూ ఉంది. అయితే రాత్రమంటున్నారు కదా ఈ సందర్భమున పగలు పూజాదికాలు ఏమీ ఉండవా అనే ప్రశ్న కలగవచ్చును. ఈ సందర్భమున పగటి కాల పూజలు కూడా ఎక్కువగానే ఉన్నాయి. కలశస్థాపనాది కార్యకలాపమంతా పగలే జరుగుతుంది. అయితే రాత్రి హరికథాలాపాలకు, పూజాదికములకు ఎక్కువ వీలుగా ఉంటుంది. కాబట్టి రాత్రి శబ్దానికి ప్రాధాన్యమీయబడింది.

నవరాత్రముల పేరితో ఏడాదికిమూడుపర్వాలు జరపబడుతున్నాయి. అవి క్రమంగా వాసంత నవరాత్రాలు, గణపతి నవరాత్రాలు, శారదనవరాత్రాలు.

ఇప్పుడు గణపతి నవరాత్రాల కంటే వాసంత నవరాత్రాలున్నూ వాసంత నవరాత్రాల కంటె శారద నవరాత్రాలున్నూ ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి.

వాసంత నవరాత్రాలు చైత్రమాసాదిని, శారద నవరాత్రాలు ఆశ్వీయుజ మాసాదిని. ఈ రెండింటికి ఆరుమాసాల వ్యవధి. వసంత, శరత్కాలారంభ దినాలు యమదంష్ట్ర దినాలనీ, అప్పటి అరిష్టాలు అనారోగ్యాలు తొలగడానికి భగవదారాధన ప్రబలంగా జరగాలనీ దేవీభాగవతము చెబుతూ ఉంది.

వసంత నవరాత్రాల ఉత్సవం ఈ దేశాన అతి ప్రాచీన కాలంనుంచి ఉన్నట్లు కనిపిస్తుంది.

వాత్స్యాయన కామ సూత్రములలో ఈ ఉత్సవం సువసంతకమనీ, మదనోత్సవమనీ పేర్కొనబడి ఉంది. ఈ ఉత్సవానికి అధిదేవత వసంతుడు. ఋతురాజైన వసంతుని పూజించుటచేత కాలాత్మకుడైన పరమేశ్వరుడు ప్రసన్నుడు అవుతాడు. ఈ ఉత్సవ సందర్భాన ప్రతిదినం నృత్యాలు, నాట్యాలు, పాట కచ్చేరీలు జరిగేవి. రాజుల దర్బారుల్లో పండిత గోష్ఠులు, శాస్త్రవిచారణలు, నాటక ప్రదర్శనాలు నడిచేవి. ఈ ఉత్సవాలలో సంగీతం ప్రాధాన్యమై ఉండేది. ఆ కాలాన ఉపయోగించే నిమిత్తం వసంత రాగమును మేళకర్తలు ప్రత్యేకం కూర్చారు.

రెడ్డిరాజుల, విజయనగరరాజుల కాలంలో ఈ వసంతోత్సవాలు ఆంధ్రభూమి మీద చాలా గొప్పగా జరిగేవి. వసంతోత్సవ సంబంధమైన వేడుకలు ఉద్యానవనాల్లో జరిగేవి. మామిడి చెట్టు కింద మంటపం ఏర్పరచేవారు. దానిమీద పూర్ణ కలశాన్ని నెలకొల్పేవారు. కస్తూరి, కర్పూరం మొదలయిన సువాసన ద్రవ్యాలు, మరువము, దమనము మొదలయిన సువాసన పత్రాలు విరివిగా కూర్చేవారు. పూజాపీఠము మీద వసంతుని, రతి మన్మధులను, లక్ష్మీనారాయణులను, గౌరీశంకరులను, శచీ పురందరులను నెలకొల్పేవారు. ప్రభువు హయారూఢుడై ఊరేగుతూ వచ్చి ఉద్యానవనంలో దిగి మంటపము వద్దకు వెళ్లును. అక్కడ నెలకొన్న దేవతలను పూజించును. అప్పుడు మంగళ వాద్యములు, వారాంగనల నృత్యాలు, పూజ జరుగునప్పుడు సభలో పన్నీరు, వసంతము జల్లుకొనేవారు. ఆసమయాన విద్యా వినోదాలు, వినోద క్రీడలు ప్రదర్శింపబడేవి.

రాజులు చేయు వసంతోత్సవం ఈమాదిరిగా ఉండేది. గృహస్థులు యథాశక్తిని తమ గృహాలలో కలశ స్థాపాన చేసి పూజాదికాలు చేసేవారు. 'దమనేన బ్రహ్మ పూజనం' అనే శీర్షిక క్రింద ఈ దినాలలో జరిగే వివిధ దేవతల పూజా వివరాలు తెలిసికొని ఉన్నాము.

ప్రతి ఊర ఉండే దేవాలయాల్లో ఈ వసంతనవరాత్రాలు వేడుకగా జరిపించే ఆచారం ఇప్పటి కంటె ఎక్కువ ప్రచారానికి వస్తే ప్రజలలో ఆస్తిక్యభావం బాగా పెంపొందకలదు.

**ఉగాది : ఆంధ్రకర్షకులు**

కృష్ణా గోదావరి ప్రాంతపు రైతుల ఉగాదినాడు ఏరువాక సాగుతారు. ఎద్దులను కట్టి దున్నుటకు సిద్ధపరచిన నాగలిని ఏరు అందురు. ఏరువాక అనగా దున్నుటకు ఆరంభించుట అని అర్థము.

రైతులు ఉగాదినాడు తలంటి పోసుకొని. బొట్టుపెట్టుకొని, కొత్త బట్టలు కట్టుకుని నాగలికి పాతతాళ్లు తీసివేసి పసుపు రాసిన కొత్త తాళ్లు కడతారు. నాగలికి కాడికి రావిమండలు కడతారు. ఎడ్లకు పసుపురాసి కుంకుమబొట్టు పెట్టి పూజిస్తారు. కొత్తకర్ర పదకొండు లేక తొమ్మిది గణుపులది. దాపలిఎద్దు వెలపలి కొమ్ముకి, ఆ పక్కనే కాడికి, చేతి కర్రకు ముడేసి రావిమండలు కడతారు. పసుపురాసి గంధం కుంకుమబొట్లు పెడతారు, ఏటి కర్రకు, మేడితోకకు కూడా పసుపు రాస్తారు.

నాగలిలేని రైతులు గెడ్డపార పాతి దానికే కొబ్బరికాయ కొడతారు.

ఏరువాక సాగిన తరువాత మూడు రోజులు ఎడ్లకు ఎట్టి పని కాని చెప్పరు. నాలుగో రోజు నాగలిని విప్పి జాగ్రత్త పెడతారు. ఏరువాక సాగినవారు పొలంలో సరుకు కాని, ఇంటివద్ద సరుకుకాని అప్పుసప్పులుగా ఈయరు.

ఏకారణము చేతకాని ఉగాదినాడు ఏరువాక సాగడానికి వీలు లేకపోతే మరి ఒక మంచిరోజున సాగుతారు. ఏరువాక సాగనిదే కొత్త సంవత్సరంలో ఎడ్లచేత మరేయే వ్యవసాయపనిన్నీ చేయించరు.

తెలంగాణమునందలి కొన్ని భాగాలలో ఈనాటి సాయంకాలం ఊరిలోని బండ్లను అన్నింటినీ అలంకరిస్తారనీ, మంచి ఎడ్లను పూన్చి వానిని కొంత దూరము సాగిస్తారనీ తెలియవస్తూ ఉంది.

చైత్రశుక్ల పాడ్యమినాడు చతుర్వర్గ చింతామణిలో విద్యా, పౌరుష ప్రతిపత్, తిలక, ధనావ్యాప్తి, సర్వాప్తి, చతుర్యాగ, చతుర్మూర్తి, దేవమూర్తి నదీ, లోక, శైల, సముద్ర, ద్వీప, సప్తమూర్తి, సప్త సాగర మున్నగు పెక్కు వ్రతాలు చేస్తారని ఉంది.

## చైత్రశుద్ధ విదియ

'చైత్రశుద్ధ విదియ వేదవ్యాసతీర్థానాం పుణ్యాదినమ్' అనీ శ్రీమధ్వ పుణ్య తీర్థమనీ ప్రసిద్ధి. పెరియపెరుమాల్ తిరు నక్షత్రం ఈనాడని ఆళ్వాచార్యుల చరిత్ర.

చతుర్వర్గ చింతామణి "నేత్ర ద్వితీయ ప్రకృతి పురుష ద్వితీయ వ్రతాలు" ఈనాడు చేస్తారని అంటూ ఉంది.

ఈనాటి వివరణలో మన పంచాంగకర్తలు 'ఉమాశివాగ్ని పూజ' అని వ్రాస్తారు.

స్మృతికౌస్తుభము ఈనాడు బాలేందు వ్రతం చేస్తారని, ఉమ, శివుడు, అగ్ని,-ఈ ముగ్గురు దేవతలకు దమనముతో పూజ జరగాలని చెబుతోంది. బ్రహ్మపురాణంలో ముగ్గురికి సంబంధించిన ఒక కథ చెప్పబడుతూ ఉంది.

పార్వతి భర్తతో ఏకాంతంగా క్రీడిస్తూ ఉంది. ఆ సమయంలో అక్కడికి అగ్ని భట్టారకుడు రావడం తటస్థించింది. అగ్నిని చూచి శివుడు పార్వతిని విడిచి దూరంగా వెళ్లిపోయాడు. అప్పుడు శివునికి వీర్యపతన మైంది. క్రీడాభంగానికి కనలి పార్వతి ఆ శివుని వీర్యాన్ని ధరించ వలసినదిగా అగ్నిని ఆజ్ఞాపించింది. అగ్ని ఈ వీర్యాన్ని భరించి కుమారస్వామి జననానికి కారణభూతుడుగా అయ్యాడు.

ఉమాశివాగ్నిపూజ ఈ గాధకు సంబంధించింది అగునా!

స్కందపురాణంలో చైత్రశుద్ధ విదియనాడు అరుంధతీవ్రతం చేయాలని ఉంది. ఆ వ్రతం చైత్రశుక్ల పాడ్యమి మొదలు తృతీయ వరకు చేయాలని చతుర్వర్గ చింతామణి. చైత్రశుక్ల ద్వితీయ రోజున అరుంధతి, వశిష్ఠ, ధ్రువ అనే మూడు విగ్రహాలను ప్రతిష్ఠించి పూజించాలి.

వ్రత విధానం పరికించగా ఇది ప్రత్యేకం స్త్రీల సుమంగలీత్వాన్ని కాపాడ్డానికి ఉద్దిష్టమైందిగా కనిపిస్తూ ఉంది. పురుష సంబంధమైన వ్రతోత్సవాలు బాగా ప్రచారంలో ఉన్నాయి. స్త్రీ సంబంధమైనవి

పెక్కులుబాగా జరగడం లేదు. జరిగేవి అయినా శాస్త్రానికి చాలా దూరంగా ఉంటున్నాయి. ఈ వ్రతం ఇప్పుడు పూర్తిగా రూపుమాసి పోయిందనీ రెండువేల సంవత్సరాలకి పూర్వమే విస్మరింపబడి ఉంటుందనీ, వ్రతోత్సవ చరిత్ర కారుడు అంటున్నాడు. కాని గ్రంథాంతర నిదర్శనాలను బట్టి ఇది హిందూ దేశంలో ఇప్పటికి కూడా మూలమూలలందు ఆచరింప బడుతూ ఉన్నట్లే కనిపిస్తుంది.

అర్వాచీనమైన అనేక ఇతిహాసాల్లో ఈ వ్రతోత్సవ ప్రస్తావన ఉంది. ఈ వ్రతసందర్భంలో చదివే ప్రార్థనశ్లోకానికి అర్థం ఇది.

"ఏ జన్మలో కూడా నాకు వైధవ్యం కలక్కుండా ఉండేటట్లు అనుగ్రహించు, పుత్ర సంపద ప్రసాదించు. ఈ కోరికలు ఈడేర్చుకునే టందుకు నేను ఈ అరుంధతీ వ్రతం చేస్తున్నాను."

దీనిని బట్టి ఈ వ్రతం చేయడంలో గల ఉద్దేశ్యం చాలా ఉత్తమమైంది కావడం ద్యోతకమవుతుంది. అందుచేత ఈ వ్రతం పునరుద్ధరింప బడతగిందిగా కనిపిస్తుంది.

ఈ వ్రత సందర్భంగా చెప్పబడే కథ వినండి.

ప్రాచీనకాలంలో సర్వశాస్త్రవిదుడైన బ్రాహ్మణుడు వుండెను. అతనికి అత్యంత సుందరమైన ఒక కుమార్తె. ఆమెకు బాల్యంలోనే వైధవ్యప్రాప్తి ఆయెను. ఆమె యమునానది ఒడ్డున తపస్సు చేస్తూ వుండెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు ఆమెకు ప్రత్యక్షమయ్యారు. ఆమె బాల్యంలోనే వైధవ్యం పొందడానికి హేతువు ఏమిటని పార్వతి పరమేశ్వరుణ్ణి అడిగింది. అప్పుడు పరమేశ్వరుడు ఇట్లా చెప్పాడు.

పూర్వకాలంలో ఒక బ్రాహ్మణుడు. అతడు సమానవయస్సు గల సవర్ణ స్త్రీని వివాహమయ్యెను. పెళ్లి జరిగిన తరువాత అతడు పరదేశానికి పోవలసివచ్చింది.

పరదేశానికి పోయి అక్కడ అతడు వేరే స్త్రీని వివాహం అయి అక్కడేవుండి పోయెను. స్వదేశంలో భార్యను వదిలి వేసిన దోషానికి, పరదేశంలో పరస్త్రీ సహవాసం చేసిన పాపానికి ఫలం అతడు ఇప్పుడు ఈ బాలవిధవగా అనుభవిస్తున్నాడు.

నిర్దోషి ఐన భార్యను వదలి దేశాంతరం లేచి పోయే భర్త, అంధుడు మాదిరిగా సముద్రంలో మునిగిపోతాడు. ఎవడైతే తన స్త్రీని వదిలి పర

స్త్రీని తగులుకు పోతాడో లేదా ఇంట్లో వుంచుకుంటాడో వాడు బాలవైధవ్యం అనుభవిస్తాడు. స్త్రీ అన్యపురుషునితో మనస్సు చేతకాని, క్రియచేత కాని వ్యభిచరించినట్లయితే అసహ్యాకరమైన బాలవైధవ్యం అనుభవింపవలసి వుంటుంది. ఈ బాల విధవ ఉత్తరజన్మలో వైధవ్య దు:ఖ భారాన్నుంచి రక్షితురాలు కావడానికి ఇప్పుడు అరుంధతి వ్రతం చేయాలి. పుణ్య స్త్రీలు చేస్తే ఉత్తరజన్మలో కూడా వారికి వైధవ్యప్రాప్తి వుండదు. స్త్రీలు పతివ్రతలు కావాలనేటట్లే పురుషులు పత్నీవ్రతులు కావాలనడం ఈ వ్రతోత్సవం యొక్క ప్రధానోద్దేశంగా కనిపిస్తుంది.

అయితే ఈనాడు పంచాంగాలలో చెప్పబడే ఉమ, శివ, అగ్నిపూజకు ఈ వ్రత పూజకు ఏమీ సంబంధం కనబడదు. దీనిని గురించి ఇంకా కొంత పరిశోధన సాగవలసి ఉంది.

అరుంధతీ వ్రతము ఆచరణనుండి తప్పి పోయినది కాని వివాహములలో అరుంధతీ దర్శనము ఆచారము మాత్రము నేటికి, నిలిచి వున్నది. పెండ్లి నాటి రాత్రి ఔపోసనాంతరము నక్షత్రరూపమున ఉండే ఈమెను పాతివ్రత్య నిష్ఠకుగాను పెండ్లి కుమార్తెకు చూపిస్తారు. అరుంధతి అనగా ఏ కారణం చేతకానీ ధర్మమును అతిక్రమించనిది అని అర్థము. అరుంధతి ప్రశస్తగాథను పౌరాణికుడు శ్రీతి. గోపాలకృష్ణమాచార్యులు 'పంచానన' (1-8-1932) పత్రికలో ఇట్లు వ్రాస్తున్నారు.

"పూర్వము చంద్రభాగానదీతీరమున మేధాతియను ఋషి తన ఆశ్రమము నందు పంద్రెండు సంవత్సరముల పర్యంతము చేసిన జ్యోతిష్టోమమనెడు మహాయజ్ఞమున ఒకస్త్రీ పుట్టెను. బాల్యదశలో ఋష్యాశ్రమమందే పెరిగి కౌమారదశ సంప్రాప్తము కాగానే ఉపదేశమునకు తగిన కాలమనియూ, "స్త్రీభిస్త్రీయశ్శ్యోపదేశ్యా:" యనురీత్య, స్త్రీలు స్త్రీల వలననే ఉపదేశింపబడవలె ననియూ, మేధాతిధిఋషి భావించెను. మరియు సావిత్రీదేవి, బహులాదేవి, శచీదేవి, వీరలు పతివ్రతాధర్మముల నుపదేశించుటకు తగినవారలని బ్రహ్మదేవుడు నిశ్చయించి తెలిపినందున ఆఋషి, సూర్యమండలం మధ్యలో పద్మాసనాస్థురాలై అక్షమాలను ధరించియుండిన, సావిత్రీదేవిని దర్శించినందున, ఆదేవి మానసాచలము మీద ప్రతిదినమూ బహులాదేవి, గాయత్రీదేవి, సరస్వతీదేవి, ద్రుపదాదేవి.

మొదలగు పంచమాతృకలతో సభదీర్చి, ధర్మాఖ్యానములనూ, సాధ్వీమ తల్లుల చరిత్రములనూ అరుంధతీదేవికి బోధించి సౌచారిత్ర వంతురాలిగా జేసిరి. అరుంధతీదేవి పూర్వజన్మము నుండికూడా తపోవృత్తిలో మెలగినందున సమస్త స్త్రీధర్మములనూ సంపూర్ణముగా గ్రహించెను. ఇట్టి ఉపదేశకాలము దేవమానరీత్య ఏడుసంవత్సరముల కాలము జరిగినంతలో ఆ దేవికి యవ్వనదశ ప్రాప్తమైనది గనుక పూర్వము బ్రహ్మదేవుడు సంకల్పించినవిధముగా బ్రహ్మ మానసపుత్రుడగు వసిష్ఠమహామునిని తగిన వరునిగా నిశ్చయించి త్రిమూర్తులాదిగా సకల దేవతలూ ఋషులూ శుభముహూర్తమున దేవసభలో బ్రాహ్మధర్మము ననుసరించి వివాహము జేసిరి. అట్టి సమయమున బ్రహ్మదేవుడు ఆ దంపతులకు త్రిలోకముల యందునూ సంచారము చేయగల ఒక విమానమునూ, జలపూరితమగు ఒక కమండలమునూ ఇచ్చెను. సమస్త దేవతలకునూ పొంద సాధ్యముకాని ఉత్తమస్థానమును విష్ణు దేవుడు ఇచ్చెను. సప్త కల్పాంతముల వరకూ జీవించునట్లు రుద్రుడు వరమిచ్చెను. అదితీదేవి బ్రహ్మదేవునివల్ల నిర్మితమైన తన కర్ణకుండలములనిచ్చెను. దేవేంద్రుడు బహురత్నములనూ, కుబేరుడు బహుధనమునూ యిచ్చిరి."

అరుంధతీ దేవి వసిష్ఠులతో దేవదత్తములగు లోకోత్తరస్థానమును చేరి స్త్రీలను ధర్మమందు నియోజించి లోకహితమును గోరుచుండును. పురుషులకు ఉపనయనకాలము ఉపదేశకాలముగా నుండునట్లు స్త్రీలకు వివాహకాలము ఉపదేశకాలముగానుండును. కనుక వివాహకాలమున అరుంధతీదర్శనము. .

అరుంధతికి వికృతి ఆరంజోతి అనీ ఆమె కర్దముని కూతురని పురాణనామచంద్రిక. అరుంధతిని గురించి భిన్నములయిన పెక్కుగాథ లున్నాయి. వానికి ఒకదానికొకటి పొంతన లేదు.

కాని సర్వేసర్వత్ర అమలులో ఉన్న నమ్మకం ఒకటి అరుంధతిని గూర్చి ఉంది. అది ఏమిటంటే మరణము ఆసన్నమైన అరుంధతీ నక్షత్రాన్ని చూడలేరని చెబుతారు.

శాస్త్ర విజ్ఞానము అవధులు దాటుతూ ఉన్న ఈ రోజుల్లో ఈ నమ్మకం ఎంత వరకు శాస్త్ర సమ్మతమయిందో తేల్చి తెలియచెప్పవలసిన బాధ్యత శాస్త్రజ్ఞుల మీద ఉంది.

# చైత్రశుక్లతదియ

శివడోలోత్సవము, సౌభాగ్యగౌరీ(వ్రతం. ఉత్తమమన్వాది.

చై(త్ర శుక్ల పాడ్యమితో వసంత నవరా(త్రులు (ప్రారంభమవుతాయి. వసంత నవరా(త్రులు తొమ్మిది రోజులలో ఇది మూడోరోజు. వసంత నవరా(త్రులు వసంతోత్సవానికి (ప్రత్యేకింపబడ్డవికదా! అయినా ఆనవరా(త్రులలో ఈ మూడో రోజు (ప్రత్యేకం ఒక పర్వమై ఉంది.

ఈనాటి వివరణలో మన పంచాంగకర్తలు శివడోలోత్సవం. సౌభాగ్యగౌరీ (వ్రతం, సౌభాగ్యశయన (వ్రతం, మానసగౌరీ(వ్రతం, ఉత్తమమన్వాది అని (వ్రాస్తారు.

చై(త్ర శుక్ల తదియ నాడు శివడోలోత్సవమున్నూ, చై(త్రశుక్ల ఏకాదశినాడు విష్ణుడోలోత్సవమున్నూ ఏర్పాటై ఉన్నాయి. శివడోలో త్సవమునాడు ఉమా శివులను దమనముతో పూజించి డోలోత్సవం చేస్తే గొప్ప ఫలితాన్ని ఇస్తుందని ధర్మశా(స్త (గంథాలు చెబుతున్నాయి. దీనిని ఆందోలన (వ్రతమంటారు. ఈ (వ్రతానికి విదియతో కూడిన తదియ పనికిరాదనీ, చవితితోకూడిన తృతీయ ముహూర్త మా(త్రం ఉన్నా (గాహ్యమనీ స్మృతి కౌస్తుభం.

ఈ శివడోలోత్సవ పర్వం హిందూదేశంలో పలు(ప్రాంతాల్లో పలురీతుల ఆచరింపబడుతూ ఉంది. ఆ ఆచరణ ఆయా (ప్రాంతాల్లో స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తూ ఉంది. ఈ పండుగ స్త్రీలలో ఎక్కువగా ఉండడమే కాదు (ప్రత్యేకం స్త్రీ దేవతపేర సౌభాగ్య గౌరీ(వ్రతం మున్నగు నామాలతో వ్యవహరింపబడుతూ ఉంది.

ఈ పర్వం గౌరి నామంతో చెలామణీకావడానికి కారణం ఉంది. దాక్షాయణి అగ్నికి ఆహుతి అయి చనిపోయి హిమవత్పర్వతానికి కూతురుగా పుట్టింది. పర్వతునికి పు(త్రికగా పుట్టింది కాబట్టి ఈ జన్మలో ఆమెకు పార్వతి అనే పేరువచ్చింది. పార్వతి పర్యాయనామాల్లో గౌరి అనేది (ప్రసిద్ధమైనది. ఆమె పరమేశ్వరుణ్ణి పతిగాపొందడానికి తపస్సు చేసింది. ఆమె తపస్సు చై(త్రమాసంలో శుక్లతదియనాడు ఫలించింది. అందుచేత ఆనాడు గౌరిపేరపరిగే ఒక పర్వమైంది. శివడోలోత్సవంలో ఉమా శివులకు దమనముతో పూజ (ప్రధానమని తెలిసికొని ఉన్నాము. ఈ పూజ కాల(క్రమాన సౌభాగ్య గౌరీ (వ్రతం, సౌభాగ్యశయన(వ్రతం, మాసగౌరీ(వ్రతం

మున్నగునామాలతో స్త్రీలవ్రతాల్లో చేరింది.

ఈ వ్రతాలు హిందూ దేశంలో వివిధ ప్రాంతాల్లో వివిధరీతుల జరుపబడుతున్నాయి. ఆ విషయం కొంత తెలుసుకుందాము.

చైత్రశుక్ల తదియను మహారాష్ట్ర పంచాంగములు గౌరీతృతీయ అని పేర్కొంటాయి. గౌరితపస్సు ఈనాడు ఫలోదయాంతం కావడం చేత దీనికి ఈపేరు తగిఉందని చెప్పవచ్చు.

ఈనాడు మొదలు పెట్టి మహారాష్ట్ర స్త్రీలు ఒక నెలరోజులు అనగా వైశాఖ శుక్ల తదియ వరకు గౌరీ వ్రతం చేస్తారు. ఇది సౌభాగ్యప్రదమైన వ్రతం కావడం చేత సౌభాగ్య గౌరీవ్రతమని పిలువబడుతూ ఉంది.

సౌభాగ్యప్రదమైన ఈ వ్రతప్రస్తావన దేవీ పురాణము, హేమాద్రిమున్నగు గ్రంథాలలో ఉంది. అయితే అది అక్కడ గణ గౌరి అనే పేరుతో పేర్కొనబడింది. అచటి ప్రస్తావనను పట్టి చూడగా ఇది కేవలం స్త్రీలు మాత్రమే ఆచరించే గౌరీ ఉత్సవం అయి ఉంది. శాస్త్రప్రకారం చూడగా ఇది రెండురోజుల పండుగగా కనిపిస్తుంది. కాని లౌకికంలో ఆ విధానం కానరాదు.

వ్రత గ్రంథాలను పట్టి చూడగా చైత్రశుక్ల తృతీయ నాడు మహాదేవుడితోకూడిన గౌరికి పూజచేయాలి. ఆ పూజలో కుంకుమ, అగరు, కర్పూరం, హెచ్చుగా వాడాలి. అలంకారానికి మణులు, మంచి వస్త్రాలు వాడాలి. రాత్రి జాగరణం చేయాలి.

వివాహాదుల్లో గౌరీపూజకు ఆంధ్ర స్త్రీలు రాతి విగ్రహాలను మాత్రమే వాడడం ఆచారం. కాని మహారాష్ట్ర స్త్రీలు ఈనాటి గౌరీ పూజకు ఇత్తడి విగ్రహాన్ని ఉపయోగిస్తారు. వారు ఆ ఇత్తడి గౌరీ విగ్రహాన్ని ఒక చిన్న ఉయ్యాలలో ఉంచుతారు. ఇది శివడోలోత్సవ పర్వంనుంచి వచ్చిన విధానం కావడం కాదనరానిది. ఇరుగు పొరుగు స్త్రీలను పేరంటానికి పిలిచి వేడుక చేస్తారు. పేరంటాళ్లకు కుంకుమ, వడపప్పు మున్నగు ప్రసాదము, మిఠాయి ఇస్తారు. వెళ్లి పోయేముందు ప్రతిస్త్రీ దేవి వద్ద తన భర్త పేరు చెప్పాలి.

ఇక మాళవ స్త్రీలు ఈ వ్రతం ఆచరించే తీరు తెలుసుకొందాము.

మాళవ ప్రాంతపు స్త్రీలు ఈనాటి ఉదయాన్ని మట్టితో గౌరీ విగ్రహాన్ని చేస్తారు. దానిని బాగా అలంకరిస్తారు. సాయంకాలం స్త్రీలు

అందరూ ఒక చోట చేరి గౌరిని స్తోత్రం చేస్తూ పాటలు పాడతారు. వెళ్లి పోయేటప్పుడు ప్రతి స్త్రీ దేవివద్ద తన భర్త నామం చెప్పాలి. ఈ పూజ జరిగిన ఐదవ నాటి సాయంకాలం ఆవిగ్రహాన్ని ఊరేగించి తిరిగి ఇంటికి తీసుకువస్తారు. తిరిగి పాటలు పాడతారు. కుంకుమ పంచి పెడతారు. వడపప్పు ప్రసాదం ఇస్తారు. వెళ్లి పోయేటప్పుడు దేవి వద్ద ప్రతి స్త్రీ తన భర్త నామం చెప్పాలి.

ఈ పర్వసందర్భంలో స్త్రీ తన భర్త పేరు చెప్పే ఆచారం మహారాష్ట్ర మాళవదేశాల రెండింటిలోనూ ఉంది. సాధారణంగా హిందూ గృహిణికితన భర్త పేరు చెప్పడం నిషిద్ధం. అయితే దేవి వద్ద స్త్రీ తన భర్త పేరు చెప్పడం వల్ల దేవి కృప అతనికి దొరుకుతుందనే నమ్మకం ఈ ఆచారానికి ప్రాతిపదిక కానగును.

చైత్రశుద్ధ తదియ నాడు సౌభాగ్యగౌరీపూజలు చేసే ఆచారం ఆంధ్రదేశానలేదు. అరవనాట కూడా లేదు. అరవవారు ఈ గౌరీ పూజలు వైశాఖ మాసంలో చేస్తారు. సంక్రాంతికి పిమ్మట ముక్కనుమునాటినుంచి ఆంధ్ర స్త్రీలు ఆచరించే సావిత్రిగౌరీదేవి నోముల్లో ఈ వ్రతాచరణ విధానం ప్రాయకంగా అంతర్భాగమైఉంది.

వ్రతోత్సవచంద్రికాకారుడు కాశీప్రాంతాన ఈ పర్వ సందర్భంలో ప్రచారం లో ఉన్న కథను ఇట్లా చెబుతున్నాడు.

ఒక రోజున పార్వతీ పరమేశ్వరులు అడవికి వెళ్ళారు. పార్వతికి దాహం అయింది. నీళ్లు ఎక్కడా దొరక లేదు. పక్షులు అన్నీ ఒకదిక్కుగా పోతూ ఉండడంచూచి ఆదిక్కున జలాశయం ఉండవచ్చునని తలచి పార్వతి అటు వెళ్లింది. అక్కడ ఒక చిన్ననది ఉంది. తాగడానికి మొదటి పుడసిలి ఎత్తింది. దానిలోకి దూబ్ గుచ్ఛము వచ్చింది. రెండోసారి పుడసిలోకి టేసు గుచ్ఛము వచ్చింది. మూడో పుడసిలోకి బెల్లపు ఉండవచ్చింది. పార్వతి ఈ మూడు పదార్థాలు ఇట్లా వరుసగా రావడం చూచి చాలా వ్యాకుల పడింది. ఇంతలో ఈశ్వరుడు ఆమెకు ఆదినము చైత్రశుక్ల తృతీయ అని జ్ఞాపకం చేయగా దాని అంతరార్థం ఆమెకు అర్థమైంది.

సౌభాగ్యవతులైన స్త్రీలంతా గౌరీవ్రతం చేస్తూ ఉంటే నీవు అడివిలో తిరుగుతున్నావా అని శివుడు పార్వతిని వేళాకోళం చేశాడు. అప్పుడు

పార్వతి శివుణ్ణి అక్కడ రెండు రోజుల పాటు తన పుట్టిల్లు నిర్మించమని కోరింది. అక్కడ గణగౌరీవ్రతం చేసే ఆడ వాళ్లందరికీ తాను స్వయంగా ఆశీర్వాదం ఇవ్వాలని కూడా కోరింది.

ఈశ్వరుడు తన అలౌకిక శక్తి చేత పార్వతి కోరినట్లు చేశాడు. చాలమంది స్త్రీలు పూజార్థము వచ్చారు. వారందరూ గౌరీ ఉత్సవం చేశారు. పార్వతి అందర్నీ ఆశీర్వదించింది. ఆ మీద వాళ్లు వెళ్లి పోయారు.

అటు మీద అక్కడకు ఉన్నతకుల స్త్రీలు వచ్చారు. ఒకసారి ఆశీర్వాదం అయి పోయాక మళ్లీ ఆశీర్వాదం చేయడానికి పార్వతి సంకోచించింది. సౌభాగ్యవతులైన స్త్రీలకు నేను ఈ వరకే ఆశీర్వాదం ఇచ్చి వేశాను. కాబట్టి వీళ్లను మీరు ఆశీర్వదించండి. అని పార్వతి పరమేశ్వరుణ్ణి కోరింది.

పరమేశ్వరుడు వాళ్లని ఆశీర్వదించి పంపించి వేశాడు. కాని ఆ స్త్రీలకు పార్వతి ఆశీర్వాదం కలగలేదు. అందుచేత వారి సౌభాగ్యానికి కొంతన్యూనత కలిగింది.

అనంతరం పార్వతి పరమేశ్వరులు తమ స్వస్థలానికి వెళ్లిపోయారు. మరునాడు పరమేశ్వరుడు పార్వతితో గతదినమున తాను వనములో ఉత్తరీయం మరచి పోయాననీ, అక్కడకు వెళ్లిదానిని తీసుకురావలసిందనీ చెప్పాడు. పార్వతి అక్కడకు వెళ్లి చూస్తుంది కదా అక్కడ ఊరూ లేదు. ఉత్తరీయమూ లేదు. మునుపటి మాదిరిగా వనం మాత్రం ఉంది.

ఇది ఇప్పుడు లోకంలో వాడుకలో ఉన్నకథ. ఈ కథ విమర్శనీయమై ఉన్నది.

ఈ కథ పౌరాణిక పాత్రలలో కూడినదే. కాని గౌరీ డోలోత్సవం మినహా మిగతా ఈ పర్వ కార్యకలాపం పౌరాణికమైంది కాదని తోచక మానదు. దేవీ పూజ ప్రబలినకాలంలో ఈ కార్యకలాపం ఆచారంలోకి వచ్చి ఉంటుంది.

కథలో పరమేశ్వరుడి ఆశీర్వాదం పొందినా పార్వతి ఆశీర్వాదం కలగని స్త్రీల సౌభాగ్యానికి కొంతన్యూనత కలిగింది అనడం దేవి మహత్తను గొప్ప చేయడానికి అని స్పష్టమవుతూ ఉంది.

## సౌభాగ్యశయన వ్రతము

ఈ వ్రతమును గురించి మత్స్యుడు మనువుకు చెప్పినట్లు మత్స్య పురాణములో కలదు. చైత్రశుద్ధతృతీయ పూర్వాహ్ణము నందు ఉమామహేశ్వర ప్రతిమలకు వివాహము చేసి కల్పోక్త ప్రకారం పూజలు దానాలు చేస్తే శివలోకప్రాప్తి కలుగును.

ఈనాడు రామచంద్రడోలోత్సవం చేయాలని స్మృతి కౌస్తుభము. చతుర్వర్గ చింతామణి దీనిని మహా తృతీయ అంటూ అనంతర్య వ్రతం చేయాలని చెబుతూ ఉంది.

## ఉత్తమ మన్వంతరాది

చైత్రశుద్ధ తదియ శివడోలోత్సవ పర్వమేకాకుండా ఉత్తమ మన్వంతరాది పర్వం కూడా అయి ఉంది.

మన్వాది అనగా మనువు ప్రభుత్వం చేయడానికి ఆరంభించిన దినము.

మనవులు పదునలుగురు. అందులో ఉత్తముడు మూడో మనువు. ఉత్తముని కథ వినతగి ఉంటుంది. స్వాయంభు వంశజుడగు ఉత్తానపాదునకు సురుచి యందు ఉత్తముడు అనే పుత్రుడు పుట్టాడు. అతడు పరిపాలన దక్షుడు, ధార్మికుడు అతని భార్య బభ్రుసుత అయిన బహుళ.

బహుళ అంటే అతనికి వల్లమాలిన ప్రేమ. అతడు ఆమెకు ఎన్నెన్నో నగలు, ఎన్నెన్నో బట్టలు ఇస్తూ ఉండేవాడు. ఎన్ని ఇచ్చినా ఆమె అతనంటే ఎడమొగముగాను, పెడమొగముగాను ఉంటూ ఉండేది.

ఒకసారి అతడు నిండు కొలువై ఉండి ఆట పాటల వినోదములో తన భార్యకు త్రాగడానికి మధుర రసపు పాత్ర అందిచ్చాడు. పలువురు రాజులు చూస్తూ ఉండగా ఆమె ఆ పాత్రను తిరస్కరించి భర్తను అవమానించింది. అందుతో అతనికి కోపం వచ్చింది. ఆమెను అడవిలో విడిచి పెట్టి రమ్మని పంపివేశాడు. మగనిపీడ వదిలింది సుఖపడ్డాను అనుకుంటూ ఆమె సంతోషంగా అడవికి పోయింది.

ఇది జరిగిన కొంత కాలానికి రాజు కొలువై ఉండగా సుశర్మ అనే బ్రాహ్మణుడు వచ్చి "మహారాజా! నేను నిద్ర పోతూ ఉండగా నాభార్యను ఎవరో ఎత్తుకొని పోయినారు. నాభార్య జాడ వెతికించి తెప్పించి నాకు

అప్పు చెప్పుకోరతాను" అని చెప్పాడు.

అందు మీద రాజు 'నీభార్య ఎట్లా ఉంటుంది.! ఆమెను ఏవిధంగా గుర్తించవచ్చును'. అని సుశర్మను అడిగాడు.

"నాభార్య నల్లగా, పొట్టిగా ఉంటుంది. మిట్టకళ్ళు. కుఱచచేతులు, పీక్కుపోయిన ముఖం. బొంగురు గొంతుకు మాట్లాడితే పోట్లాడడానికి వచ్చినట్లుగా ఉంటుంది." అన్నాడు సుశర్మ.

అప్పుడు రాజు అతనితో "ఓవెఱ్ఱి బ్రాహ్మడా! కురూపి గయ్యాళి అయిన అట్టి భార్య పోయినదని ఎందుకు కుములుతావు! అందమైనది, అనువర్తనకలది అయిన మరి ఒక స్త్రీని పెళ్ళాడు" అన్నాడు. దానికి సమాధానంగా సుశర్మ దేవా! భార్య ఎట్లాంటిది అయినా భరింపబడ వలసింది. కురూపి అని వదిలి వేయకూడదు. భార్యలేని వానికి అనుదిన కర్మలు చెడిపోతాయి. భార్యను విడిచి పెట్టినవానికి నరకలోక ప్రాప్తి కలుగుతుంది. పైగా వాని కులం సంకరమై పోతుంది. కాబట్టి నాభార్యను వెదికి నాకు అప్పగించవలసిందిగా కోరతాను అన్నాడు.

వెంటనే రాజు రథం ఎక్కి అడవులకు వెళ్లి సుశర్మ అర్ధాంగి కోసం అన్వేషణ ప్రారంభించాడు. గట్టులు, గుట్టలు, డొంకలు, డొఱ్ఱులు వెతుక్కుంటూపోయాడు. ఎక్కడా ఆమె కనిపించలేదు. ఆమెను వెతుకుతూ రాజు త్రికాలజ్ఞుడు అనే ముని ఆశ్రమానికి వచ్చాడు.

రాజు రాకను గమనించి ఆముని అతనికి అర్ఘ్యం ఈయడానికి నీరు తెమ్మని శిష్యునితో చెప్పాడు. శిష్యుడు నీరుకొనిరాక నిదానించి మరీ ఆజ్ఞాపించండి అన్నాడు. ముని నిదానించాడు. రాజు అప్పటికి భార్యాహీనుడుగా ఉన్నాడు. భార్యలేనివానికి అర్ఘ్యం పొందే అధికారం లేదు. అందుమీద త్రికాలజ్ఞుడు అర్ఘ్యం విషయం ప్రస్తావించక రాజా! నీవు వచ్చిన పని ఏమిటని ప్రశ్నించాడు. రాజు తాను వచ్చిన పనిచెప్పి సుశర్మ భార్య ఎక్కడ ఉన్నదో చెప్పమని మునిని కోరాడు.

మునిదివ్యదృష్టితో చూచి 'రాజా! అద్రిసుతుడైన బలాకుడనే రాక్షసుడు సుశర్మ భార్యను ఎత్తుకుపోయాడు. ఉత్పలావతకము అనే వనములో ఉంచాడు. నీవు వెళ్లి ఆమెను విడిపించుకొని తీసుకువెళ్లి సుశర్మ వద్దకు చేర్చు' అన్నాడు.

అప్పుడు ఉత్తముడు మునితో 'మహాత్మా! నాకు అర్ఘ్యం

ఈయబోయి విరమించారు. దానికి కారణం ఏమిటో సెలవియ్యాలని కోరతాను. అన్నాడు. దానికి ముని రాజా నీవు ఇప్పుడు భార్యా హీనుడుగా ఉన్నావు. స్వాయంభువ వంశమంతటి గొప్పవంశంలో పుట్టి నీవు భార్యను విడిచి పెట్టేశావు. భార్యలేని వానికి కర్మలు చేసే అధికారం లేదు. భార్య ఎట్టిదైనా పోషింపబడవలసిందే పత్న్యనుకూలతచేత పురుషుడు కర్మలను ఆచరించాలి. భార్యలేని వానికి అర్ఘ్యం ఈయకూడదు. అని బదులు చెప్పాడు.

ఉత్తముడికి మెఱుపు దెబ్బ తగిలినట్లు అయింది. అంతలో తిరిగి తేరుకొని అతడు ముని చెప్పిన ఉత్పలావతక వనానికి వెళ్ళాడు. అక్కడ అతనికి సుశర్మ చెప్పిన లక్షణాలు కల స్త్రీ కనిపించింది. ఆమె అప్పుడు మారేడు పళ్లను తింటూ ఉంది.

'సుశర్మ భార్యవునీవేనా' అని రాజు ఆమెను ప్రశ్నించాడు. అప్పుడు ఆమె నేను అతిరాత్రుడను బ్రాహ్మణుని కూతురిని. మీరు ఇప్పుడు పేర్కొనిన వాని భార్యను నేనే. నేను నిద్రిస్తూ ఉండగా బలాకుడు అనే రాక్షసుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. వాడు ఈ వనంలో తిరుగుతూ ఉంటాడు అన్నది.

అప్పుడు రాజు ఆవనంలో కలయతిరిగాడు. ఆతనిని చూడడంతోటే రాక్షసుడు నమస్కారం చేశాడు. ఉత్తముడు అంతట వానిని సుశర్మ భార్యను నీవు ఏల ఎత్తికొని వచ్చావు అని అడిగాడు. దానికి రాక్షసుడు ఇట్లా సమాధానం చెప్పాడు. "రాజా! సుశర్మ యజ్ఞాల్లో ఋత్విజుడై రక్షోఘ్న మంత్రాలచేత మారాక్షసుల బలాన్ని సుశర్మ తగ్గిస్తున్నాడు. భార్య లేకుండా పోతుంది కదా అనే భావంతో ఆమెను తీసుకొని వచ్చి ఇక్కడ దాచాను.

అప్పుడు రాజు ఆమెను తిరిగి సుశర్మకు చేర్చి వేయాలి. అన్నాడు. రాజాజ్ఞ అవశ్యం నెరవేరుస్తానని బలాకుడు ఆమెను తీసుకొని వెళ్లి బ్రాహ్మడికి ఇచ్చి వేసి రాజు వద్దకు వచ్చి ఆవృత్తాంతం తెలియచేశాడు. అవసరమైనప్పుడు నిన్ను తలుచుకుంటాను. అప్పుడు వచ్చి నాపని నెరవేరుస్తూ ఉండు అని చెప్పి రాజు అతనిని సాగనంపాడు.

ఆ పిమ్మట రాజు తిరిగి త్రికాలజ్ఞుని ఆశ్రమానికి వెళ్లి ఈసారి తన భార్య సంగతి అడిగాడు. దివ్యదృష్టిచే చూచి ముని ఇట్లా చెప్పాడు "రాజా! నీ భార్య నీచే విడువబడి అడవిలో తిరుగుతూ ఉంది. సాలపోతకుడు

అనే నాగరాజు ఆమెను పాతాళలోకానికి తీసుకుపోయాడు. అతనికి మనోరమ అనే భార్య, నంద అనే కూతురు ఉన్నారు. నీభార్యను కూడా భార్యనుగా చేసి కోవడానికి అతను ఆయత్తుడయ్యాడు. అప్పుడు అతని కూతురు నంద అతనికి నీతి చెప్పింది. దానికి అతనికి కోపం వచ్చింది. ఆమె మూగది అయిపోయేటట్లు శపించాడు. మూగది అయి కూడా ఆమె నీభార్యను కంటికి రెప్పలాగున కాపాడుతూ ఉంది."

అందుమీద రాజు తన భార్య తన వద్ద ఉన్నన్నినాళ్లు తానంటే ఇష్టం లేకుండా ఉండేటందుకు ఏమిటి కారణమని మునిని అడిగాడు. దానికి సమాధానముగా ముని రాజా! ఇది అంతా నీ వివాహకాల ముహూర్తదోషము వలన అయినది. మీ వివాహకాలాన నిన్ను సూర్యుడు, అంగారకుడు, శనిగ్రహాలు చూస్తూ ఉండినవి. నీ భార్యను శుక్రుడు, బృహస్పతి చూస్తూ ఉండినవి. నీలగ్నంలో అంగారకుడు, నీభార్యలగ్నంలో చంద్రుడు ఒకరిని ఒకరు చూచుకుంటూ ఉన్నారు. కాబట్టి మీదంపతులకు ఈ రవరవలు. నీభార్య నీ వద్దకు తిరిగి వస్తుంది. వెళ్లి రాజ్యపాలన చేస్తూ వుండు అన్నాడు.

ఆ మాటలు విని ఉత్తముడు రాజధానికి తిరిగి వచ్చాడు. ఇంతలో అక్కడికి సుశర్మ వచ్చి తన భార్య తన వద్దకు తిరిగి వచ్చేటట్లు చేసిన రాజుకు కృతజ్ఞత తెలుపుకున్నాడు. అప్పుడు రాజు అతనితో తన దాంపత్య విషయం తెలియచేశాడు.

అప్పుడు సుశర్మ రాజా! నీభార్యకు నీయందు ఇష్టం లేదనికించ పడకు. మిత్రవిందేష్టి అని ఒక యజ్ఞం ఉంది. ఆయజ్ఞమును నీవు ఏడు పర్యాయాలు చేశావంటే ఆమెకు నీయందు ప్రీతి కలుగుతుంది. అన్నాడు. రాజు ఏడు సారులు మిత్రవిందేష్టి చేశాడు. తరువాత బలాక రాక్షసుని పంపి పాతాళ లోకాన్నుండి భార్యను రప్పించుకొన్నాడు.

ఆమె ఇప్పుడు చాలా అనుకూలవతిగా ఉంటున్నది. సుశర్మ మహత్తు తెలిసికొన్నది. అప్పుడు ఆమె భర్తతో తనమూలంగా పాతాళంలో మూగదై ఉన్న నంద మూకత్వం సుశర్మ సాయంతో పోయేటట్లు చేయవలసిందిగా ప్రార్థించింది. రాజు అంగీకరించాడు.

సుశర్మ సారస్వతసూక్తాలు పఠిస్తూ సారస్వతేష్టి చేశాడు. దాని ఫలితంగా పాతాళంలో నంద మూకత్వం పోయింది. నంద ఆనందానికి మేరలేకపోయింది. భూలోకంలోని ఉత్తముని భార్య వల్ల తనకీ మేలు

కలిగిందని గర్గుడు అనే ముని చెప్పగా ఆమె భూలోకానికి వచ్చి రాజు భార్యకు తన కృతజ్ఞత తెలుపుకొన్నది. ఆమెకు భూమండలానికంతకూ అధిపుడయ్యే సర్వశాస్త్రవేది అయిన కొడుకు పుడతాడని చెప్పి పాతాళలోకానికి వెళ్లిపోయింది.

అంత కొంతకాలానికి బహుళా ఉత్తములకు ఒకకొడుకు పుట్టాడు. అతని అవయవాలు అన్నీ ఉత్తమంగా ఉన్నాయి. ఉత్తమమైన అవయవాలతో ఉత్తమమైన వంశంలో ఉత్తముడు అనే రాజుకు పుట్టడం చేత అతనికి ఉత్తముడనే పేరువచ్చింది.

అనంతరకాలాన అతడు మనువు అయ్యాడు. అతని మన్వంతరమున సుశాంతి అనువాడు ఇంద్రుడు. ఆమన్వంతరము డెబ్బయి ఒక్క మహా యుగాలు సాగింది.

## చైత్ర శుక్ల చతుర్థి

### గణేశపూజ

### గణపతికి దమనపూజ.

ఈనాడు గణపతిని దమనముతో పూజించాలి. నేడు ఆశ్రమ, చతుర్మూర్తి వ్రతాలు చేస్తారని చతుర్వర్గ చింతామణి.

## చైత్రశుక్ల పంచమి

### శాలిహోత్రహయపంచమి

స్మృతి కౌస్తుభము, చతుర్వర్గ చింతామణి చైత్రశుక్ల పంచమిని శాలి హోత్రయపంచమి అనుచున్నవి.

ఈనాడు హయపూజ చేయాలని కలదు. శాలిహోత్రుడు అశ్వశాస్త్రం వ్రాసిన ఋషి. మన రాజులు ఆశ్విక దళాన్ని బాగా పోషించే రోజులలో ఈ శాలిహోత్రహయపంచమివ్రతం బాగా ఆచారంలో ఉండినట్లు కనిపిస్తుంది.

ఈనాటి వివరణలో మన పంచాంగకర్తలు శ్రీపంచమి, శ్రీ వ్రతము అని వ్రాస్తారు. మాఘమాసంలో ఒక శ్రీ పంచమి ఉంది. ఈ పంచమి కంటె అది ప్రచారంలో ఉన్న పండుగగా కనిపిస్తుంది. ఈనాడు లక్ష్మీపూజ చేయాలని కలదు. అదే "శ్రీవ్రతము."

## 'శ్రీరామ రాజ్యోత్సవః

శ్రీ రాముడు చైత్రశుద్ధ విదియనాడు విభీషణునికి లంకా రాజ్య పట్టాభిషేకము చేశాడు. తదియనాడు బయలుదేరి చతుర్థి నాటికి భరద్వాజాశ్రమానికి వచ్చాడు. పంచమినాడు అయోధ్యలో పట్టాభిషేకము జరిపించుకొన్నాడు. ఈ విషయం వాల్మీకి రామాయణంలో చెప్పబడిఉన్నది. అందుచేత ఈనాడు శ్రీరామ రాజ్యోత్సవ పర్వము.

## నాగపూజ

## శ్వేతవరాహకల్పః

"ఆమాదేర్ జ్యోతిషీ" దీనిని కల్పాది దానమంటూ ఉంది.

ఈనాడు పంచమూర్తి వ్రతాన్ని, సంవత్సరవ్రతాన్ని ప్రారంభిస్తారని చతుర్వర్గచింతామణి. పంచమహాభూతవ్రతం కూడా చేస్తారు.

ఈనాడు నాగపూజ చేయాలని స్మృతి కౌస్తుభము.

## చైత్రశుక్ల షష్ఠి

## స్కందదమనపూజ

ఇది బాలరక్షాకరమైన తిథి అనీ ఈనాడు స్కందోత్పత్తి జరిగిందని తిథితత్వము చెబుతూ ఉంది.

ఈనాడు స్కందుని దమనముతో పూజించాలి.

అర్క, కుమారషష్ఠి వ్రతాలు ఈనాడు చేస్తారని చతుర్వర్గ చింతామణి. ఆమాదేర జ్యోతిషి అనే గ్రంథం ఈనాటిని అశోకషష్ఠి అనుచున్నది.

## చైత్రశుక్ల సప్తమి

## సూర్యదమన పూజ

ఈనాడు సూర్యుని దమనముతో పూజించాలి. గోమయాది సప్తమీ, నామసప్తమీ, సూర్య, మరుత్, తురగ సప్తమీ మున్నగు వ్రతాలు ఈనాడు చేస్తారని చతుర్వర్గ చింతామణి. ఈనాడు వాసంతీ పూజ చేయాలని ఆమాదేర్‌జ్యోతిషి. ఈనాడు అర్కవ్రతం ఆచరించేవారు రాత్రి భోజనం చేయకూడదు.

# చైత్రశుద్ధ అష్టమి

చై[త్రశుద్ధ అష్టమినాటి వివరణములో మన పంచాంగ కర్తలు భవానీయా[త్రా, అశోకాష్టమి, అశోకరు[ద్రపూజా, అశోకకలికా [ప్రాశనమ్ అని [వ్రాస్తారు.

దీనిని బట్టి ఇది భవానీ అష్టమిగా, అశోకాష్టమిగా పరిగణింపబడుతూ ఉందని తేలుతూ ఉంది.

## భవానీ అష్టమి

చై[త్రశుద్ధ అష్టమి భవానీదేవి పుట్టినరోజు. భవానీ అనేది పార్వతికి మరి ఒక పేరు. ఆమె శివుని భార్య.

శివుని మొదటి భార్య సతీదేవి. ఆమె దక్షుని పెద్ద కూతురు. శివుడు ఒకసారి దక్షుని నిరాదరించాడు. ఆ కోపాన దక్షుడు కూతురిని పుట్టింటికి తీసుకురావడం మాని వేశాడు. ఆమె చెల్లెళ్ళను మా[త్రం తరుచు తీసుకువస్తూ చీరెలు, సారెలు పెడుతూ ఉండేవారు.

ఇది ఇట్లా ఉండగా దక్షుడు ఒకసారి యజ్ఞం తలపెట్టాడు. ఆ యజ్ఞానికి అతడు శివుణ్ణి తప్ప మిగతా దేవతలను అందరినీ పిలిచాడు.

అందరు దేవతలు ఆయజ్ఞానికి వెళుతూ ఉండడం చూచి సతీదేవి తాను కూడా వెళ్లడానికి ఉబలాటపడింది. భర్త అనుమతి కోరింది. పిలవని పేరంటానికి పోవడం మంచిది కాదని శివుడు చెప్పి చూచాడు. మా తం[డ్రి యజ్ఞానికి మా చెల్లెళ్ళు అందరూ వస్తారు, వారి అందరినీ ఒకసారి చూచి వస్తానని సతి పతిని బతిమిలాడింది.

అప్పుడు శివుడు ఆమెతో నీ ఇష్టం అన్నాడు. సతీదేవి పుట్టింటికి వెళ్లింది. రాకరాక వచ్చిన కూతుర్ని తం[డ్రి పలకరించలేదు సరికదా ఎవరినీ కూడా ఆమెతో మాట్లాడ నిచ్చాడుకాదు. పైగా శివుణ్ణి అమంగళవేషుడని దూషించాడు.

పతినింద సతికి భరింపరానిదైంది. ఆమెకుబాగా కోపం వచ్చింది. కాలి బొటన [వేలితో నేలరాచింది. యోగాగ్ని పుట్టింది. అందులో ఆమె భస్మమై పోయింది.

సతీదేవి భస్మమైన విషయం తెలుసుకుని ఆ[గహోద[గుడై శివుడు వీరభ[ద్రుని పుట్టించి దక్షుని యజ్ఞాన్ని పచ్చుము పాడుచేయించాడు.

ప్రాధాన్యము వహించినది. స్త్రీలు తమ సంతతికి క్షేమము కలుగుటకై అశోకవృక్షము యొక్క ఆరుపూమొగ్గలను నీటిలో కలిపి త్రాగెదరు."

షష్ఠినాడు చేస్తారు కాబట్టి ఆరు మొగ్గలు తింటారు. అష్టమినాడు చేసే వారు ఎనిమిది మొగ్గలు తింటారు. ఈ తినడం ఉత్తర హిందూ స్థానమున నీటిలో కలుపుకుని కాని గ్రంథాంతరములందు అశోకకలికలను మధుర పదార్థాల్లో కలుపుకొని తినాలని ఉంది.

అశోకకలికా ప్రాసనపు ఆచారంగల ఈపర్వం సందర్భంలో ఒక కథ చెబుతారు.

## వ్రతకథ

ఒక ముని ఉన్నాడు. అతనికి ఒక చిన్నారి బాలిక దొరికింది. ఆమెను అతడు చాలా గారాబంగా పెంచాడు. ఆమె పెరిగి పెద్ద అయి వరయోగ్య అయింది. అప్పుడు ముని ఆమెను దూరదేశమునందలి ఒక రాజుకు ఇచ్చి పెళ్లి చేశాడు. ఆమెను పంపేటప్పుడు ముని ఆమెకు కొన్ని అశోక వృక్షపు విత్తనాలు ఇచ్చాడు. వెళ్ళేటప్పుడు వానిని దారిపొడుగా చెదురు చెదురుగా చల్లుకుంటూ వెళ్లమని చెప్పాడు. ఆమె అట్లే చేస్తూ అత్తవారిల్లు చేరింది.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఆమెకు చాలామంది పిల్లలు పుట్టారు. కాని ఆ సంతానం ఏమీ నిలువలేదు. తండ్రితో తన గోడు చెప్పుకుందామని ఆమె బయలు దేరింది. ఆమె అత్తింటికి వెళ్లేటప్పుడు చల్లుతూ పోయిన అశోక వృక్షపు విత్తులన్నీ మొలకెత్తి అప్పటికి పెద్ద చెట్లుగా ఏపుగా ఎదిగి ఉన్నాయి.

ఆ చెట్లబారు ఆనమాలుగా పెట్టుకుని ఆమె పుట్టింటికి ప్రయాణ మైంది. ఆ చెట్టు నీడను విశ్రమిస్తూ ప్రయాణం సాగించి పుట్టింటికి చేరింది. తండ్రికి తన గోడు చెప్పుకుంది. అప్పుడు అతను కొన్ని అశోక వృక్షపు మొగ్గలను తీసి మంత్రోదకములో కలిపి ఆమెకు ఇచ్చాడు. ఆమె ఆ మొగ్గలను తిని మంత్రోదకం లోపలికి పుచ్చుకుంది.

ఆమె తిరిగి అత్తవారింటికి వెళ్లింది. ఆ మీద ఆమెకు సంతానం నిలిచింది. అప్పటి నుంచి ఆమె కడుపు శోకము ఎఱుగదు.

## అశోకవృక్షము - స్త్రీలు

దీనిని పట్టి స్త్రీలు తమ సంతానము యొక్క క్షేమాభివృద్ధుల నిమిత్తం అశోక కలికాప్రాశనం చేయాలని తేలుతూ ఉంది.

స్త్రీల గర్భాశయం మీద అపూర్వ ప్రభావం గల గొప్ప మూలిక అశోక. ఋతుదోషాలను రజోదోషాలను పోగొట్టి స్త్రీలను సంతానవతులుగా చేసే గుణం అశోకకు అగ్గలంగా ఉన్నది.

లంకలో చెఱలో ఉన్నప్పుడు సీతాదేవి అశోకవనంలో ఉండినదని రామాయణంలో కలదు. వ్రతనియమం రుపేణా అశోకపు మొగ్గలను ఏడాదికి ఒకసారి తింటూ ఉండడం స్త్రీల ఆయురారోగ్యాలకు దోహదకారిగా ఉంటుంది. ఆరోగ్యదృష్ట్యా వరణీయమైన వ్రతాల్లో ఇది ఒకటి.

## అశోకరుద్రపూజ

ఈ రోజున రుద్రుని అశోకవృక్షము యొక్క చిగురుల తోను పుష్పముల తోను పూజించాలి. పూజ అయిన తరువాత ఎనిమిది అశోకపు మొగ్గలను నూరి ప్రాశనము చేయాలి. పిమ్మట పార్వతీదేవి దర్శనం చేయాలి. ఈ విధంగా చేసిన స్త్రీలు సమస్తమైన ఆనందాలను పొందుతారు.

పునర్వసునక్షత్రం బుధవారాలతో కలిసిన భవానీ అష్టమినాడు నదిలో స్నానంచేస్తే వాజపేయయాగం చేసినంత ఫలం. అనాడు బ్రహ్మపుత్రా నదిలో స్నానం విశేష ఫలప్రదమైనదని తిధితత్త్వము చెబుతూవుంది.

యువతులు కాళ్లతో తన్నితే, అశోకవృక్షాలకు దోహదక్రియ అవుతుందని అవి పూస్తాయని చెబుతారు. స్త్రీలకు ఆరోగ్యాన్ని ఇచ్చే వృక్షాలలో ఇది చెప్పతగింది. ఫాల్గుణమాసంలో ఈ చెట్లు పూయడానికి ప్రారంభిస్తాయి. వైశాఖమాసం నాటికి వీని కాయలు పండడానికి ఆరంభిస్తాయి. ఈ మధ్య కాలంలో అశోకాష్టమికి అశోక కళికాభక్షణము విధింపబడింది.

ఈనాడు చండికావ్రతం ఆరంభిస్తారని చతుర్వర్గ చింతామణి. ప్రత్యష్టమి ఏడాదిపాటు ఉపోషణం ఉండాలి. ఈనాడు శివవ్రతం పిష్టనిర్మిత వస్తువులు దానం, వసువ్రతం చేయాలని పై గ్రంథంలో ఉంది.

సోమ, సోమాష్టమీ వ్రతాలు కూడా ఈనాడు చేస్తారు.

# చైత్ర శుద్ధ నవమి

## శ్రీ రామ నవమి

(ప్రతి సంవత్సరం చై(త్రశుద్ధ నవమి మనకు శ్రీరామనవమి. వసంతనవరా(త్రులకు ఇది ఆఖరురోజు.

## శ్రీరామ జయంతి

శ్రీమహా విష్ణువు ఎత్తిన పదిఅవతారాల్లోనూ శ్రీ రామావతారం ఏడోది.

శ్రీరాముడు కోసల దేశాధీశ్వరుడైన దశరథునకు కౌసల్య గర్భమున చై(త శుద్ధనవమినాడు పునర్వసు నాలుగో పాదాన కర్కాటక లగ్నంలో మధ్యాహ్నం పుట్టాడు.

అందుచేత (ప్రతి సంవత్సరం చై(త్రశుద్ధనవమి శ్రీరామజయంతి దినమైంది.

మన పంచాంగ కర్తలు పది అవతారాల జయంతి తిధులను ఈ విధంగా పేర్కొంటున్నాయి.

**దశావతార జయంతులు**

| | | |
|---|---|---|
| 1. మత్స్య | : | చై(త బహుళపంచమి |
| 2. కూర్మ | : | వైశాఖ శుద్ధపూర్ణిమ |
| 3. వరాహ | : | చై(త బహుళ(త్రయోదశి |
| 4. నారసింహ | : | వైశాఖ శుద్ధద్వాదశి |
| 5. వామన | : | భా(ద్రపద శుద్ధచతుర్దశి |
| 6. పరశురామ | : | వైశాఖ శుద్ధద్వాదశి |
| 7. రామ | : | చై(త శుద్ధనవమి |
| 8. కృష్ణ | : | (శ్రావణ బహుళ అష్టమి |
| 9. బుద్ధ | : | వైశాఖ శుద్ధపౌర్ణమి |
| 10. కల్కి | : | భా(ద్రపద శుద్ధవిదియ |

ఈ పట్టిక వలన పది అవతారాల్లోనూ మూడు అవతారాల (ప్రాదుర్భావం చై(త మాసంలోనే అని తెలుతూ ఉంది. పది అవతారాల్లో మూడింటి (ప్రాదుర్భావానికి నోచిపుట్టిన చై(త్రమాస మాహాత్మ్యం (ప్రశస్తమైంది కదా!

మత్స్య, వరాహ, శ్రీరామ అవతారాల జయంతులు ఇట్లు చై(త

మాసంలోనే, ఇందులో ఇంకో విశేషం. ఏటేట వచ్చే ఈ పది జయంతులలోను సంవత్సరాదికి పిమ్మట మొదట వచ్చే జయంతి పర్వం శ్రీరామనవమే.

## గర్భనవరాత్రులు

ఈ పండుగ తొమ్మిది రోజులు చేస్తారు. ఆ తొమ్మిది రోజులలో ఉగాదిపాడ్యమి మొదటిరోజు. ఈ తొలిరోజున ప్రారంభించి శ్రీరామ నవమి వరకు రామాయణ పారాయణ మొదలయిన పనులు చేస్తారు. ఈ తొమ్మిది రోజులను గర్భనవరాత్రాలు అంటారు.

ఈ తొమ్మిది రోజుల్లో వసంత పూజలు చేసేవారు వానిని వసంత నవరాత్రులు అంటారు.

అవీ ఇవీ నవరాత్రులే. అవీ ఇవీ, ఈనవమితోటే సమాప్త మవుతాయి. అయినా ఆపూజావిధానం వేరు. ఈపూజావిధానం వేరు.

శ్రీరాముడు పుట్టినదినమైన నవమి. అంతకు పూర్వపు వారపు దినాలు అనగా రాముడు గర్భంలో ఉన్న చివరి తొమ్మిది దినాలు చేసే మత విధులు, పూజాదికాలు గర్భనవరాత్రులను ఆరాధనీయంగా, ఆచరణీయంగా చేస్తున్నాయి. గర్భనవరాత్రులలో శ్రీరాముని గురించి చేయవలసిన పూజాదికాలు వ్రత కల్ప గ్రంథాలలో కొంతకు కొంత విపులపరుపబడి ఉన్నాయి.

## రామలీలలు

చైత్రశుక్ల పాడ్యమి మొదలు నవమి వరకు రామ మందిరాల్లో, రామాలయాల్లో రామాయణ కాలక్షేపం జరుగుతుంది. కొన్నిచోట్ల రామలీల అనే అభినయం చేస్తారనీ, కాని కృష్ణలీలలకువలె రామలీలలకు శాస్త్రాధారం ఏమీ లేదనీ వ్రతోత్సవ చంద్రికా కారుడు వ్రాస్తున్నాడు.

## మూన్నాళ్ల పండుగ

అగస్త్య సంహితలో ఇది మూడు రోజుల పండుగగా చెప్పబడింది. అష్టమిని గురుపూజ, నవమిని ప్రతిమాకల్పన దశమిని ప్రతిమాదానం నవమినాడు ఉపవాసం. రాత్రి పురాణ శ్రవణాదులచే జాగరణం మరునాడు ప్రతిమాదానం, సంతర్పణ. ఈ విధంగా ఒక్కొక్కరు పన్నెండేళ్లు చేయాలి. ఈ మాదిరి వ్రతా చరణం ఇప్పుడు అమల్లోలేదు.

శ్రీరామ పూజకు పునర్వసు నక్షత్రంతో కూడిన చైత్రశుద్ధ నవమి

చాలా పుణ్యవంతమైన కాలము. అష్టమితో కలసిన నవమిని రామపూజకు విష్ణు భక్తులు ఎప్పుడు చేకొన కూడదని అగస్త్య సంహిత చెబుతూ ఉంది. అందుచేతనే మిగులు నవమినాడు వైష్ణవులు శ్రీరామ జయంతి జరుపుతారు.

శ్రీరామ నవమి నాటి కార్యకలాపాలు మధ్యాహ్నం పన్నెండు గంటలకు చేయాలని వ్రత గ్రంథాలు చెబుతున్నాయి. శ్రీరామ నవరాత్రులు తొమ్మిది రోజుల్లోనూ శ్రీరామనవమి ఆఖరురోజు, అతి ముఖ్యమైన రోజు, ఉపవాసాది నిష్ఠలు వహింపనివారు కూడా ఆనాడు స్నానం చేసి మంచి బట్టలు కట్టుకుంటారు.

## మహారాష్ట్ర ప్రాంతాల్లో

మహారాష్ట్రులు ఈ పర్వాన్ని జరిపే తీరు తెలుసుకో తగింది. ఆనాడు ఉదయం తొమ్మిది మొదలు పన్నెండుగంటలవరకు దేవాలయాల్లో శ్రీరాముని పుట్టుక వరకుగల రామాయణ కథ అంతా కీర్తనల రూపంగా పాడుతారు.

సరిగ్గా పన్నెండుగంటలు కావడంతోటే - అనగా అలనాడు అవతారమూర్తి శ్రీరాముడు పుట్టిన వేళకావడంతోటే బుక్కా పొడిచల్లుతారు. కొత్తగా పుట్టిన బిడ్డను ఉద్దేశించి జోలపాటలు పాడతారు. హరిదాసు అచ్చట చేరిన వారిని అందరినీ ఆశ్వీరదిస్తాడు. పంచదారతో శొంఠిపొడిని కలిపి ప్రసాదంగా పంచి పెడతారు. అప్పుడు ఎవరి ఇళ్లకువాళ్లు వెళ్లిపోతారు.

'శ్రీఖండపూరి' మహారాష్ట్రుల ఆనాటి ప్రధాన భక్ష్యము.

## ఇతరప్రాంతాల్లో

భరత ఖండంలోని ఇతర ప్రాంతాల్లో శ్రీరామనవమి పూజా విధానం ఇందుకు కొంచెం భిన్నంగా ఉంటుంది. నాడు మధ్యాహ్నమందు శ్రీరామ ప్రతిమను స్థాపించి షోడశోపచారపూజలు చేస్తారు. దశానన వధార్థమూ, ధర్మసంస్థాపనార్థమున్నూ అవతారమెత్తిన శ్రీరాముని జననీ జనకులగు కౌసల్యాదశరథులకు రామునితో పాటు ఈనాడు షోడశోపచారపూజలు చేస్తారు. పత్ర పుష్పాదులతో పూతమైన జలంతో నిండిన శంఖంతో శ్రీ రామచంద్రమూర్తికి నేడు అర్ఘ్యం ఈయడం కొన్ని ప్రాంతాల్లో ఆచారమై ఉంది. నవమినాటి రాత్రి జాగరణం చేస్తూ ప్రతి జామున రామపూజ సాగిస్తూ మరునాడు రామనవమి వ్రతాంగ హోమము చేసి ఉద్వాసన చేయడం పలుతావుల్లో ఉంది.

## జానకీ జయంతి

ఆంధ్రదేశంలో మాత్రం శ్రీరామనవమికి సీతారామకళ్యాణం చేయడం ఆచారంగా ఉంటూ ఉంది. ఈ ఆచారం ఇతర ప్రాంతాల్లో అంతగా ఉన్నట్లు కనిపించదు. పుట్టినరోజు పండుగనాడు కల్యాణం చేయడానికి కారణం ఏమీ కనిపించదు.

రామ సంబంధమైన పండుగలు ఏడాదిలో శ్రీరామ నవమికాక మరి రెండు ఉన్నాయి.

ఒకటి: రామలక్ష్మణ ద్వాదశి. ఇది జ్యేష్ఠ శుద్ధ ద్వాదశినాడు.

రెండు: జానకీ జయంతి. ఇది ఫాల్గుణ శుద్ధ అష్టమి.

జనకమహారాజు యజ్ఞశాలకై భూమిని దున్నుతూ ఉండగా నాగటి చాలులో తగిలిన బంగారు పెట్టెలో ఈనాడు సీత దొరికింది. అందుచేత ఈనాడు సీతాజయంతి దినమైంది.

రామసంబంధపు పర్వదినాలైనా ఈరెండురోజులు కూడా రామకళ్యాణానికి అనువైన తిథులని అనుకోవడానికి వీలులేదు.

అయితే శ్రీరామనవమికి శ్రీరామకళ్యాణం చేసే ఈ ఆచారం ఎట్లా ప్రారంభమైనదో విచారించవలసి ఉంటుంది.

## తలంబ్రాలు

శ్రీరామనవమినాడు దేవాలయంలో జరిగే సీతారాముల కళ్యాణానికి వెళ్లి తలంబ్రాల బియ్యం పుణ్యవస్తువుగా పుచ్చుకొని తల మీద వేసుకోవడం తెలుగు గేస్తుల్లో సనాతనాచారంగా ఉంది.

దశావతారగాథల్లో శ్రీరామావతారపు గాథ ఆంధ్రదేశంతో ఎక్కువ సంబంధపడి ఉంది. రాముని వనవాసగాథ అంతా ఆంధ్రభూమి మీదనే నడిచింది. పుష్కరమునకు పైగా ఆంధ్రులకు అతిథి అయి ఇంద్రుని గంగయగుగోదావరి తీరమున భద్రగిరిలో అనుజునితోడను, అర్ధాంగి తోడను నివసించి ఆంధ్రభూమిని పుణ్యభూమిగా చేసిన అవతార పురుషుడు శ్రీరాముడు. మిగతా అవతారాలగాథకు ఆంధ్రదేశంతో ఇంతటి సంబంధంలేదు. కృష్ణావతారంలో ఆంధ్రులు ప్రతికూల పక్షము వారై ఉండిరని అనుకోవచ్చు. శ్రీ కృష్ణుడు చాణూరాంధ్రనిషూదనుడని విష్ణుపురాణముచెబుతూఉంది. పైగా ఆనాటిఆంధ్రులు కురుక్షేత్ర

యుద్ధంలో కృష్ణ వ్యతిరేకులైన కౌరవులపక్షం వహించినట్లు భారతం చెబుతూ ఉంది.

ఈ కారణం చేతనేకాబోలు కృష్ణుని కంటే రాముని ప్రభావం ఇప్పటికీ ఆంధ్రుల మీద ఎక్కువగా ఉంటూ ఉంది.

## రాముడు ఆంధ్రుల దౌహిత్రుడు

రాముడు ఆంధ్రుల దౌహిత్రుడనీ, భరతుడు పారశీకుల దౌహిత్రుడనీ సిద్ధాంతాలు ఉన్నాయి. దశరథుడు కోసలదేశపురాజు. కౌసల్య కోసల దేశపు రాజు కూతురు. ఈ కోసల దశరథుని ఉత్తరకోసలకు భిన్నమైన దక్షిణ కోసల అయి ఉండడం కాదనరానిది. దక్షిణ కోసల మనగా పూర్వం ఆంధ్రదేశపు ఉత్తర భాగము. అగుట కౌసల్య ఆంధ్రుల యింటి ఆడబడుచనీ, వనవాసాన్ని రాముడు తల్లి పుట్టింటి దేశపు అడవుల్లో గడిపాడనీ ఒక వాదం ఉంది. ఈ వాదం నిలవచాలింది అయినాకాకపోయినా వనవాస రాఘవునికి ఆతిథ్యమిచ్చిన ఆంధ్రదేశంలో అతని జన్మదినమైన శ్రీరామనవమి అతని కళ్యాణ దినంగా మారింది. ఈ మార్పునకు కారణం భద్రాచలదేవాలయం పెట్టిన ఒరవడి అని అనవచ్చు. ఆ దేవాలయపు పూజా పురస్కారాల్లో అనేకమైన కొత్త మార్పులు తెచ్చి పెట్టిన రామదాసు శ్రీ రామనవమి రామకళ్యాణ దినంగా మార్చి ఉంటాడని తోస్తుంది.

ఆంధ్రులపై రామదాసు ప్రభావం కొలదులు పెట్టతరము కానిదికదా! ఈ విషయం విజ్ఞులు విమర్శింతురుకాక!

ఈనాటి వివరణలో మన పంచాంగాలలో కొన్నిటియందు భద్రాచలక్షేత్రే కళ్యాణం అని ఉంటుంది. ఈనాడు రామకళ్యాణంచేసి నేటినుంచి ఐదు రోజులు (అనగా నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి) శ్రీరామపూజ హరికథలు మున్నగువానితో వేడుకగా చేయడం ఇప్పుడు ఆంధ్రదేశాన పలు ప్రాంతాలలో వాడుక అయి ఉంది.

## పానకము

శ్రీరామ నవమికి మిరియపు పొడివేసిన బెల్లపు పానకం విరివిగా వాడడం ఆంధ్రుల్లో పలుప్రాంతాలవారి ఆచారం.

ఈ పండుగనాటికి ఆంధ్రదేశంలో గాడ్పులు ప్రారంభమవుతాయి. కాగా అప్పట్లో పానకం పుచ్చుకోవడం తాపశమనంగానూ కాలోచితంగానూ ఉంటుంది.

నీలమత పురాణంలో దీనిని భద్రకాళీ నవమి అనీ, పురుషార్థ చింతామణిలో దీనిని దుర్గానవమి అని కూడా అంటారని కలదు. దీనిని పట్టి ఈ నవమినాడు ఆయా దేవతలను కొలిచే ఆచారంకొన్ని ప్రాంతాల్లో ఉందని ఊహింపవలసి ఉంటుంది. దేవీ పూజా సహితమైన నవరాత్రులు నేటితో ముగుస్తాయి.

ఈ సందర్భంలో శ్రీచారాల నరసింహమూర్తిగారు ఆంధ్రపత్రికలో ఇట్లా వ్రాస్తున్నారు.

శ్రీరామనవమి రోజున ఉత్తర దేశస్థులు శ్రీరాముని జననమును పురస్కరించుకొని జయంతీ ఉత్సవమును జరుపుతారు. శ్రీరాముని జనన మహోత్సవం అయోధ్యలో ఎంతో వైభవంగా జరుగుతుంది. ఆంధ్రదేశంలో మనం ఇందుకు భిన్నంగా కళ్యాణోత్సవం జరుపుతున్నాం. ఈ కళ్యాణోత్సవాలు చాల పురాతన కాలంనుంచి ఆంధ్రదేశంలో జరుగుతున్నై. నవమి తిథినాడు శ్రీరాముడు జన్మించడం చేత జయంతి జరపడం సహజంగానే ఉన్నది. శ్రీరాముడు వివాహం జరిగినరోజు ఫాల్గుణ పూర్ణిమ ఉత్తర నక్షత్ర శుభముహూర్తమున, కాని మనం చైత్రశుద్ధ నవమినాడు కళ్యాణోత్సవం జరుపుతున్నాం. జగత్పూజ్యులయిన సీతారాముల వివాహమునకు వసంతశోభల గూర్చుటకు కాబోలు చైత్రశుద్ధ నవమి జన్మదినమునే మనవారు కూడా కళ్యాణోత్సవమునకు నిర్ణయించినటుల తోచుచున్నది.

జన్మదినోత్సవం జరపడం కన్న కళ్యాణోత్సవం జరపడంలోగల విశిష్టతను ఆంధ్రులు గ్రహించినంతగ ఉత్తరాదివారు గ్రహించలేదన వచ్చును. శ్రీకృష్ణ జయంతి జరుపుతాం. శ్రీ కృష్ణ కళ్యాణానికి మనం అంతగ ప్రాశస్త్యం ఈయలేదు. శ్రీ రాముని జన్మోత్సవం కన్న కళ్యాణోత్సవమునకు మనం ప్రాధాన్యం ఇచ్చాం. శ్రీరాముని జన్మకు కారణం రావణవధ తద్వారా లోకకళ్యాణం సీతాదేవితో కూడిన శ్రీరాముని వలననే లోకకళ్యాణం సాధింప బడ్డది. కనుక సీతారాముల కళ్యాణమునకే మనము ఎక్కువ విలువనిచ్చాం. శ్రీకృష్ణుడు జగద్గురువు. శ్రీరాముడు జగన్నాథుడు. జగన్నాథునకు కళ్యాణోత్సవం జరపడంలోగల విశిష్టతను, సాంప్రదాయసరళిని మనం గుర్తించాం. సీతారాముల కళ్యాణం మహా వైభవంగా భద్రాచలంలో జరిగినటుల మరెక్కడా జరగదు.

భారతీయ కాలమానం ప్రకారం శ్రీరాముడు జన్మించినది వైవస్వత మన్వంతరమున పంచమ త్రేతాయుగము నాలుగవభాగమున ముప్పదివేల సంవత్సరమునకు సరియగు విళంబిసంవత్సర చైత్రశుద్ధనవమి బుధవారం. ఇలా మన్వంతరానికి మన్వంతరాలు గతించినా మనం ఆయనను మరువకుండా ఈ నాటికిని శ్రీరామనవమీ మహోత్సవాలు, రామనామ సప్తాహములు, ఏకాహములు, విరివిగా జరుపుతున్నాం.

శ్రీరామచంద్రుడు చారిత్రకపురుషుడని పాశ్చాత్యులు గూడా నిర్ధారణ గావించిరి. పురాణములలోని రాజవంశములను పరిశీలించిన శ్రీరామచంద్రుడు మహాభారతయుద్ధమునాటికి అతి ప్రాచీనుడని తెలియును. మనుచక్రవర్తి వంశావళిలో శ్రీరామచంద్రుడు 65వ పురుషుడనియు, శ్రీరాముని వంశస్థుడు శ్రీకృష్ణభగవానునకు సమ కాలికుడు అయిన బృహద్బలుడు మనువంశమున 94వ వాడు అనియు సుప్రసిద్ధ పాశ్చాత్య చారిత్రకుడు పర్గిటేరు నిర్ణయించెను. పర్గిటేరు వాదము ననుసరించి శ్రీరామకృష్ణాదుల మధ్య గతించిన కాలము 6 శతాబ్దములు. మహాభారత యుద్ధము క్రీ.పూ. 15వ శతాబ్దమున జరిగినది. పర్గిటేరు పరిశోధన ననుసరించి శ్రీ రామచంద్రుడు క్రీ.పూ. 21వ శతాబ్దమున అవతరించెను. వాల్మీకి రామాయణము నందలి శ్రీరాముని జనన కాల వివరములనుబట్టి క్రీ.పూ. 2055వ సవంత్సరము శ్రీరామచంద్రుని జనన వత్సరమని శ్రీయల్.డి. స్వామికన్ను పిళ్లై గారుకూడ నిర్ధారణ గావించారు. శ్రీ ఎం. ఆర్. సంపత్కుమారన్ గారు ఈ వాదమును సమర్థించిరి. కాని కొందరు పాశ్చాత్య చరిత్రకారులు డబ్ల్యు, డబ్ల్యు, హంటర్, కానింగు ఆర్నాల్డు రామాయణ చరిత్ర క్రీ.పూ. 1000 సంవత్సరముల ప్రాంతమని నిర్ణయించిరి.

భారతీయ కాలమానము ననుసరించి శ్రీ మాన్ కోయిల్ కందాడై వెంకట సుందరాచార్యస్వామి వైవస్వత మన్వంతర పంచమ త్రేతాయుగ చతుర్ధ భాగమున 80000 సంవత్సరమగు విళంబివత్సర చైత్రశుద్ధ నవమి బుధవారమున శ్రీరామచంద్రుడు జన్మించినటుల వచించెను.

ఇంతకన్న ప్రాచీనముగను ఋగ్వేదము (x.93.14) మంత్రమున శ్రీరామచంద్రుని పవిత్ర నామము స్మరింపబడినది. శతపథ బ్రాహ్మణము శ్రీరామచంద్రుని సోదరుడు భరతుని గూర్చిన గాధను వర్ణించెను. తైతరీయ ప్రాతిశాఖ్యమున పేర్కొనబడిఋషులలో వాల్మీకిమహర్షి పేరు

కలదని వెబర్ అను పాశ్చాత్య చరిత్రకారుడు పరిశోధించి చెప్పెను. ఇట్టి పరిశోధనాంశముల వలన శ్రీరామచంద్రుడు భారతీయ చరిత్రయందు అత్యంత ప్రాచీన పురుష నాయకుడని రూఢీగా చెప్పవచ్చు."

## చైత్రశుద్ధ దశమి

ఈనాటి వివరణలో మన పంచాంగకర్తలు ధర్మరాజదశమి, శాలి వాహన జయంతి అని వ్రాస్తారు. రామ నవమీ వ్రతాంగహోమముకాక ఈనాడు మరిరెండు పర్వాలు, అయి ఉన్నాయి.

## ధర్మరాజదశమి

ఈనాడు దమనముతో ధర్మరాజును పూజించాలని స్మృతి కౌస్తుభము చెబుతూవుంది. ఉగాది పండుగనాటి వివరణలోనే మనము ఈ విషయం తెలిసికొని ఉన్నాము.

## శాలివాహన జయంతి

శాలివాహనుడు శాతవాహన పర్యామాభిధానుడు. ఆంధ్రభూమి ప్రసవించిన మహాపురుషులలో ఇతడు ఒకడు. శాలివాహనునిగాధను పురాణ నామచంద్రిక ఇట్లు చెప్పుచున్నది.

"శాలివాహనుడు శకపురుషుడు. ఇతనిచే విక్రమార్కుడు చంపబడెను. ఇతడు నాగేంద్రుని వరప్రసాదమువలన కుమ్మర కన్నెకు జన్మించెను అని చెప్పెదరు. 'శకకర్తా విక్రమజిత్ కానీనశ్శాలివాహనః' అని ప్రమాణము.

పైఠణము అను పట్టణము నందు సోమకాంతరాజు రాజ్యము చేయు చుండగా అందు నీతిసంపన్నుడును, ధార్మికుడును అయిన సులోచనుండు అను బ్రాహ్మణుడు ఒకడు ఉండెను. అతనికి సుమిత్ర అను కూతురు ఒకతె కలదు. దానికి నాలుగేండ్ల ప్రాయమున దాని తల్లి చనిపోయినందున తండ్రి చేతనే పెంచబడి వివాహము కాకమునుపే ఋతుమతి అయి దైవికముగా తటస్థించిన ఒక పురుషుని గూడి గర్భిణియు ఆయెను అప్పుడు సుమిత్ర తనకు గర్భము కలుగుటచే తన్నులోకులు నిందింతురు అను వెఱపుచే చింతాక్రాంతయై తన యొద్దకు వచ్చుచున్న పురుషునితో తన మనోదుఃఖమును చెప్పెను. అందుకు అతడు "నేను మనుష్య మాత్రుడను కాను, ఆదిశేషుడను, నీకు నాసంగమము వలన శకకర్తయు పరాక్రమ

శాలియు అగు సత్పుత్రుడు జనింపగలడు. దీనిచే నీకుగాని నీతండ్రికి గాని సంకటములు పొసగునెడ నన్ను తలంపుము. నేను అప్పుడే వచ్చి మీ సంకటములను తొలగించి పోయెదను" అని చెప్పి తన నిజరూపమును చూపి అంతర్ధానము అయిపోయెను.

అంతట ఈ వర్తమానము అంతయు సుమిత్ర తన తండ్రితో చెప్పినది. అతడు దైవ సంకల్పము చొప్పున ఏది ఎట్లు జరగవలెనో అట్లు జరగకపోదు అనిచెప్పి తన్ను మన్నింపగా నిశ్చింత అయి ఉండెను. అనంతరము సుమిత్ర పెండ్లి కాకమునుపే ఈడేఱుటయు వెంటనే గర్భము ధరించుటయు వారి చుట్టములకు అందఱకు తెలిసి, ఈ తండ్రి బిడ్డలను వెలివేసి రాజునకును ఈ వృత్తాంతము తెలిపిరి. అందులకు రాజు వారిని తన పట్టణము నుండి వెళ్లగొట్టించెను.

అంతట సులోచనుండు పట్టణము వెలుపల ఒక కుమ్మరి వాని యింటచేరి కాలము గడుపుచూ ఉండగా శాలివాహనుండు జనించి బాల్యము నందే తనతో బాలురను కూర్చుకొని తాను రాజు అనియు తక్కినవారు మంత్రి మొదలగువారు అనియు నిరూపించుకొని రాజ్య భారము చేయువానివలె ఆటలాడుచు ఉండెను. వీని ఆటలు చూచునట్టి కుంభకారులు అందఱు ఆశ్చర్యపడుచు మెచ్చుకొను చుండిరి. అట్టియెడ శాలివాహనుడు ఆ కుంభకారులను చూచి రాజు యొక్క దర్బారులో నడుచునట్టి వ్యవహారముల నానాడు విచారించు కొని వచ్చి నాకు తెలియజేయుడు అని చెప్పగా వారును అట్లే చేయుచు ఉండిరి. అంత ఒకనాడు శాలివాహనుడు తన సహవాసులు అగు బాలురతోడ కొలువు తీరి ఉండగా ఒక బ్రాహ్మణుడు వచ్చి ఎగతాళికి పంచాంగము చెప్పెను. అప్పుడు శాలివాహనుడు ఓ బ్రాహ్మణుడా మన రాజ్యమునకు యోగము ఎట్లున్నది అని అడిగెను. అందుకు ఆ బ్రాహ్మణుడు మీ రాజ్యమునకు ఏమి లెస్సగా ఉన్నది అని చెప్పగా అచ్చట కుమ్మరావములో ఉన్న కడవ ఒకటి ఎత్తి అతనికి బహుమానముగా ఇచ్చి పంపెను. అది మఱునాడు స్వర్ణమయము ఐనందున ఈ బాలుడు బంగారు కడవలు దానము చేయువాడు అని లోకమందు అంతట ఒక ప్రవాదము విస్తరిల్లెను.

అనంతరము ఇతడు అచ్చట కుమ్మరవారిచే ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులు అనెడు చతురంగ బలములను మట్టితో చేయించుచు ఉండెను.

అట్టి యెడ ఈ వృత్తాంతము అంతయు విక్రమార్కుడు విని వీనిని తన పట్టణమునకురప్పించి చూచి సంభాషింపవలెను అని బహు ప్రయత్నములు చేసెను, కాని ఆయత్నములు ఏమియు కొనసాగక పోయెను.

అప్పుడు పురందరపురము నందు ఉన్న ధనంజయుడు అను ఒక వైశ్యుడు తన మరణ కాలమున తాను పండుకొనెడు మంచము నాలుగు కోళ్ల క్రిందను ఉమక, బొగ్గు, మన్ను, ఎముకలను పాతిపెట్టి తన కొడుకులను నలువురను పిలిచి ఈ మంచపు కోళ్ల కింద పూడ్చియుండు ధనము మీరు నలుగురును సమభాగముగా పంచుకొని జీవింపుడు అని చెప్పి మరణమును పొందెను. ఆకుమారులు తండ్రికి జరగవలసిన అగ్ని సంస్కారాది క్రియలునెఱవేర్చి తమ తండ్రి చెప్పిన చొప్పున మంచపు కోళ్ల క్రింద త్రవ్విఅందుకనబడిన వస్తువులను చూచి వానిని పంచుకొను విధము ఇట్టిది అని తెలియక అప్పుడు ప్రసిద్ధులై ఉన్న రాజులను న్యాయాధిపతులను తమకు విభాగ నిర్ణయము తెలుప ప్రార్థించి ఎవరివల్లను కాకపోవుటచే, ఇంక తిరిగి ప్రయోజనము లేదు అని నిస్పృహులై తమ నివాసములకు పోవుచు మార్గవశమున ఈ శాలివాహనుండు ఉన్నచోటికి వచ్చిరి.

అప్పుడు శాలివాహనుడు వారిసంగతి విచారించి పై నాలుగు వస్తువులను జ్యేష్ఠాను క్రమముగా ఒక్కొక్కడు ఒక్కొక్కదానిని తీసుకొనవలసినదిఅని మీ తండ్రియభిప్రాయము. అది ఎట్లు అనగా పెద్దవానికి మట్టి ఇచ్చెను. దానికి తన భూమి అంతయు అతనిది అని అర్థము. రెండవవానికి ఉముక ఇచ్చెను. దానికితన ధాన్యమంతయు వానిది అని అర్థము. మూడవ వానికి బొగ్గు ఇచ్చెను. దానికి బంగారు, వెండి మొదలగు లోహద్రవ్యము సర్వమును అతనిది అని అర్థము. నాల్గవవానికి ఎముకలు ఇచ్చెను. దానికి గోధనము సర్వమును వానిది అని అర్థము. అని భాగ నిర్ణయమును వివరించెను.

వారు అది సరి అయిన తీర్పు అని సంతోషించి తమ పట్టణమునకు పోయి సుఖముగాఉండిరి. అనంతరము విక్రమార్కుడు ఈ వృత్తాంతమును విని శాలివాహనుని లోబఱచుకొననియెడ తన కీర్తి మాసిపోవును అని ఎంచి చతురంగ బలములతో శాలివాహనుడు ఉన్న పట్టణమునకు రాగా ఆసంగతి తెలిసి శాలివాహనుడు మట్టితో చేయించి ఉండిన చతురంగ బలమును నాగేంద్రుని యనుగ్రహమువలన జీవము

కలవానిగా చేసికొని ఎదిరించి వి(క్రమార్కుని చంపి అతని సైన్యమును నర్మదానది వరకు తఱుము కొని పోయి అందుడి వెనుకకు మరలెను. కనుక నర్మదకు దక్షిణమున శాలివాహనశకమును, ఉత్తరమున వి(క్రమార్క శకమును వాడబడుచు ఉన్నది.

## చైత్రశుద్ధ ఏకాదశి

తిథులన్నిటిలోకి ఏకాదశి చాలా పవి(త్రమైనది. ఏకాదశి సాధారణంగా ఉపవాసాల రోజు. ఏకాదశి తిథి పదిహేను రోజులకు ఒకసారి వస్తుంది. పక్షానికి ఒకటి, మాసానికి రెండు చొప్పున సంవత్సరానికి ఇరవై నాలుగు ఏకాదశులు. ఈ ఇరవైనాలుగు ఏకాదశులున్నూ ఇరవై నాలుగు పర్వాలుగా ఉంటున్నాయి.

ఏకాదశి అనేది పౌరాణిక గాథల్లో ఒకదేవత.

మురాసురుణ్ణి సంహరించడానికి విష్ణువు వైకుంఠాన్నుంచి గరుడ వాహనం మీద భూమి మీదికి దిగి వచ్చాడు. అసురుడితో అతడు బాగా యుద్ధం చేశాడు. యుద్ధమధ్యంలో అతడు అలసి పోయి మూర్ఛపోయాడు. అప్పుడు అతని శరీరంలో నుండి ఒక సౌందర్యవతి ఆవిర్భవించి అసురుడితో యుద్ధం చేసి అతనిని సంహరించింది.

ఆ సౌందర్యవతికి దేవతలు ఏకాదశి అనే పేరు పెట్టారు. ఏకాదశి పొందిన విజయాన్ని స్మరించడం కోసం ఈ పర్వం ఏర్పడిందంటారు. ఈనాడు ఏకాదశి (వ్రతం ఆచరించే వారిని ఆ దేవత అరసి రక్షిస్తుందని పురాణవచనం.

మహారా(ష్టులలో ఏకాదశి (ప్రాదుర్భావాన్ని గురించి వాడుకలో ఉన్న కథను కోథారి పండితుడు ఇట్లా కథిస్తున్నాడు.

"మహాభారత యుద్ధానంతరం ధర్మరాజు బంధుమారణానికి విచారించి (ద్రౌపది ద్వారా కృష్ణమూర్తిని ఆ పాపం పరిహారమయ్యే మార్గము చెప్పమని (ప్రార్థించాడు.

అప్పుడు కృష్ణుడు ఏకాదశి (వ్రతం ఆచరించమని చెప్పాడు. ఆ (వ్రతం సకలపాప సంహారకమైనదని అతడు అన్నాడు. అందు మీద ధర్మరాజు, అర్జునుడు ఆ (వ్రతవిధానం వివరించమని కృష్ణుని (ప్రార్థించారు.

కుంభదైత్యుని కొడుకు మృదమన్యుడు అతడు శంకర భక్తుడు.

అతని భక్తికి మెచ్చి శంకరుడు మరణం లేకుండా వరం ఇచ్చాడు. ఆ వరం చేత గర్వితుడై ఆ రాక్షసుడు దేవతలకి, మానవులకి కూడా పీడకరుడు కాగా శివుడు తన వరాన్ని మార్చి ఆ రాక్షసుడు త్రిమూర్తుల్ని, ఇంద్రుణ్ణి కూడా జయించినా తుదకు తల్లిదండ్రులు లేని ఒక స్త్రీ చేతుల్లో చచ్చి పోతాడన్నాడు. అలా అని శంకరుడు అదృశ్యుడు అయ్యాడు. అందు మీద మృదమన్యుడు మహాదేవుని మీద కోపగించి ఇంద్రుడి మీదకు ఎత్తి వెళ్లాడు. ఇంద్రుడు భయపడి బ్రహ్మశరణుచొచ్చాడు.

ఆ రాక్షసుడు అక్కడికీ వెళ్లాడు. అప్పుడు బ్రహ్మ తన భార్యను, ఇంద్రుణ్ణి వెంట పెట్టుకొని వైకుంఠానికి పరుగెత్తాడు. అక్కడ బ్రహ్మ విష్ణువుతో తన రాకకు కారణం చెబుతూ వుండగానే రాక్షసుడు కూడా అక్కడికి వచ్చి విష్ణువును నెక్కాటికయ్యానికి రమ్మన్నాడు.

విష్ణువుకు, మృదమన్యుడికి యుద్ధం సాగుతూ ఉంది. మృదమన్యుడి పట్టులో విష్ణువు పడ్డాడు. బ్రహ్మాండం మీద అతడు ఎట్లాగో తప్పించుకుని భార్యతో, భార్యాసహితుడైన బ్రహ్మతో, ఇతర దేవతలతో కైలాస పర్వతానికి పారిపోయాడు.

కైలాసంలో శంకరుడు వారి రాకకు కారణమడిగాడు. నీవు ఇచ్చిన వరం చేత రాక్షసుడు ఇంత లోకోపద్రవకారకుడు అయ్యాడని విష్ణువు శంకరుడితో చెప్పాడు.

ఇంతలో మృదమన్యుడు కైలాసానికి కూడా వచ్చాడు. శంకరుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు. శంకరుడు యుద్ధానికి సిద్ధపడుతున్నాడు, అప్పుడు మృదమన్యుడు త్రిమూర్తుల్ని తనకు లొంగి పోవలసిందిగా అరిచాడు. చేసేదిలేక త్రిమూర్తులు భార్యలతో త్రికూట పర్వతానికి పారిపోయి ఆ కొండమీద అడివిలో పెరుగుతూ వున్న ఒక ధాత్రీ వృక్షం తొరటలో **(Phyllanthus emblica) or (emblic murabollam)** దాక్కున్నారు.

అక్కడ నుంచి ప్రాణ రక్షణార్థము ఎక్కడికి, పారిపోవాలో వారికి తెలిసింది కాదు. కాబట్టి భార్యలతో అందులోనే పడి వున్నారు. ఇంతలో అక్కడికి ఒక కన్య వచ్చింది. ఆమెను చూచి ఆ తొరటలో వున్న త్రిమూర్తులు, వారి భార్యలూ మొత్తం ఆరుగురూ దీర్ఘనిశ్వాసాలుపుచ్చారు.

అది వర్షాకాలం, అప్పుడే వర్షం కురిసింది. ఆవర్షంలో వారు పూర్తిగా

స్నానం చేసినట్లుఐంది. పైగా ఆతురతలో వున్నారేమో ఆరోజుల్లా వారు నిరాహారులై వుండి పోయారు.

ఇంతలో ఆకన్య ఆ తొర్రలోనుంచి వెళ్లి పోవడానికి సిద్ధ పడింది. అప్పుడు ఆ ఆరుగురు ఆమెను ప్రార్థించారు. రాక్షసుని చంపి తమ్మి రక్షించమని, ఈ సరికి రాక్షసుడు అక్కడికి వచ్చివున్నాడు. అతనికి ఆ కన్య కనిపించింది. నీవు ఎవరవనీ, ఆ అడవిలోకి ఎందుకు వచ్చావనీ అతడు ప్రశ్నించాడు.

దానికి ఆమె తన పేరుతో అతనికి నిమిత్తంలేదనీ-అతన్ని సంహరించడానికి శంకరుడు తన్ను ఆదేశించాడనీ - తన చేతుల్లో చావడానికి ఆ రాక్షసుడు అక్కడికి వచ్చాడనీ బదులు చెప్పింది. చెబుతూనే ఆమె కత్తితో అతని మీదికి వెళ్లి అతని చేతులు, తల ఖండించి ఆకాశం వరకు విజృభించింది. దుర్గాదేవి చెలికత్తెలైన యోగినులు ఆమెను ఆశీర్వదించారు. ఆతురుల్ని రక్షించిందని స్తోత్రం చేశారు.

అప్పుడు తొర్రలో నుంచి ఆర్గురు బయటికి వచ్చి ఆమె పాదాల మీద పడి తమ్మి రక్షించినందుకు మొక్కారు. అందుమీద ఆమె వారితో తన పేరు ఏకాదశి అనీ, తనకు తల్లిదండ్రులులేరనీ, వారి నిశ్వాసం వల్లనే తాను జన్మించాననీ, ఆనాడు చేసినట్లే పదిహేను రోజులకు ఒకసారి ఏకాదశి వ్రతం చేయమనీ, చేస్తే సకల పాప పరిహారం అవుతుందనీ చెప్పింది "కొథారి".

ఏకాదశి వ్రతప్రాశస్త్యాన్ని గురించి పురాణాలు విశేషంగా చెబుతున్నాయి. ఆ సందర్భంలో తరుచు చెప్పబడేది రుక్మాంగదుని గాధ. రుక్మాంగదుడు మంచిరాజు. అతనికి నందవనం అనే గొప్పపూలతోట ఉంది. అపురూపమైనవి, మంచి వాసనగలవి, అయిన పూల చెట్లను ఎన్నిటినో అతడు ఆ తోటలో నాటించి పెంచే ఏర్పాటు చేశాడు. అందలి పూవులతో అతడు నిత్యం దేవపూజ చేసేవాడు. రుక్మాంగదుని పూలతోట ఇట్లా ఉంటూ ఉండగా స్వర్గ లోకంలో ఇంద్రుని ఉద్యానవనంలో ఒకనాడు ఎందుచేతనో పువ్వులు లేకపోయాయి. అందుచేత ఇంద్రుని దేవపూజ ఆగిపోయింది. పువ్వుల కోసం అన్వేషణ ప్రారంభమైంది. భూలోకంలో రుక్మాంగదుని పూలతోటలో పువ్వులు పుష్కలంగా ఉన్నాయి అనే సంగతి వాకబు వల్ల అతనికి తెలిసింది. మానవ మాత్రుని పువ్వుల కోసం

ఆ(శయించడం దేవతల రాజుకి అభిమానమనిపించింది. అందుచేత తన సేవకులను పంపి (ప్రతిరోజు తెల్లవారగట్ల దొంగతనంగా రుక్మాంగదుని తోటలోని పువ్వులు తెప్పించుకొనేవాడు ఇం(ద్రుడు. ఇలా కొన్నాళ్ల పాటు సాగింది.

రుక్మాంగదుని పూజవేళకు తోటలో పూవులు లేక పోతూ ఉండేవి. ఈ సంగతి వనపాలకులు తమ రాజుతో చెప్పారు. జా(గ్రత్తగాకాసి దొంగల్నిపట్టుకోమని రాజు చెప్పాడు. ఎంత జా(గ్రత్తగా కాసినా దొంగల జాడ దొరకలేదు. దేవ సేవకులు మానవులకు కనిపించరుకదా! వారు అదృశ్యంగా ఉంటూ పూవులు కోసుకుపోయేవారు.

ఇట్లా ఉంటూ ఉండగా జాబాలి అనే ఋషి ఒకడు ఆమార్గాన పోతూ ఆ తోటలో మకాం వేశాడు. యోగాభ్యాసం చేసుకోవడానికి ఆ(ప్రదేశం బాగా ఉండడం చేత అతను అక్కడకొన్ని రోజులపాటు ఆగాడు. తోటమాలీలు అతడే తమతోటలో పూవులు దొంగిలిస్తున్నాడనుకున్నారు. కాగావారు ఆ యోగిని పట్టుకొని తమ రాజు వద్దకు తీసుకువెళ్ళారు.

రాజు సంగతి సందర్భాలన్నీ విచారించి యోగి మహత్తు తెలుసుకుని అతని పాదాలకు (ప్రణమిల్లి తప్పు క్షమించమని కోరాడు. రాజు నిష్కల్మషహృదయాన్ని జాబాలి ఆకళించి అతనిని మన్నించాడు. అంతేకాక ఆముని రాజుకు కొన్ని మూలికలు ఇచ్చాడు. ఆమూలికలు కనుక తోటలో రా(త్రి వెలిగిస్తే ఆ పొగసోకి దొంగలు దొరికి పోతారని చెప్పాడు.

ఆ రా(త్రి రాజు ఆమూలికలను తనతోటలో వెలిగిస్తాడు. తెల్లవారు జామున వచ్చిన దేవసేవకులు రాజుకు దృశ్యమానులై దొరికి పోతారు. ఆ మూలికల పొగసోకడం చేత వారికి భౌతిక రూపాలు వస్తాయి. ఆ స్థూలరూపాలతో తిరిగి పైకి స్వర్గలోకానికి వారు ఎగరిపోలేక పోతారు. అప్పుడు వారు సంగతి అంతా రుక్మాంగదుడికి చెప్పి వేస్తారు. ఆ మూలికల పొగమూలకంగా తమ సూక్ష్మ శరీరాలకు భౌతిక పదార్థాలు సోకి స్థూల శరీరాలు అయిపోవడం చేత తాము తిరిగి దేవలోకానికి పోలేక పోతున్నామని వాపోతారు.

ఇంతలో అక్కడికి నిరంతర ఏకాదశి(వ్రత నిష్ఠవలన అతి పవి(త్రురాలైన ఒక చాకలిది వస్తుంది. ఏకాదశి(వ్రతనిష్ఠ వలన అతి పవి(త్రురాలైన ఆ చాకలిది అప్పుడు ఆ దేవసేవకులను ముట్టుకుంటుంది.

అందుతో వారికి దివ్యత్వం వస్తుంది. తిరిగి సూక్ష్మ శరీరాలు పొంది వారు దేవలోకానికి వెళ్లిపోతారు.

ఈ పురాణగాధలో గొప్ప వేదాంతార్థం ఇమిడి ఉంది. జీవుడికి భూలోకంలో అనేక వాసనలు అంటుకున్నాయి అనీ, అందుచేత అతను ఉత్పథగామి కాలేక పోతున్నాడనీ, ఏకాదశి(వ్రతం నిష్ఠగా ఆచరించడం వల్ల ఆవాసనలను విడనాడి అతడు మోక్షపదవి పొందగలడనీ ఈ గాధ వలన సూచిత మవుతున్నది.

చాకలిది చేసిచూపిన దానితో ఏకాదశి(వ్రతమాహాత్మ్యం రుక్మాంగదుడికి తెలిసి వస్తుంది. అప్పటి నుంచి రుక్మాంగదుడు కూడా ఏకాదశీ (వ్రత నిష్ఠా గరిష్ఠుడు అవుతాడు. ఆనిష్ఠవలన అతడు ఇం(ద్రపదవిని అధిష్ఠింపజాలే శక్తిని సంతరించు కొంటాడు. అందుచేత ఇం(ద్రుడికి భయం పుట్టి అతని నిష్ఠనుచెడ గొట్టమని మోహిని అనే దేవవేశ్యను పంపుతాడు.

రుక్మాంగదుడు మోహినికి వశ వర్తుడు అవుతాడు. మోహినితోడిదే లోకంగా ఉంటూ అతడు తన రాజ్యాన్ని, భార్యను, కొడుకును మరిచిపోతాడు. ఇట్లు తనకు పూర్తిగా వశవర్తుడై పోయిన రాజువల్ల ఆమె ఒక వాగ్దానాన్ని పొందుతుంది.

ఈ వాగ్దానాన్ని పురస్కరించుకొని మరుసటి ఏకాదశిరోజున మోహిని ఒక పట్టు పడుతుంది. ఆనాడు ఉపవాసంమాని రాజు తనతో అన్నమేనా తినాలి లేదా కన్న కొడుకుకంఠాన్ని కత్తితో తెగవేయనేనా తెగవేయాలి అని. ఆమె మనస్సు మార్చడానికి రుక్మాంగదుడు అనేక విధాల (ప్రయత్నిస్తాడు. కాని కార్యం లేకపోతుంది. ఏకాదశి (వ్రతం మానడానికి మా(త్రం అతను ఎంత మా(త్రం ఇష్ట పడలేదు. కన్నకొడుకును కత్తికి ఎరచేసి వేయడానికి సిద్ధపడ్డాడు. తన భార్యను కత్తి తెమ్మన్నాడు.

కొడుకుని కాచుకుని నిలబడమన్నాడు. తెగవేయడానికి కత్తి ఎత్తాడు. అప్పుడ విష్ణువు (ప్రత్యక్షమయ్యాడు. రుక్మాంగదుని ఏకాదశి (వ్రతనిష్ఠకు మెచ్చి అతనికి ఇం(ద్ర పదవి ఇచ్చాడు.

పద్మపురాణ ఉత్తరఖండంలో ఏకాదశీ(వ్రతమాహాత్మ్యము ఇట్లు చెప్పబడింది. "దేవదానవులు క్షీరసాగరమును ఒక ఏకాదశీ దినమున

మథింప ప్రారంభించిరి. మిక్కిలి నియమముతో వారు ఏకాదశిని ఉపవసించి యుండిరి. మొదట హాలాహలము, తరువాత జ్యేష్ఠాదేవి పుట్టాయి. మరునాడు అనగా ద్వాదశినాడు లక్ష్మీదేవి పుట్టింది. అప్పుడు విష్ణువు లక్ష్మీదేవిని చేకొంటూ ఇట్లా చెప్పాడు. ఓ దేవతలారా! మీరు లక్ష్మీ సందర్శనాన్ని కోరి ఏకాదశిని ఉపవసించారు. ఏకాదశి సకలోపద్రవ నాశకమైనది. ఏకాదశితో సమానమైన వ్రతం లేదు. ఏకాదశేంద్రియాలచే చేసిన పాపాలు అన్నీ ఏకాదశ్యుపవాసం వల్ల నశిస్తాయి. సకల వర్ణముల వారికి, ఆశ్రమస్థులకు, స్త్రీలకు ఏకాదశి వ్రతం తప్పక చేయతగ్గది. దశమితో కలసిన ఏకాదశిని వర్జించి, పరిశుద్ధమైన ఏకాదశియందు ఉపవాసం చేయాలి. దశమి యందు ఏకభుక్తము చేసి, ఆరాత్రి కటికి నేలమీద పరుండి, మరునాడు ఏకాదశియందు ఉసిరిక పప్పును నూరి శరీరానికి పూసుకుని స్నానం చేసి ఉపవాసం ఉండి పురాణాది పఠనతత్పరుడై పగలు నిద్రింపక యారాత్రి తిరిగి కటికి నేల మీద పరుండి ద్వాదశి నాడు పూజ, భోజనం సాగించాలి.”

ఇట్లు ఏకాదశి గొప్పతిథి అయి ఉంది. ఏడాదిలో వచ్చే ఇరవై నాలుగు ఏకాదశులున్నూ ఇరవై నాలుగు గొప్ప తిథులు.

చాంద్రమానపరిగణనమున మూడేళ్లకు ఒకసారి అధికమాసం వస్తూ వుంటుంది. ఆ అధిక మాసంలో రెండు ఏకాదశులు. అధిక మాసం వచ్చినప్పుడు ఏడాదికి ఇరవై ఆరు ఏకాదశులు అవుతాయి.

ఇట్లు ఇరవైనాలుగు, లేదా ఇరవై ఆరు ఏకాదశులు ప్రత్యక్ష పర్వాలై ప్రత్యేకనామాలతో వ్యవహరింపబడుతున్నాయి.

1. చైత్రశుక్ల ఏకాదశి - కామదైకాదశి.
2. చైత్ర బహుళ ఏకాదశి - వరూధిన్యేకాదశి.
3. వైశాఖ శుక్ల ఏకాదశి - మోహిన్యేకాదశి.
4. వైశాఖ బహుళ ఏకాదశి - అపరైకాదశి.
5. జ్యేష్ఠ శుక్ల ఏకాదశి - నిర్జలైకాదశి.
6. జ్యేష్ఠ బహుళ ఏకాదశి - యోగిన్యేకాదశి.
7. ఆషాఢ శుక్ల ఏకాదశి - పద్మైకాదశి.
8. ఆషాఢ బహుళ ఏకాదశి - కామికైకాదశి.
9. శ్రావణ శుక్ల ఏకాదశి - పుత్రదైకాదశి.

10. శ్రావణ బహుళ ఏకాదశి - అజైకాదశి.
11. భాద్రపద శుక్ల ఏకాదశి - వామనైకాదశి.
12. భాద్రపద బహుళ ఏకాదశి - ఇందిరైకాదశి.
13. ఆశ్వీయుజ శుక్ల ఏకాదశి - పాశాంకుశైకాదశి.
14. ఆశ్వీయుజ బహుళ ఏకాదశి - రమైకాదశి.
15. కార్తీక శుక్ల ఏకాదశి - ప్రబోధన్యైకాదశి.
16. కార్తీక బహుళ ఏకాదశి - ఉత్పత్త్యైకాదశి.
17. మార్గశిర శుక్ల ఏకాదశి - మోక్షదైకాదశి.
18. మార్గశిర బహుళ ఏకాదశి - సఫలైకాదశి.
19. పుష్య శుద్ధ ఏకాదశి - పుత్రదైకాదశి.
20. పుష్య బహుళ ఏకాదశి - షట్‌తిలైకాదశి.
21. మాఘ శుద్ధ ఏకాదశి - జయైకాదశి.
22. మాఘ బహుళ ఏకాదశి - విజయైకాదశి.
23. ఫాల్గుణ శుద్ధ ఏకాదశి - ఆమలక్యేకాదశి.
24. ఫాల్గుణ బహుళ ఏకాదశి - పాపమోచిన్యేకాదశి.
25. అధిక మాసపు శుద్ధ పక్ష ఏకాదశి-సుభద్ర.
26. బహుళ పక్ష ఏకాదశి - కమల.

ఈ ఏకాదశులలో కొన్ని ప్రత్యేక కారణాల చేత ప్రత్యేక మగు కొత్త పేర్లను కూర్చుకున్నాయి. ఆషాఢశుద్ధ ఏకాదశి శయనైకాదశి. భాద్ర శుక్ల ఏకాదశి పరివర్తనైకాదశి. కార్తిక శుక్ల ఏకాదశి బోధనైకాదశి. మాఘ శుద్ధ ఏకాదశి భీష్మ ఏకాదశి. తెలుగుదేశంలో వాడపల్లి ఏకాదశి, కోరుకొండ ఏకాదశి, అంతర్వేది ఏకాదశి అనేవిశేషమైన ఏకాదశులున్నూ ఉన్నాయి. ఆయా ఏకాదశుల వివరణ సందర్భాన వీనిని గురించి వివరాలు తెలుసుకొందాము.

## కామదైకాదశి

సంవత్సరంలోని ఇరవైనాలుగు లేదా ఇరవై ఆరు ఏకాదశులు ఇరవై నాలుగు లేదా ఇరవై ఆరు పర్వాలై ఉన్నాయి అని తెలుసుకొని ఉన్నాము. మన ప్రస్తుత పరిశీలనాన్ని అందుతూ ఉన్న చైత్రశుద్ధ ఏకాదశి కామదైకాదశి అనే పర్వమై ఉన్నది. ఇరవై నాలుగు లేదా ఇరవై ఆరు ఏకాదశుల్లోనూ చైత్రశుద్ధ ఏకాదశి మొదటిది. కామదైకాదశి అనగా కోరిన కోరిక ఇచ్చే

ాదశి అని అర్థము. లలిత అనే గంధర్వ స్త్రీ ఈనాడు ఏకాదశి వ్రతాన్ని ు తన యొక్క కోరిక ఈడేర్చుకొన్నది.

లలిత భర్త ఒక గంధర్వుడు. గంధర్వుడై ఉండి కూడా అతడు ంగీతము సరిగ్గా పాడలేక పోయాడు. అందుచేత శాపం తగిలి అతడు క్షసుడుగా మారిపోయాడు. అప్పుడు వాని భార్య లలిత ఏకాదశి వ్రతాన్ని ి ఆ పుణ్యముతో భర్తను శాపవిముక్తునిగా చేసింది. ఆమె కోరిన కోరికను ేర్చింది కాబట్టి ఈయేకాదశికి కామదైకాదశి అనే పేరు వచ్చింది.

**వాడపల్లి ఏకాదశి**

ఉభయ గోదావరి మండలాల్లో ఈ ఏకాదశిని వాడపల్లి ఏకాదశిగా వహరిస్తారు. వాడపల్లి ఏకాదశి విషయంలో ఒక ప్రత్యేకత ఉంది. డపల్లిలో వెలసిన దైవం వేంకటేశ్వరస్వామి. చైత్రమాసంలోని మొదటి ఐదు దినాలు స్వామివారికి కళ్యాణం జరుగుతుంది. ఏకాదశినాడు లమాదిగల తిరునాళ్లు. రథోత్సవము నాటికి మాలమాదిగలు విశేషంగా ్చేవారు. ఆబోతులను ఊరేగిస్తూ పాటలు పాడుకొంటూ వారు వచ్చేవారు. ంటెద్దులకు ఆనాడు అక్కడ గొప్పపూజ ఉండేది. పశుగణాభివృద్ధికి బోతుల ఆవశ్యకత కొలదులు పెట్ట తరము కానిది. అయినప్పటికి ప్పుడు ఆబోతులను తీసుకువచ్చే మర్యాదను నిలిపివేశారు. బోతులులేని ఉట్టిరథోత్సవం మాత్రం సాగుతూ ఉంది.

వాడపల్లి వెంకన్న పెద్దవెంకన్న అనీ, ద్వారక తిరుపతి వెంకన్న చిన్న ంకన్న అనీ, పెద్ద తిరుపతి వెంకన్న బుల్లి వెంకన్న అనీ గోదావరి జిల్లాలలో ంప్రదాయకంగా చెప్పుకుంటారు. పెద్ద తిరుపతి వెంకన్న ఉత్తర ందూదేశంలో బాలాజీ అనే పేరు ఉంది. ఈ పేరుకు గోదావరి జిల్లాలోని ుడికి ఏమైనా సంబంధం ఉందేమో విజ్ఞులు విచారించాలి.

ఈనాటి వివరణలో మన పంచాంగకర్తలు శ్రీ కృష్ణడోలోత్సవం, క్మిణీపూజ, యమపూజ, అని వ్రాస్తారు. ఈనాడు దమనముతో ుషిపూజ చేయాలని స్మృతి కౌస్తుభము. విష్ణువును పూజించి డోలోత్సవం యాలని మఱికొన్ని వ్రతగ్రంధాలు, కాశ్మీరదేశంలో ఈ ఏకాదశినాడు ష్ణు పూజ చేస్తారని నీలమత పురాణములో ఉంది.

## శ్రీకృష్ణ డోలోత్సవం

చైత్రశుక్ల తదియనాడు, ఉమాశివులను దమనముతో పూజించి డోలోత్సవం చేస్తే గొప్ప ఫలితం ఉండేటట్లే ఈనాడు లక్ష్మీనారాయణులను దమనముతో పూజించి డోలోత్సవం చేస్తే గొప్ప ఫలితం ఉంటుందని శాస్త్రవచనం.

## రుక్మిణీపూజ

రుక్మిణీదేవి ప్రత్యేక పూజలు అందే దినము ఇది. రుక్మిణి శ్రీకృష్ణుని పెద్ద పెళ్లాము. ఆమె మహనీయురాలు. కుండిన నగరమునకు రాజైన భీష్మకుని కూతురు. సోదరుడు ఈమెను శిశుపాలునకు ఇచ్చి పెళ్లి చేయప్రయత్నపడెను. ఆ పెళ్లి ఆమెకు ఇష్టము లేక పోయినది. కృష్ణుని వివాహమాడగోరి తన స్వయంవరానికి వచ్చి తన్ను రాక్షస వివాహమునన్నైన చేకొనమని సందేశం పంపినది. ఆ కబురు అందుకుని కృష్ణుడు వచ్చి స్వయంవరసమయాన వచ్చిన రాజుల ఓడించి రాక్షస వివాహమున ఈమెను తీసుకొనివెళ్లేడు.

రుక్మిణి గొప్ప పతివ్రత, సవతి అగు సత్యభామకు ఈమెపట్ల ఈసు ఎక్కువ. ఒకసారి సత్యభామ నోము ఒకటి నోమినది. ఆనోము సందర్భంలో కృష్ణుని తులాభారము తూచినది. ఒక తులలో కృష్ణుని కూర్చో పెట్టింది. రెండోతులలో తనవద్ద ఉన్న నగలు, నాణేలు అన్నీ ఉంచింది. వీటి అన్నిటి బరువు కృష్ణుని బరువుకు సరితూగలేదు. అప్పుడు సత్యకు వ్రతభంగవవుతుందని భయమువేసి రుక్మిణీదేవిని సలహా అడిగింది. అప్పుడు రుక్మిణి సత్యభామ వేసిన నగలను అన్నిటిని తీసి వేయించి తాను ఒక తులసీదళాన్ని కృష్ణుని పై మనస్సు నిలిపి తులలో పెట్టింది. కృష్ణుని కంటే ఈ తులసీదళమే ఎక్కువ బరువు అయింది.

రుక్మిణి పతి ప్రేమ యొక్క గొప్పతనాన్ని తెలిపే మరి ఒక గాధ ఉంది. ఒకనాడు కృష్ణుడు రుక్మిణీదేవిలోగిట లోపలి మందిరంలో ఉన్నాడు. రుక్మిణీదేవి ఏకాంత సేవాచతుర అయి అతనికి వీవనతో మెల్లగా విసరుతూ ఉంది. పతి యేరూపము దాల్చినం దదను రూపంబైన రూపంబుతో సతి దానుండెడునట్టి రూపవతి, అనన్యమతి అయిన రుక్మిణీదేవితో విరసోక్తులు పలికాడు కృష్ణుడు. శిశుపాలుణ్ణి పెళ్లాడక నన్ను పెళ్లాడేవు. నేను నీకు తగను. నీకు తగిన మరి ఒక మనుజేంద్రుని పెళ్లాడు అన్నాడు. ఆ

మాటలకు ఆమె బెబ్బులి రొదవిన్నలేడి అయింది. చేష్టలు తక్కి మూర్ఛ పోయింది. అప్పుడు శ్రీకష్ణుడు మృదు మధుర భాషణములతో ఆమెను అనునయిస్తాడు. దురుక్త క్రూర నారాచశోషణముల నుండి ఆమె అందుతో తేరుకుని అతనిని కొని యాడుతుంది. నీవు పతివ్రతామణివి. నాసేవనమేకాని నీవు అన్యం ఎఱుగవు. నీభావం ఎఱిగి ఉండిన్నీ ఇట్లా అన్న నాతప్పు మన్నించు అని కృష్ణుడు అంటాడు.

ఈ ఉదంతం రుక్మిణి ఉపాదేయురాలు కావడం తెలియచేస్తూ ఉంది. ఈమె పుజ్యూరాలు. ఈ దినం ఆమె పూజకు ఉద్దిష్టమైంది.

## చైత్రశుద్ధ ద్వాదశి

స్మృతికౌస్తుభము దీనిని విష్ణుదమనోత్సవమనీ, నీలమతపురాణము దీనిని వాసుదేవార్చన మనీ అంటున్నాయి. మన పంచాంగకర్తలు మాత్రము ఈనాటి వివరణములో వామనద్వాదశి అని వ్రాస్తారు.

వామనుని అయినా, విష్ణువును అయినా, వాసుదేవుణ్ణి అయినా ఈ రోజున దమనంతో పూజ చేయాలి. దమన పూజముఖ్యము దేవుణ్ణి ఏ పేరుతో పేర్కొన్నా సరే అని ఊహింపవచ్చును. ఈనాడు భాతృప్రాప్తి వ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి. ద్వాదశి గొప్ప తిథులలో ఒకటి. ఈ తిథి గొప్ప తనాన్ని గురించి పద్మపురాణంలో కొంత ప్రస్తావన ఉంది. ఏకాదశి తిథి విషయములో ఆ పురాణం చెప్పిన విషయాలు తెలిసికొని ఉన్నాము. ఇప్పుడు ద్వాదశి తిథి విషయం పద్మ పురాణ కథనం తెలిసి కొందాము.

క్షీరసాగరమథనం ఏకాదశినాడు సాగింది. ఆనాడు దేవతలు ఉపవాసం ఉన్నారు. పాలసముద్రము మథింపగా మొదట కాలకూటం పుట్టింది. దానిని శివుడు మింగిలోకాన్ని రక్షించాడు. ఆమీద ఎర్ర బట్టలతో జ్యేష్ఠాదేవి పుట్టింది. అశుభాన్విత అగు ఆమెను కలిరాజునకు ఇచ్చారు. ఆమీద పాలసముద్రాన్ని మళ్లీ తఱచగా వారుణీదేవి పుట్టింది. ఆమెను శేషునకు ఇచ్చారు. తరువాత సౌపర్ణి జన్మించింది. ఆమె గరుడునికి భార్య అయింది. ఆ మీద అప్సరస్త్రీలు, గంధర్వులు, ఐరావతము, ఉచ్చైశ్శ్రవము, ధన్వంతరి, పారిజాతము, కామధేనువు క్రమంగా పుట్టాయి. వానిని ఇంద్రునకు ఇచ్చారు. ఇంతలో ఏకాదశి తిథి అయిపోయింది. ద్వాదశి తిథి ప్రారంభమైంది.

ద్వాదశినాటి ఉదయం దేవతలు తిరిగి పాలసముద్రమును మథింపగా మంగళకరురాలైన లక్ష్మీదేవి నాలుగు చేతులలో రెండు చేతులతో, బంగారు పద్మాలను, మిగతా రెండు చేతులతో ఒక సువర్ణపాత్రాన్ని, మాదీఫలాన్ని పట్టుకుని పుట్టువు నొందింది. ఆ పిమ్మట చంద్రుడు పుట్టాడు. లోకమాత అయిన లక్ష్మికి అతడు తోబుట్టువు అవడం చేత లోకమాతులుడనే ప్రసిద్ధిని పొందాడు. తరువాత లోకపావని అయిన తులసి జన్మించి విష్ణుపదపూజార్హ అయింది. అప్పుడు దేవతల ప్రార్థన మీద విష్ణువు లక్ష్మిని చేకొనెను. లక్ష్మీనారాయణులకు ఆసమయమున అమృతసంభవ అగు తులసి దళాలతో పూజలు చేసి అమృతమయములైన నైవేద్యాలు ఆరగింపుచేశారు.

ఆసందర్భంలో నారాయణుడు దేవతలతో ఇట్లా అన్నాడు. "ద్వాదశినాడు లక్ష్మి సహితుడనైన నన్ను తులసీదళాలతో విశేషంగా పూజించారు కాబట్టి ద్వాదశి తిథి నాకు మిక్కిలి ప్రియతమమైందిగా ఉంటుంది. ఇది మొదలు ఏజనులు ఏకాదశిని ఉపవాసం ఉండి ద్వాదశినాటి ప్రాతఃకాలాన శ్రద్ధాభక్తులతో లక్ష్మీసహితుడయిన నన్ను తులసిచే పూజిస్తారో వారు స్వర్గలోకాన్ని పొందుతారు. ద్వాదశి ధర్మార్థకామమోక్షాలను నాలుగింటిని ఇచ్చేది."

పద్మపురాణ వచనం ఇట్లా ఉంది. దీనిని హరివాసరమని గొప్పగా చెబుతారు.

## చైత్రశుద్ధ త్రయోదశి

సత్యవ్రత తీర్థానం పుణ్యదినం. మాధ్వ పుణ్యతీర్థదినం. దీనిని అనంగ త్రయోదశి అంటారు. మదన త్రయోదశి అనిన్నీ అంటారు. అనంగుడన్నా, మదనుడన్నా మన్మథుడు అని అర్థం. కాగా ఇది మన్మథునికి సంబంధించిన పర్వం. మన్మథుడు బ్రహ్మచేత, శివునిచేత అనంగుడుగా చేయబడినట్లు పురాణాలు రెండు కథలు చెబుతున్నాయి. మన్మథుడు సౌందర్యరాశి. మన్మథుని వాహనం చిలుక. అరవిందాది పుష్పములు అతని బాణములు. అతడు ప్రేమాధిదేవత. సృష్ట్యాదిని బ్రహ్మహృదయం నుండి మన్మథుడు అతని వామభాగం నుండి రతీదేవి పుట్టారు.

మన్మథుడు తన బాణాలను మొదట బ్రహ్మమీదనే ప్రయోగించాడు. అందుతో బ్రహ్మ వికారచిత్తుడై తాను సృష్టించుటచే తన కూతురైన

సరస్వతిని ప్రేమింప దొడగెను. బ్రహ్మతన తప్పుతాను తెలిసికొనెను. తాను జన్మాంతరం పొంది సరస్వతిని చేపట్టెను. తన్నిట్లు చేసిన మన్మధుడు భస్మమై శరీరము లేనివాడుగా అయ్యేటట్లు బ్రహ్మ శపించాడు.

మన్మథుడు విష్ణుమూర్తి కుమారుడు. తన దేహస్వేదము వలన పుట్టిన రతీదేవిని దక్షుడు అతనికి భార్యగా ఇచ్చాడు.

శివుడు వివాహము మాని తపసు చేసుకుంటూ ఉండెను. శివుడికి పుట్టిన కుమారుడు కాని తారకాసురుని సంహారింపలేడని తేలింది. శివుడు పార్వతిని చేకొనేటట్లు చేయడానికి మన్మథుడు ఇంద్రుని సంప్రార్థనమున పూనుకున్నాడు. శివుని మీద పూల బాణాలు వేశాడు. శివుని మనస్సు చలించింది. తన మనస్సు ఇట్లా చలింప చేసిన దురాత్ముడు ఎవ్వడా అని శివుడు తన మూడవ కన్ను తెరిచి చూచాడు. మన్మథుడు భస్మమై అనంగుడయ్యాడు.

రతీదేవి విలపించింది. మన్మథుడు ఆమెకు మాత్రం కనిపించేటట్లు వరం ఇచ్చేరు. రతీ మన్మథులు అన్యోన్యానురాగం బాగా ఉన్న దంపతులు. అందుచేత ఈ రోజున మదనుని పూజిస్తే దంపతులకు అన్యోన్యానురాగం పెంపొందుతుంది.

దీనిని మన పంచాంగాలలో అనంగత్రయోదశి అంటారు. మదన త్రయోదశి, కామదేవ త్రయోదశి, అని నామాంతరాలు. ఈ పర్వానికి చతుర్వర్గ చింతామణి మదనపూజ, మదన మహోత్సవము అనే నామాలు వాడింది. తిథితత్వము దమనాత్మక మదనపూజ అంటూ ఉంది. దీని వల్ల దమనముతో ఈనాడు మన్మథుని పూజించాలని తేలుతూ ఉంది.

ఈనాటి వివరణలో పంచాంగ కర్తలు దమనేనశివపూజ అని వ్రాస్తారు. అనగా ఈ దినమున దమనములచేత శివుణ్ణి పూజించాలి అని. ఈనాటి శివపూజ మిక్కిలి ఫలప్రదమైనది. ఈ ఒక్కనాటి పూజ వలన సంవత్సరం పూజించిన ఫలం కలుగుతుంది. ఈనాడు దమనముతో ఈశ్వరపూజ చేయాలని స్మృతి కౌస్తుభము.

## చైత్ర శుద్ధ చతుర్దశి

1) శైవ చతుర్దశి
2) కర్దమ క్రీడ.
3) రౌచ్యమన్వాది.

రౌచ్యుడు రుచి కుమారుడు. రుచిభార్య మాలిని. రుచికి పితృదేవతలు అతని కొడుకు మనువు కాగలడని చెప్పారు. అట్లే రౌచ్యుడు మనువు అయ్యాడు. రౌచ్యుని మన్వంతరంలో బృహస్పతి అనువాడు ఇంద్రుడు అయ్యాడు. అతని కుమారులైన చిత్రసేనుడు, దృఢుడు, సురథుడు మొదలైన వారు రాజులు అయి పాలించారు.

మనపంచాంగాలలో ఇది శైవచతుర్దశిగా పేర్కొనబడింది. శివునికి ఈనాడు దమనముతో పూజచేయాలని (శివేదమనకా రోప:) ఈనాడు శివసన్నిధి గల తీర్థాలలో స్నానం చేయాలి అనీ పురుషార్థ చింతామణి. తిథితత్వంలో ఇది మదన చతుర్దశి, మదన పూజోత్సవ నామాలతో పేర్కొనబడింది. గదాధరపద్ధతిలో దీని నామం దమనక చతుర్దశి అని కలదు.

ఈనాడు నృసింహ డోలోత్సవం చేస్తారని స్మృతి కౌస్తుభము. మహోత్సవ వ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి చెబుతున్నాయి.

## చైత్ర పూర్ణిమ

పున్నమ, పూర్ణిమ అను సంస్కృతశబ్దమునకు ఇది తద్భవము. పూర్ణిమనే సంస్కృతంలో పౌర్ణమాసీ అనిన్నీ అంటారు.

### పున్నములు రెండు రకాలు.

ఒకకళ చేత తక్కువైనవాడుగా చంద్రుడు ఉండే పున్నమ ఒకటి. ఈ పున్నమ అనుమతి అనబడుతూ ఉంది. పదారుకళలతో కూడిన వాడుగా చంద్రుడు ఉండే పున్నమ మరి ఒకటి. ఈపున్నమ రాకా పూర్ణిమ అనబడుతూ వుంది.

సూర్యేందు సంగమకాలము అమావాస్య. అమావాస్య నుండి పూర్ణిమకు పదహారు రోజులు. అమావాస్య నుండి పున్నమకును, పున్నమనుండి అమావాస్యకును గల కాలాన్ని పర్వసంధి కాలమంటారు.

అమావాస్య నుండి పూర్ణిమాస్యవరకు గల పదహారుదినాలలో ఒక్కొక్క దినానికి చంద్రుడికి ఒక్కొక్కకళ హెచ్చుతూ ఉంటుంది. పూర్ణిమాస్య నుండి అమావాస్య వరకు గల పదహారు దినాలలో ఒక్కొక్కదినానికి చంద్రునికి ఒక్కొక్క కళ తగ్గుతూ ఉంటుంది.

పదహారు కళలతో ఒప్పుతూ పూర్ణిమనాడు చంద్రుడు కాంతి నిస్తంద్రుడై ఉంటాడు. ఇట్లా చంద్రుడు కాంతి నిస్తంద్రుడై ప్రకాశించేదినాలు

ఏడాదికి పన్నెండు ఉంటాయి. అనగా ఏడాదికి పన్నెండు పున్నమలన్నమాట. ఈ పన్నెండు పున్నములలోనూ ఒక్కొక్క నక్షత్రంతో కూడి ఉంటాడు. ఆ నక్షత్రాన్ని పట్టి ఆపున్నమకు ఆ పేరు వస్తుంది.

పుష్య నక్షత్రముతో కూడిన పున్నమకు పౌషీ అనిపేరు. ఏమాసమున పౌషీ పూర్ణిమాస్యం వచ్చునో ఆమాసము పౌషమనబడును.

**పౌషీ : పౌషమాస పూర్ణిమ. పుష్యమాసము యొక్క పున్నమ.**
**పుష్యనక్షత్రయుక్త పౌర్ణమాసీ.**

| | |
|---|---|
| **మాఘీ** | **: మాఘ పూర్ణిమ** |
| **ఫాల్గునీ** | **: ఫాల్గున పూర్ణిమ** |
| **చైత్రీ** | **: చైత్ర పూర్ణిమ** |
| **వైశాఖీ** | **: వైశాఖ పూర్ణిమ** |
| **జ్యేష్ఠీ** | **: జ్యేష్ఠ పూర్ణిమ** |
| **ఆషాఢీ** | **: ఆషాఢ పూర్ణిమ** |
| **శ్రావణీ** | **: శ్రావణ పూర్ణిమ** |
| **భాద్రపదీ** | **: భాద్రపద పూర్ణిమ** |
| **ఆశ్వయుజీ** | **: ఆశ్వయుజ పూర్ణిమ** |
| **కార్తికీ** | **: కార్తిక పూర్ణిమ** |
| **మార్గశీర్షి** | **: మార్గశీర్ష పూర్ణిమ** |

ఏడాదిలోని పన్నెండు పున్నములు పన్నెండు పర్వాలుగా ఉంటున్నవి. హిందువుల పండుగలు పరికిస్తేమేని కృష్ణ పక్షములోకంటే శుక్ల పక్షములో పండుగలు ఎక్కువగా ఉండడం తెలిసివస్తుంది. భోగ్యార్హమైన శుక్లపక్షపు వెన్నెల ఊరికే పోకుండా మన పెద్దలు ఇట్టి ఏర్పాటు చేసి ఉంటారు. మరిన్ని ఆయా పున్నముల నాటి వెన్నెల ఊరికే పోకుండా అది పూర్తిగా అనుభవనీయం కావడానికి ప్రతిపున్నమికిన్నీ మన పెద్దలు ఒక్కొక్క పండుగను ఏర్పరచి ఉంటారు.

దశావతారాల్లోనూ ఒకటైన కూర్మావతారపు జయంతి ఒక పున్నమనాడు. మహాభక్తుడైన హనుమంతుని జయంతి ఒక పున్నమనాడు. మానవ ప్రపంచ ఆ ప్రసవించిన మహానీయులలో సాటిమేటి లేని గౌతమ బుద్ధుని జీవితంలో ఒక పున్నమ మూడు ముఖ్యఘట్టాల్లో ప్రముఖ స్థానాన్ని వహిస్తూ ఉంది.

బ్రాహ్మణులకు ఒక పున్నమ అత్యంత గణనీయమైంది. యతులకు ఒక పున్నమ వరణీయమైంది. రాగల వసంత కాలానికి స్వాగతో పచారాలు చేయడానికి ఒక పున్నమ ప్రత్యేకింప బడినది.

### పన్నెండు పున్నముల కథలు

ఒక ఏడాదిలోని పన్నెండు పున్నములు పన్నెండు పర్వాలుగా ఉంటున్నవి.

| | |
|---|---|
| చైత్ర పూర్ణిమ | -హనుమజయంతి. |
| వైశాఖ పూర్ణిమ | -కూర్మజయంతి, |
| | -బుద్ధజయంతి |
| జ్యేష్ఠ పూర్ణిమ | -ఏరువాక పున్నమి. |
| ఆషాఢ పూర్ణిమ | -వ్యాస పూర్ణిమ |
| శ్రావణ పూర్ణిమ | -రక్షా పూర్ణిమ |
| భాద్రపద పూర్ణిమ | -ఉపాకర్మ పూర్ణిమ |
| ఆశ్వీయుజ పూర్ణిమ | -కోజాగరీ పూర్ణిమ |
| కార్తిక పూర్ణిమ | -త్రిపురి పూర్ణిమ |
| మార్గశిర పూర్ణిమ | -కోరల పున్నమ |
| పుష్య పూర్ణిమ | -ఉత్సర్జనోత్సవ పూర్ణిమ |
| మాఘ పూర్ణిమ | -మహామాఘీ |
| ఫాల్గుణ పూర్ణిమ | -కాముని పున్నమ. |

ఇందులో ఒక్కొక్క పున్నమి పండుగ హిందూ దేశంలోని ఒక్కొక్క ప్రాంతంలో ఎక్కువ వాడుకలో ఉంటున్నాయి.

### 'చైత్ర పూర్ణిమ'

ఇరవైయేడు నక్షత్రాలలోను చిత్ర ఒకటి. అది ముత్యం లాగున ఒక్కటే నక్షత్రం. మంచి ప్రకాశంగా ఉంటుంది. అట్టి చిత్రా నక్షత్రంతో కూడిన పున్నమకు 'చైత్రీ' అని పేరు. ఈనాడు మధురకవి ఆళ్వారు తిరు నక్షత్రం. ఏమాసంలో చైత్ర పూర్ణిమాస్య వచ్చునో ఆమాసం చైత్రమాసమని పిలవబడుతుంది.

### మహాచైత్రి

చైత్రమాసంలో సూర్యుని ప్రకాశం ప్రబలం కావడానికి ప్రారంభమవుతుంది. ప్రబలమైన సూర్యప్రకాశాన్ని అందుకుని చంద్రుడు

ఆ నెలలో చక్కని వెన్నెల కాస్తాడు. ఆ వెన్నెల పౌర్ణమినాడు మరీ ఆప్యాయంగా ఉంటుంది.

మంచి ఎండ, మంచివెన్నెల గల ఈ పౌర్ణమి మానవునికి సుఖాన్ని కలిగించే రోజులలో ఒకటిగా ఉంది. కావుననే దీనిని మన పంచాంగకర్తలు 'మహాచైత్రి' అనే పెద్ద పేరుతో పేర్కొంటారు.

ఈ మహాచైత్రి హిందూ దేశంలోని వివిధ ప్రాంతాల్లో ఒక్కొక్కరీతి పర్వమై ఉంటూ ఉంది. చైత్ర పూర్ణిమ గురువారంతోకాని, శనివారంతోకాని, ఆదివారంతోకాని కలసి వస్తే అది మరీ పుణ్యప్రదమై ఉంటుందని పెద్దలు అంటారు.

చిత్రా పూర్ణిమదినం దక్షసావర్ణి మన్వంతరాది దినం కూడా - దక్షసావర్ణి తొమ్మిదోమనువు. అతడు దక్షప్రజాపతి పుత్రుడు. ఈ మన్వంతరానకుమారస్వామి అద్భుతుండనే పేరుతో ఇంద్రుడు అవుతాడు. మేథాతిథి, వసుపుమున్నగువారు సప్తర్షులు.

ఈనాడు చిత్ర వస్త్ర దానం, దమన పూజవిహితకృత్యాలుగా ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి. చిత్ర వస్త్రదానమనగా రంగురంగుల బట్టలను దానం చేయడం. ఈ పర్వ సందర్భంలో ఇంద్రాది సమస్త దేవతలకు దమన పూజ చేయడం మహాఫలము.

## చిత్ర గుప్త వ్రతం

చిత్రా పూర్ణిమ దినమున చిత్ర గుప్త వ్రతం చేసిన వారికి యమదండన లేదని శాస్త్ర ప్రమాణం. అయితే ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాల్లో చిత్రగుప్తుడినోము ఎప్పుడు పడితే అప్పుడు చేయడం పరిపాటిగా ఉంది. తమిళదేశాన మాత్రం చిత్రా పూర్ణిమదినమే చిత్రగుప్తుడి పూజకు ఉద్దిష్టమై ఉంది.

## చిత్రుడు

చిత్రగుప్తుడు యమధర్మరాజు వద్ద ముఖ్యమైన వ్రాయస కాడు. మానవుడు తన జీవిత కాలంలో చేసిన తప్పులు చిత్రగుప్తుడు చిఠాకు ఎక్కిస్తాడు. ఆ చిఠ్ఠాలోని వ్రాత ప్రకారం యముడు ఆ మానవుని మరణానంతరం అతనిని శిక్షిస్తూ, రక్షిస్తూ ఉంటాడు.

యముని ప్రముఖలేఖకుడగు చిత్రగుప్తుని ఉద్యోగపు భావన చమత్కారమైనది.

## చిత్రాదిత్యుడు

చిత్రగుప్తుడు ఆదిలో 'చిత్రుడు' అను పేరు గల సూర్యవంశపు రాజు. అతడు సూర్యుని గురించి చిరకాలంతపస్సు చేశాడు. సూర్యుడు ప్రసన్నుడై ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు చిత్రుడు సూర్యునికి నమస్కరించి తనకు సర్వజ్ఞత్వము, సర్వకార్య ప్రౌఢత్వము ప్రసాదించమని ప్రార్థించాడు. సూర్యుడు అతని కోరిక చెల్లించాడు. ఆదిత్యుని చేత వరప్రసాదితుడు కావడం చేత చిత్రుడికి అప్పటి నుంచి చిత్రాదిత్యుడు అనే పేరు వచ్చింది.

## చిత్రగుప్తుడు

చిత్రుడు చిత్రాదిత్యుడైన పిమ్మట లవణ సముద్రంలో స్నానానికి వెళ్లాడు. చిత్రుని వంటి సర్వజ్ఞుడు, సర్వకార్యప్రౌఢుడు తనకు లేఖకుడుగా ఉంటే పని ఉసులు బాటుకు బాగుంటుందని యముడు తలచాడు. కాగా అప్పుడు యముడు తన భటులను పంపి సముద్ర స్నానం చేస్తూ ఉన్న చిత్రాదిత్యుణ్ణి సశరీరంగా తన వద్దకు రప్పించుకొన్నాడు. ప్రపంచంలోని వివిధ ప్రాణులు చేస్తూ ఉండే కార్యాకార్యాలను ఒక పుస్తకంలో వ్రాసి గుప్తంగా జాగ్రత్త చేస్తూ ఉండవలసినదిగా చిత్రాదిత్యునికి యముడు ఆజ్ఞాపించాడు. ఆ ఉద్యోగంలో కుదిరాక చిత్రాదిత్యుడికి చిత్రగుప్తుడు అనే పేరు వచ్చింది.

## వింత ఉద్యోగము

చిత్రగుప్తుని ఈ ఉద్యోగ ధర్మాన్ని గుఱించి శ్రీ జగదీశ్వర అయ్యరు ఇట్లు వ్యాఖ్యానిస్తున్నాడు.

రికార్డులకు ఎక్కించి మానవుని కంఠస్వరాన్ని అతడు మరణించిన తరువాత కూడ మనము వినకలిగేటట్లునేటి గ్రామఫోనులు చేస్తున్నాయి. ఈదృష్టితో పరికిస్తే సాధనాంతరం ఉంటే మానవుడి భావాలు, చేతలు కూడా రికార్డు చేయవచ్చునని నిర్ణయించవచ్చు. నిజానికి ప్రకృతిలో ప్రతివ్యక్తి యొక్క మానసిక భావాలు, శారీరక కర్మలు ఒకానొక కేంద్ర స్థానంలో గ్రథితమయ్యే ఏర్పాటు ఏదో ఒకటి ఉండాలి. జీవాత్మలన్నీ పరమాత్మ నుంచి బయలు దేరి వచ్చినవే కదా! ప్రతి జీవుని జననమరణ సమయాల్లో అతని చిట్టాలో పాప పుణ్యాలు అవర్జా అవుతూ ఉంటాయి. ఈ ధర్మాన్ని నెరవేర్చే అతనే యమధర్మరాజు. అతని ముఖ్య లేఖకుడు చిత్రగుప్తుడు.

## కంచిలోగుడి

కంచిలో చిత్రగుప్తుడికి ఒక దేవాలయం ఉంది. అచటి మూలవిగ్రహానికి ఒక చేతిలో భూర్జ పత్రాల పుస్తకం, మరిఒక చేతిలో గంటం ఉన్నాయి. ఇది రాతితో మలచ బడింది. లోహంతో చేయబడ్డ ఉత్సవ విగ్రహానికి కూడా ఒకచేతిలో భూర్జపత్రాల పుస్తకం, మరిఒక చేతిలో గంటం ఉన్నాయి.

యముని ప్రధానలేఖకుడు కాబట్టి ఈ పరికరాలు అతనికి సముచితమై ఉన్నాయి.

చిత్రాపూర్ణిమకు తమిళ దేశాన ఒక దేవతామూర్తి ఇట్లు ప్రత్యేక పూజలు అందడమేకాక అచటి ఒక సుప్రసిద్ధ దేవాలయంలో గొప్ప తిరునాళ్లు కూడా సాగుతాయి.

## మధుర-చిత్రపూర్ణిమ

తమిళదేశాన ప్రసిద్ధయాత్రా స్థలాల్లో ఒకటైన మధురలో చిత్రా పూర్ణిమ ఉత్సవం నితాంత వైభవంతో జరుగుతుంది. దీనికి సంబంధించిన పురాణగాధ వినతగి ఉంటుంది.

బృహస్పతి దేవతల పురోహితుడు, దేవతలరాజు ఇంద్రుడు ఒకప్పుడు బృహస్పతిని అర్హరీతిని సమ్మానించాడు కాడు. అందుమీద బృహస్పతికి కోపం వచ్చి వెళ్లిపోయాడు. తగిన పురోహితుడు లేక పోవడం చేత ఇంద్రుడు మంచి చెడ్డలు ఏర్పరచలేక అనేక పాపకార్యాలు చేశాడు. ఇంద్రుడు ఇట్లా పాపకార్యాలు చేస్తూ ఉండడం చూస్తే బృహస్పతికి జాలికలిగింది. శిష్యుని పట్ల వాత్సల్యం కలిగి అతడు తిరిగి వచ్చాడు. శిష్యుని క్షమించాడు. పాపాలు అన్నీ పోగొట్టుకోడానికి భూలోకంలో తీర్థయాత్రలు చేయవలసిందిగా ఆదేశించాడు. పలుప్రదేశాలు తిరిగి ఇంద్రుడు ఒక అడవిలోకి వచ్చాడు. ఆ ప్రదేశం అతి ప్రశాంతంగా ఉంది. అక్కడకు రావడంతోటే ఇంద్రుడికి తన పాపాలు అన్నీ పోయి తాను పవిత్రుణ్ణి అయ్యాననే భావం కలిగింది. తనకు ఇట్టి భావం కలగడానికి కారణం ఏమిటని అతడు తన పరిసరాన్నంతటిని బాగా పరికించాడు. సమీపంలో ఉన్న ఒక చెరువు గట్టున ఒక లింగం ఉండడం అతడు కనుగొన్నాడు. తనకు గల హృదయభారం తగ్గి పాపాలన్నీ పోయాయి. అనే భావన కలగడానికి ఆలింగం యొక్క ప్రభావమే అని అతడు

గుర్తించాడు. తోడనే అతడు దేవశిల్పి అయిన విశ్వకర్మకు కబురుచేసి అక్కడ ఈశ్వరుడికి కూడా ఒక ఆలయాన్ని నిర్మింపచేశాడు.

ఈశ్వరుణ్ణి, ఈశ్వరిని పూజించాలని అప్పుడు ఇం(ద్రుడు అనుకున్నాడు. కాని దగ్గరలో ఎక్కడా పువ్వులు లేకపోయాయి. పువ్వులు ప్రసాదించవలసిందిగా ఈశ్వరుని, ఈశ్వరిని అతడు ప్రార్థించాడు. తోడనే ఆ చెఱువులో బంగారు తామరపూవులు అసంఖ్యాకంగా పుట్టుకువచ్చాయి. ఆ పూవులు అందుకుని అతడు దేవపూజ చేశాడు. ఆనాడు చైత్రపూర్ణిమ. ఆదేవాలయమే మధురదేవాలయము.

మధుర దేవాలయములో ప్రథమపూజ ఒకానొక చైత్రపూర్ణిమనాడు జరిగింది. అందుచేత ఏటేట ఆనాడు అక్కడ పెద్ద ఉత్సవం జరుగుతుంది. ప్రతిచైత్ర పూర్ణిమ రాత్రికి ఇప్పటికి కూడ ఇంద్రుడు అక్కడికి వచ్చి పూజ చేస్తాడని అచటి ప్రజలనమ్మిక.

## చిత్రానది

తమిళదేశంలో తిరునల్వేళి జిల్లాలో చిత్ర అనే ఒకనది ఉంది. అది తామ్రపర్ణికి ఉపనది. చిత్రానది కుత్తాళం కొండలలో పుట్టి కుత్తాలం అనే ఊరిలోని దేవాలయానికి సమీపంగా జలపాతముగా పడుతూ ఉంది. ఈ చిత్రానది ప్రాదుర్భావం చైత్రపూర్ణిమనాడు అని చెబుతారు. అందుచేత చైత్రపూర్ణిమనాడు చిత్రానదిలో స్నానం చేయడం వల్ల అనేకమైన పాపాలు పోతాయని అచటివారు నమ్ముతారు. ఈనది నీళ్ళు మిక్కిలి ఆరోగ్యకరము లని ఇటీవల శాస్త్రీయ పరిశోధనల వల్ల తేలింది. దాన, దీన కుత్తాలం గొప్పయాత్రాస్థలమైంది.

## హనుమజ్జయంతి

తమిళనాడులో చైత్రపూర్ణిమ ఈ విధమైన పర్వమై ఉండగా ఆంధ్ర, మహారాష్ట్రాల్లో ఇది హనుమ జ్జయంతిగా ఉంటూ ఉంది.

ఆంధ్రులలో మధ్వ మతస్థులకు ఇది మరీ ముఖ్యమైన పండుగగా కనిపిస్తూ ఉంది.

హనుమంతుడు అంజనాదేవి పుత్రుడు. అంజన కేసరి అను వానరుని భార్య. సంసారంలో విసుగుపుట్టి కేసరి తపస్సు చేసుకోవడానికి వెళ్లాడు. తపస్సుకు వెళుతూ అతడు తన భార్యను వాయుదేవునికి అప్పగించాడు. ఆమె శ్రద్ధా భక్తులకు మెచ్చి వాయువు తన గర్భ మందున్న

శివుని వీర్యాన్ని ఆమెకు ఇచ్చాడు. అందుతో ఆమె గర్భం ధరించి కుమారుని ప్రసవించింది. అతడే ఆంజనేయుడు. వాయుప్రసాదికావడం చేత అతనికి వాయుపుత్రుడు అని పేరు వచ్చింది.

## ఆంజనేయుని బాల్యం

పుట్టిన వెంటనే ఆ బాలుడు ఆకలికి తాళలేక ఉదయించుచున్న సూర్యుణ్ణి పండు అనుకొని పట్టి మ్రింగబోయాడు. ఆ సమయంలోనే అక్కడికి రాహువు కూడా వచ్చి ఉండెను. రాహువు ఆంజనేయుని బెదిరించాడు. అందుమీద ఆ వానరబాలుడు రాహువునే మ్రింగపోయాడు. రాహువు భయపడి ఇంద్రునితో చెప్పుకున్నాడు. ఇంద్రుడు ఐరావతము నెక్కివచ్చాడు. ఆంజనేయుడు ఐరావతము మీదకు ఉరికాడు. అప్పుడు ఇంద్రుడు ఆ బాలుని వజ్రాయుధంతో కొట్టాడు. హనువులకు దెబ్బతగిలి అతడు మూర్ఛపోయాడు. హనువులు కొట్టబడడంచేత ఆంజనేయునికి హనుమంతుడనే పేరున్నూ వచ్చింది. తనపుత్రుని పాటు చూచి వాయువు ఇంద్రునిమీద కోపగించి లోకసంచారం మానుకున్నాడు. వాయుసంచారం లేక లోకం తల్లడిల్లింది. ఆ విషయం దేవతలు బ్రహ్మతో చెప్పుకున్నారు. అప్పుడు బ్రహ్మ ఇతర దేవతలతో కూడి వచ్చి వాయువును స్తుతించి ఆంజనేయునికి చిరంజీవత్వం మున్నగు అనేక వరాలు ఇచ్చారు.

హనుమంతుని పుట్టుకనుగురించి మనదేశపు గాథయిది. మహారాష్ట్ర దేశంలో వాడుకలో ఉన్న కథ మనకు కొంత వింతగా ఉంటుంది.

## వింతకథ

దశరథుడు పుత్రకామేష్టి యజ్ఞాన్ని చేశాడు. ఆ సందర్భంలో యజ్ఞ కుండంలో నుంచి యజ్ఞనారాయణ పొడసూపి ఋష్యశృంగుడికి బియ్యము, పాలు, పంచదారతో చేయబడిన పాయసాన్ని ప్రసాదంగా ఇచ్చి మూడు ముద్దలుగా చేసి దశరథుడు ముగ్గురు భార్యలకు పంచి ఈయమన్నాడు.

అప్పుడు దశరథుని పురోహితుడు ఈప్రసాదాన్ని మూడు ముద్దలు చేసి క్రమంగా కౌసల్య, సుమిత్ర, కైకేయిలకు ఇచ్చాడు. తాను దశరథునకు ముద్దుల భార్యఐనప్పటికీ తనకు వసిష్ఠుడు ముందు ప్రసాదాన్ని ఈయనందుకు కైకేయి కోపగించి మూతిముడుచు కొని ముద్దను చేతులో పెట్టుకుని అలోచిస్తూ పరధ్యానంగా నిలబడింది.

అప్పుడు గద్ద ఒకటి వచ్చి వాలి ఆమె చేతిలో ఉన్న ప్రసాదపు ముద్దను తన్నుకు పోయింది. అందుతో కైకేయి నేల మీద పడి ఏడవడానికి ఆరంభించింది. రాజు ఈ సంగతి తెలుసుకున్నాడు. కాని ఏమి చేయడానికి అతనికి పాలు పోలేదు.

అప్పుడు కౌసల్య, సుమిత్ర తమ ముద్దలలో చెరి ఒక సగమూ కైకేయికి ఇచ్చారు.

కేసరి అని వానర ప్రభువు. అతని భార్య అంజన. ఆమె చిరకాలంగా ఋష్యమూక పర్వతం మీద తపస్సుచేస్తూ బలశాలివైన పుత్రుణ్ణి ప్రసాదింపమని శంకరుని ప్రార్థిస్తూ ఉంది.

తుదకు శంకరుడు ప్రత్యక్షమైన ద్వాదశరుద్రులలోనూ పదకొండో వాడైన మహారుద్రుని అంశతో ఒక కుమారుడు పుడతాడనీ - కళ్లు మూసుకుని అంజలిబద్ధయై ప్రార్థిస్తూ ఉండవలసిందనీ - ఆమె దోసిలిలో ప్రసాదం పడుతుందనీ - దానిని తినవలసిందనీ ఉపదేశించాడు.

ఆమె అట్లే చేసింది. కైకేయి చేతులనుండి తన్నుకు వచ్చిన ప్రసాదాన్ని గద్ద దైవవశాన్ని అంజనాదేవి అంజలిలో పడవేసింది. ఫలితంగా యుక్త కాలంలో హనుమంతుడు పుట్టాడు.

గద్ద నోటినుండి ప్రసాదం వాయువు తోడ్పాటు వల్లనే అంజనాదేవి అంజలిలో పడింది కాబట్టి ఆ ప్రసాద ప్రభావం వల్ల పుట్టిన ఆంజనేయునికి వాయు నందనుడు అనే పేరు కూడా వచ్చింది.

ఈ గద్ద పూర్వజన్మంలో సువర్చల అనే పేరు గల అప్సరస. బ్రహ్మశాపాన్ని పొంది ఆమె గద్ద అయింది. అంజనాదేవి అంజలిలో నిస్వార్థబుద్ధితో ప్రసాదాన్ని ఉంచడంతో గద్ద రూపంలో ఉన్న ఆమెకు శాపమోక్షం అయింది.

## ఆదర్శ పురుషుడు

పుట్టుక ఎట్టిదైనా హనుమంతుడు ఆదర్శపురుషుల్లో ఒకడు. అతడు ఆరాధనీయుడు. రామాయణంలో అతని అద్భుత పాత్ర అందరూ ఎఱిగిందే. రామాయణంలోని ఆరుకాండల్లోనూ చివరి మూడు కాండల్లోని కథ అంతా హనుమంతుడి మీదుగానే నడిచిందంటే అతిశయోక్తి ఏమీన్నీ కాదు. అతడు బాల్యంలో తీవ్రాంశుని వేడికోర్చి అతని వద్ద వేలాది విద్యలు

నేర్చిన ఆదర్శ విద్యార్థి. సంస్కృతాద్యనేక భాషలు, వ్యాకరణాద్యనేక శాస్త్రాలు, సంగీతాద్యనేక కళలు అభ్యసించిన ప్రోడ. ఒక కల్పం (అనగా నాలుగు వందల ముప్పయిరెండు మిలియనుల సంవత్సరాలు) జీవించే ఎనమండుగురు చిరంజీవుల్లోనూ అతడు ఒకడు. నారదుడు, భీష్ముడు మున్నగువారి వలె బ్రహ్మచర్యవ్రతానికి అతడు పేరుపడ్డాడు.

అట్టి మహనీయుని జయంతిదినం చైత్రపూర్ణిమ.

## వివాద గ్రస్తము

ధర్మసింధు, నిర్ణయసింధు మున్నగు గ్రంధాలలో హనుమజ్జయంతిని గురించిన విశేషాలు అంతగా లేవు. ఈ జయంతి ఏరోజున చేయాలి అన్నది కొంత వివాద గ్రస్తమై ఉన్నది.

కార్తిక కృష్ణ చతుర్దశి స్వాతి నక్షత్రం భౌమవారం మేషలగ్నంలో హనుమంతుడు పుట్టినట్లు కలదు. మేషలగ్నం కార్తిక మాసంలో రాత్రి వస్తుంది. కాబట్టి హనుమంతుడు రాత్రి పుట్టాడని అనుకోవాలి. మరునాడు అమావాస్యనాడు సూర్యగ్రహణం. హనుమంతుడు ఫలభ్రాంతితో సూర్యుణ్ణి మింగబోయేసరికి రాహువు కూడా వచ్చి ఉన్నాడు. కాబట్టి ఈ పండుగ కార్తికమాసంలో చేయాలి. కాని పురాణాలు, పంచాంగాలు చైత్రపూర్ణిమనాడు ఈ వ్రతం చేయవలసిందిగా చెబుతున్నాయి.

## ఉత్తరాదిని

ఉత్తరహిందూస్థానంలో ఈ పండుగ ఆచరింపబడే తీరును వ్రతోత్సవ చంద్రిక ఇట్లా చెబుతూ ఉంది.

"చైత్రపూర్ణిమనాడు సూర్యోదయం కావడంతోటే హనుమద్దేవాలయానికి వెళతారు. లేదా ఇంట్లో హనుమంతుని విగ్రహం పెట్టుకొని పూజ చేస్తారు. వీరబ్రహ్మచారి, దాసబ్రహ్మచారి అనే రెండు రకాల హనుమంత విగ్రహాలు. క్రింద చండీ విగ్రహం గల హనుమంతుడు వీరబ్రహ్మచారి. ఈ హనుమంతుని ప్రసాదాన్ని స్త్రీలు పుచ్చుకోరు. దాసహనుమంతుని అంతాపూజిస్తారు. ఈ విధమైన దక్షిణదేశంలో ప్రతి ఊళ్లోను, అక్కడక్కడ అడవుల్లోనూ ఉంటాయి. బొంబాయి. ప్రాంతాల్లో హిందువులే కాకుండా పార్శీలు కూడా ఆంజనేయాలయంలో ఈనాడు సింధూరం, నూని యిస్తారు. ఆంజనేయులకు సింధూరం అర్పించే ఆచారంలోని అంతరార్థం ఏమో తెలియదు.

## మహారాష్ట్రుల నమ్మకాలు

'కొథారి' అనువారు మహారాష్ట్రులలో ఈ పండుగకు సంబంధించిన కొన్ని నమ్మకాలను ఇట్లా వివరిస్తున్నారు. "హరిదాసు రామస్తోత్రాన్ని పాడుతూ ఉంటే అక్కడ హనుమంతుడు మనుష్య రూపంతో అదృశ్యుడై ఉంటాడని మహారాష్ట్రుల నమ్మకం".

హనుమంతుని స్తుతించే హనుమత్కవచాన్ని ఆంజనేయుని ఆలయంలో లక్ష ఇరవై అయిదు వేలసారులు పఠించినవారికి గాలిలో ఎగిరేశక్తి, అణిమాద్యష్టసిద్ధులు లభ్యమౌతాయి అని చెబుతారు.

శని గ్రహపీడగల మహారాష్ట్రులు హనుమంతుని శరణు పొందుతారు. శని కులం చేత తెలకులవాడు. శనివారం అతనికి ప్రియమైంది. అందుచేత మహారాష్ట్రులు శనిపీడ తొలగడానికి మంచి నూనెను **Minimum or red lead and udid pulse (Phaseslous radiatus) rin** చెట్టు పువ్వులతో, ఆకులతో శనివారంనాడు హనుమంతునికి సమర్పిస్తారు.

ప్రేతపతి ఐన శంకరుడికి భూతాల మీద ఎట్టి ఆధిపత్యం ఉందో హనుమంతుడికి కూడా అట్టి ఆధిపత్యం ఉందని మహారాష్ట్రుల నమ్మిక. శివాజీ గురువైన సమర్థ రామదాసు హనుమంతుని భక్తుడుకాగా మహారాష్ట్రుల జెండామీద గదాపాణి అయిన హనుమంతుడు వెలిశాడు. అర్జునుడి జెండామీద ఉపవిష్టుడై హనుమంతుడు మహాభారతయుద్ధంలో అర్జునుడికి రక్షణయిచ్చి ఉండిన గాధ పలువురకు తెలిసిందే.

## ఆంధ్రులు - ఆంజనేయుడు.

హనుమంతుని గురించి పొరుగువారైన మహారాష్ట్రులకు గల పై నమ్మికలు ప్రాయకంగా ఆంధ్రులకు కూడా ఉన్నాయి.

గ్రహపీడలకు మనము ఆంజనేయుల్ని కొలుస్తాము. కొన్ని రకాల ఉన్మాదరోగాలకు ఆంజనేయ ప్రదక్షిణలు విధిస్తాము. చిన్నపిల్లలకు ఆంజనేయుని బొమ్మ చెక్కిన యంత్రపు బిళ్లమెడలో కట్టడం మనలో విశేష ప్రచారంగల ఆచారమయ్యే ఉంది. పిల్లలు, పెద్దలు కూడా భయసమయాల్లో, ఆపత్కాలాల్లో ఆంజనేయదండకం చదువు కోవడం ఆంధ్రదేశంలో చిరకాలంగా వస్తూ ఉన్న సంప్రదాయం.

మనశాస్త్రాల్లో భగవంతునికి తొమ్మిది విధాలైన పూజలు నిర్ణీతమై

ఉన్నాయి. శ్రవణం, కీర్తనం మొదలయినవి. ఈతొమ్మిది విధాలైన పూజలలోనూ ఏడోది దాస్యపూజ. ఈ విధమైన పూజకు హనుమంతుడు మంచి ఉదాహరణము.

భగవద్దాసులలో సాటిలేనివాడైన ఆంజనేయుని పూజకు ఉద్దిష్టమైన పర్వదినము చైత్రపూర్ణిమ.

ఈనాడు సర్వదేవతలను దమనము చేత పూజించాలని స్మృతి కౌస్తుభము చెబుతూ ఉంది. అందులో శివుడికి పూజవిశేషమైనది. ఈనాడు చేసిన స్నానదానాలు మామూలు రోజుల్లో చేసే స్నానదానాల కంటె పదిరెట్లు ఎక్కువ ఫలాన్ని ఇచ్చేవిగా ఉంటాయి.

కాశ్మీరదేశంలో ఈనాడు నికుంభపూజ చేస్తారు. నికుంభుడు ఒక రాక్షసుడనీ, అతడు చాలా ఉపద్రవం కలగచేశాడని, ఆపిశాచాన్ని శాంతింప చేయడం కోసం ఈ పూజ చేస్తారని చెబుతారు. కాశ్మీరదేశంలో ఈనాడు 'ఇరామంజరీ' పూజ కూడా చేస్తారు. ఇరామంజరి ఒక స్త్రీదేవత కావచ్చును. ఈనాడు పాశుపతవ్రతం చేస్తారని చతుర్వర్గచింతమణి.

చైత్రపూర్ణిమనాడు వరాహపురాణాన్ని దానమిస్తే విష్ణులోక ప్రాప్తి. ఈనాడు పశుపతవ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి.

## చైత్రబహుళ పాడ్యమి

## ప్రపాదాపం-ధర్మఘటాదిదానం.

ఈనాడు పాతాళవ్రతం ప్రారంభిస్తారని చతుర్వర్గ చింతామణి జ్ఞానావాప్తివ్రతం కూడా చేస్తారని తెలుస్తూ ఉంది.

## చైత్రబహుళపంచమి

## మత్స్య జయంతి

విష్ణుమూర్తి దశావతారాల్లోనూ మత్స్యావతారము మొదటిది. మత్స్య జయంతి దినం కొంత వివాదగ్రస్తమైఉంది.

ధర్మ సింధువులో 'చైత్రశుక్లప్రతిపన్మత్స్య జయంతీత్యేకే' అని ఉంది. దీనిని పట్టి మత్స్య జయంతి చైత్రశుద్ధ పాడ్యమినాడు చేయాలని కొందఱి అభిప్రాయమని సూచితమగుచున్నది. స్మృతి కౌస్తుభంలో కూడా ఈ తిథేమత్స్య జయంతిగా చెప్పబడింది.

చైత్రశుద్ధ తదియనాడు మత్స్య జయంతి దినమని

ఆమాదేర్‌జ్యోతిషీలో ఉంది. ఇదిన్నీ అనుమానాస్పదంగానే ఉన్నది.

చైత్ర బహుళ పంచమి మత్స్య జయంతి జరపాలని ఒకటి రెండు ప్రమాణగ్రంధాలు చెబుతూ ఉన్నాయి. మనపంచాంగాల్లో బహుళంగా ఈనాడే మత్స్య జయంతి అని వ్రాసి ఉంటుంది. మత్స్యావతారగాధ ముచ్చటైనది.

ఆకాలంలో సోమకుడు అనే రాక్షసుడు ఒకడు ఉండెను. వాడు బ్రహ్మ నిద్రపోతూ ఉన్న సమయంచూచి బ్రహ్మముఖమందు ఉండే నాలుగు వేదాలను ఎత్తుకొని పోయి సముద్రంలో దాగుకొన్నాడు. వేదాలతోడ్పాటులేక బ్రహ్మకు సృష్టికార్యం సవ్యంగా సాగలేదు. ఆ విషయం అతడు విష్ణుమూర్తితో చెప్పుకొన్నారు. అప్పుడు మత్స్యమూర్తిగా ఉన్న జనార్ధనుడు నీటిలో వెదకి సోమకుని చంపేడు. తన నాలుగు చేతులతో నాలుగు వేదాలు తెచ్చి బ్రహ్మకిచ్చాడు.

వైవస్వత మనువు పితృతర్పణం చేస్తూ ఉన్నాడు. అతని దోసిట్లో ఒక చిన్న చేప పడింది. కరుణించి అతడు దానిని తన కమండలువులో వేశాడు. అందులో అది ఒక పగలు, ఒక రాత్రి ఉండి పదహారు అంగుళాలు పెరిగింది. తను ఉండడానికి ఆ కమండలువు చాలకుండా ఉందని గోలపెట్టింది.

అప్పుడు మనువు దానిని ఎత్తి ఒక నీళ్ల కాలువలో ఉంచాడు. అందులో అది ఒక రాత్రి ఉంది. ఆరాత్రికి రాత్రి అది మూడు మూరల పొడవు పెరిగింది నాకీ చోటు చాలక చచ్చిపోతున్నాను. నన్ను రక్షించ వలసింది అని ఆ చేప మొర పెట్టుకుంది.

అప్పుడు మనువు దానిని ఒక నూతిలో వేశాడు. అది ఆనుయ్యి కూడా సరిపోనంత పెద్దగా పెరిగింది. అందుమీద మనువు దానిని ఒక చెఱువులో వదిలాడు. అది ఆ చెఱువు పట్టనంతటి పెద్ద చేపగా అయింది. అంతట అతడు దానిని ఒకనదిలో వదిలాడు. పెరుగుతూ వచ్చిన చేపకు ఆనదిసరిగా చాలింది కాదు. ఆ పిమ్మట మనువు దానిని సముద్రంలో ఉంచాడు. అది చేరడంతోటే సముద్రం అల్లకల్లోలమైంది. ఆ అల్లకల్లోలంలో ఆమీను మేను రెండు లక్షల యోజనాల ప్రమాణానికి పెరిగింది. అంత బ్రహ్మాండంగా పెరిగికూడా అది నన్ను రక్షించు, నన్ను రక్షించు, అని మొరపెట్టటం మానలేదు.

మనువుకి అందుమీద ఆశ్చర్యం వేసింది. ఓమత్స్యమా! లీలలు లోగడ చూచి ఉండనివిగా ఉన్నాయి. కనీసం విని అయినా ఉండనివి ఉన్నాయి. నీవునిజానికి వాసుదేవుడవో, కాకపోతే అసురుడవో అయి ఉండాలి. అని అన్నాడు.

అప్పుడు చేప 'ఓ వైవస్వతా! నీవు నన్ను గుర్తించావు. కాబట్టి నీకు ఒక సంగతి చెబుతున్నాను. ఇదిగో ఈనావనుచూడు. ప్రళయకాలము సమీపించింది. ఇప్పుడు చాక్షుషమన్వంతరము నడుస్తూ ఉంది. ఆ మన్వంతరము నూరెండ్లలో ముగుస్తుంది. ఆ ముగింపుకు ముందు అనావృష్టిదోషం కలుగుతుంది. ఆ కారణంగా కఱవు ఏర్పడుతుంది. ఆ పిమ్మట సంవర్తము, భీమనాదము, ద్రోణము, ఇంద్రము, వలాహకము, విద్యుత్పతాకము, శోణము అనే ఏడు మేఘాలు విజృంభించి అధిక వృష్టిని కలిగిస్తాయి. ఆ వానకు సప్తసముద్రాలు ఏకమై జలప్రళయం కలుగుతుంది. భూమి వనపర్వత సహితంగా జలార్ణవంలో మునిగి పోతుంది. కాబట్టి ముందుగానే వేదములు, విద్యలు, బీజములు, మున్నగునవి - నేను, బ్రహ్మ, దేవతలు మున్నగువారు నీచే రక్షితులు కావాలి. ఆజల ప్రళయంలో అనంతుడనే పాము నీటి మీద తేలుతూ ఉంటుంది. ఆ పామును తాడుగాచేసి ఈ నావను నా కొమ్ముకు కట్టివేయి. అప్పుడు ప్రళయమారుతం వీచి ఈ ఓడను కదిపి వేస్తుంది. ఆ అల్లకల్లోలానికి నీవు ఏమీ భమపడవద్దు. ఇట్లు చెప్పి ఆ చేప అంతర్థానమైంది.

ప్రళయకాలంలో మనువు ఆ చేప చెప్పినట్లే చేశాడు. మత్స్యమూర్తి అయి ఆనాడు ఇట్లు వేదాలు తెచ్చి వేథకు ఇచ్చి లోకాన్ని కాపాడినాడు. కావున ఆనాడు మత్స్యమూర్తి ప్రతిమను చేసి పూజించాలి.

క్రైస్తవులలో మత్స్యం శాంతి దేవతగా, మహమ్మదీయులలో చేప భగవానుడుగా పేర్కొనబడడం గమనింపవలసిన విషయం. బౌద్ధజాతక కథలలో బుద్ధుడు చేపగా పుడతాడు.

## చైత్రబహుళ ఏకాదశి

ఆమాదేర్ జ్యోతిషీ లో చైత్ర బహుళ ఏకాదశి వరూథిన్యేకాదశిగా చెప్పబడింది. దీనినే మన పంచాంగకర్తలు వరూథిని వ్రతమని అంటారు. ఈ ఏకాదశినాడు ఉపవాసాదులు ఉండి వ్రతము చేసిన వారికి వేయిగోదానములు చేసిన ఫలము కలుగుతుందని చెప్పబడుతూ ఉంది. చైత్రకృష్ణ ఏకాదశి శ్రీ వల్లభాచార్య జన్మదినము.

# చైత్రబహుళ త్రయోదశి

## వరాహజయన్తీ

వరాహావతారము విష్ణుమూర్తి పది అవతారాల్లో మూడోది. ఈ అవతారము శ్రీరామావతారం జరిగిన చైత్రశుద్ధ నవమినాడే అని కొందరు అన్నారు. కాని వివాదగ్రస్త విషయంగా ఉంది. వరాహావతారం చైత్రబహుళ త్రయోదశిని జరిగిందని తెలుగు పంచాంగాలు చెబుతున్నాయి. కాగా ఆనాడే వరాహ జయంతి జరపవలసి ఉంది.

ఈ అవతారంలో విష్ణమూర్తి లోక కంటకుడైన హిరణ్యాక్షుని తెగటార్చాడు. ఆ కథ:

హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు బలగర్వితుడై భూమిని చాప చుట్టగ చుట్టి పట్టుకుని పోయి పాతాళలోకంలో దాగుకొన్నాడు. అప్పుడు భూదేవి తన బాధలు విష్ణుమూర్తితో చెప్పుకొన్నది. ఆ మొఱవిని విష్ణువు ఒక పెద్ద పంది రూపాన్ని ధరించి వెలశాడు. దాని శరీరం నల్లని పర్వతం లాగున ఉంది. దానికోఱలు తెల్లగా వాడిగా ఉన్నాయి. దాని గింజలు ఇనపదిమ్మెలుగా ఉన్నాయి. దాని కన్నులు పెద్ద జ్యోతుల లాగున ఉన్నాయి. అది ఘర్షురిస్తే ఉఱుము ఉఱిమినట్లు ఉంది.

ఇట్టి రూపంతో ఆపంది వచ్చి హిరణ్యాక్షుణ్ణి ఎదుర్కొన్నది. ఇద్దరికీ పెద్ద యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో హిరణ్యాక్షుడు చనిపోయాడు. అప్పుడు ఆవరాహమూర్తి పాతాళంలో పడి ఉన్న భూమిని తన బలిష్ఠమైన కోఱలతో పైకి ఎత్తి యధాస్థానంలో ఉంచాడు. తన్నుద్ధరించిన వరాహమూర్తికి భూదేవి నమస్కరించి స్తుతించింది.

కల్పాంతమందు ఒకసారి సమస్తమూ జలమయమై పోయింది. బ్రహ్మాండమంతా చీకట్లు కమ్ముకొన్నాయి. విష్ణమూర్తి ఆ జలార్ణవంలో వటపత్రశాయి అయి యోగనిద్రలో ఉండి పోయాడు. నిత్యులైన మహర్లోక నివాసులు కొందఱు అప్పుడు ప్రస్తుతింపగా అతడు మేలుకొన్నాడు. తిరిగి జగత్సృష్టికి పూనుకున్నాడు. మరల ప్రకాశింపచేసే ఉద్దేశంతో బ్రహ్మాండాన్ని ఊర్ధ్వాధోముఖములు అయ్యేటట్లు రెండుగా చేశాడు. వానిని పధ్నాలుగులోకాలుగా చేశాడు.

అధోభాగాండ ఛిద్రం నుండి యుల్బము భూమి మీద పడింది. అది మేరు పర్వతమైంది. పిదప నానావిధములైన పర్వతము, చెట్ల, చేమల,

జంతువుల, మనుష్యుల భారానికి భూమి పాతాళానికి కుంగింది. అప్పటి భూదేవిస్థితి బురదలో కూరుకుపోయిన ఆవు స్థితివలె నుండినది.

భూదేవి తన సంగతి విష్ణువుకు చెప్పుకొన్నది. అప్పుడు విష్ణుమూర్తి భూదేవితో నీవు భయపడకు నిన్ను ఉద్ధరిస్తాను అన్నాడు.

భూమిని తేల్చుట కొరకు అతడు వరాహావతారమును పొందాడు. నూరు ఆమడల వెడల్పు ఇన్నూరామడల పొడువు గల పంది రూపం ధరించాడు. అది నల్లని మబ్బురంగులో ఉంది. యజ్ఞస్వరూపాన్ని అంది ఉన్నదానికి యజ్ఞ వరాహమూర్తి అనే పేరు వచ్చింది.

ఆ యజ్ఞ వరాహమూర్తి పాతాళలోకానికి వెళ్లి నిజదంష్ట్రాగ్రముచే భూమిని పైకి ఎత్తాడు. అది స్వస్థానాన్నిచేరింది. అప్పుడు భూదేవి విష్ణుమూర్తిని పలు విధాల స్తుతించింది.

## చైత్రబహుళ చతుర్దశి

ఈనాడు గంగాస్నానం చేస్తే పిశాచత్వం రాకుండా పోతుంది. చైత్రబహుళ చతుర్దశి పర్వం భౌమవారం (మంగళ) తో కూడివస్తే మరీ ఫలప్రదమైనది.

## చైత్రబహుళ అమావాస్య

### కూర్మకల్పః

ఈనాడు వహ్నివ్రతము ఆరంభించాలని స్మృతి కౌస్తుభమూ, పితృవ్రతం చేయాలని చతుర్వర్గ చింతామణి చెబుతున్నాయి.

అమావాస్య కూడా పర్వదినమేనా అనే నానుడి ఒకటి ఉంది. కాని చిరకాలంగా అమావాస్య పర్వదినంగానే పరిగణింపబడుతూ ఉంది.

ఆనాటికి అమావాస్య అనే పేరు ఎందుకు వచ్చిందో తెలిపే కథ ఒకటి ఉంది. అచ్ఛోదము అని ఒక కొలను ఉంది. సోమవులను పితరుల మానసపుత్రిక ఆ కొలను ఒడ్డున ఉండి తపము చేస్తూ ఉండెను. ఆమె పేరు అచ్ఛోద అయ్యెను. ఆమె తన పితరులను చిరకాలము వఱకు చూడకుండా ఉండిపోయింది. అందుచేత వారిని చూడాలని ఆమెకు మనసుపుట్టెను. పితరులు ఒకనాడు ఆమెకు దర్శనం ఇచ్చారు. అందులో మావసుడు అనే పితృదేవుడు చాల అందంగా ఉన్నాడు. పైగా వాడు దివ్యలంకార భూషితుడుగా కూడా ఉండెను. వీనిని అచ్ఛోద మోహించింది.

కాని మానసుడు మాత్రం చలించలేదు. ఆమె కోరికను నిరాకరించాడు. ఆ కారణం వల్ల ఆనాటికి అమావాస్య అనే పేరు వచ్చింది. అది పితరుల పాలిటి పర్వదినంగా చెలామణీ కాజొచ్చింది. ఆనాడు మానవులు పితరులకు భక్తి ప్రపత్తులతో తిలతర్పణాదులు ఈయడం ఆచారంగా పెట్టుకున్నారు.

## మేషసంక్రాంతి

ఈనాడు భార్గవ రాముని పూజించి ఉపవాసము ఉండాలని హేమాద్రి చెబుతున్నాడు. సుజన్మావాప్తి వ్రతం, సంక్రాంతి స్నానవ్రతం, నవాన్నశ్రాద్ధం మున్నగునవి ఈనాడు చేస్తారని వ్రతగ్రంథాలు చెబుతున్నాయి.

మేషము, వృషభము, మిథునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనస్సు, మకరం, కుంభం, మీనం అని పన్నెండు రాసులు, ఒక్కొక్కరాశిలో సూర్యుడు ఒక్కొక్కమాసముండును. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే దినానికి మేష సంక్రాంతి అని పేరు. మేష సంక్రాంతినుండి వృషభ సంక్రాంతి వరకు కల మాసమును మేషమాసమంటారు.

సౌరమానము ప్రకారము మాసాలను లెక్కించే వారి మాసాల నామాలు ఈ రాశులను పట్టి ఉండును. మేషసంక్రాంతి తమిళులకు సంవత్సరాది. ప్రతి సంక్రాంతి పితృదేవతలకు ప్రీతి కరమైనరోజు. అశ్వనీ నక్షత్రగతుడై సూర్యుడు మేషరాశిలో ప్రవేశించు దినము మేష సంక్రమణ పుణ్యకాలము.

## కేరళదేశీయుల విషు

సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే రోజు అరవవారికి సంవత్సరాది కదా! అరవ వారికి పొరుగు వారైన కేరళులు కూడా దానిని గొప్ప పర్వంగా జరుపుతారు. కేరళదేశీయులకు ముఖ్యమైనవి మూడు పండుగలు అని ఓనమ్, విషు, తిరుపతిర, మేష సంక్రాంతినాడు వారు జరిపే పండుగను వారు విషు అంటారు. ఓనమ్ అనేదివారి ప్రధానపర్వం. దాని తరువాత గణనకు వచ్చేది విషు.

విషు పర్వాన్ని వారు జరిపే తీరు విచిత్రంగా ఉంటుంది. తెల్ల వారితే విషు అనగా ఆరాత్రి ప్రతి గృహయజమానురాలు ఇంట ఒకచోట

ఒక పెద్ద అద్దాన్ని పెడుతుంది. ఆ అద్దానికి రెండు పక్కల రెండు దీపాలు పెడుతుంది. అద్దానికి ముందు ముందుగా బంగారం ఉంచుతుంది. దాని ఇవతల వెండి ఆ పిమ్మట బియ్యం, కూరకాయలు, పళ్లు ఉంచుతుంది. ఈ ఏర్పాటును కేరళభాషలో 'విషుకవి' అంటారు.

తెల్లవారకట్ల ఇంటిలోనివారిని ఆమె నిద్రలేపుతుంది. వాళ్లను ఒక్కొక్కరివే అక్కడు నుంచి విషుకవి వరకు తీసుకువెళుతుంది. వాళ్లు కళ్లు మూసుకునే ఉంటారు. ఆమె వారి చెయ్యిపట్టుకుని వారిని విషుకాని వద్దకు తీసుకు వెళ్లుతుంది. వారిని అక్కడ కూచో పెడుతుంది. వారు తమ కనురెప్పల మీద బంగారు వస్తువు ఏదో ఒకటి రాచుకుని ఆ మీద రెప్పలు తెరచి చూస్తారు. అద్దంలో తమ ప్రతి బింబం చూస్తారు. తమ ముందు పళ్లు, కాయలు, బియ్యం, వెండివస్తువులు, బంగారు వస్తువుల దర్శనమవుతాయి. ఇట్లా అందరూ చూడడం అయ్యాక కుటుంబ యజమాని కుటుంబం యొక్క ఆస్తిపాస్తులకు తగ్గట్టుగా ప్రతి ఒక్కరికి రొక్కరూపమైన బహుమానం ఇస్తాడు.

ఈ కార్యకలావం యొక్క అంతర్యం ఏమిటంటే నూతనవత్సరాదినాడు తొలిగుండా సరసపదార్థసంపన్నమైన దృశ్యాన్ని చూడడం. అట్లా చూడడం వల్ల ఆ సంవత్సరం పొడుగునా అతనికి అట్టి అదృష్టమే పడుతూ ఉంటుందని నమ్మకం.

ప్రతి పండుగకు వలెనే ఈ పండక్కి కూడా విందు భోజనాలు నడుస్తాయి. బంధువులు స్నేహితులు ఆదరించడంతో వేడుకలతో ఈ రోజుగడుపుతారు. పిన్నలు పెద్దలకు నమస్కరించి వాళ్ల ఆశీర్వచనాన్ని పొందుతారు. ఆనాడు ఏ విధమైన పరుషవాక్కులు పలుకరు.



# వైశాఖము

ఇది సంవత్సరములో రెండవమాసము. వైశాఖ మాసాన గృహనిర్మాణానికి ఆరంభించిన ధనరత్నప్రాప్తి అని మత్స్య పురాణం చెప్తోంది.

వైశాఖస్నానం ప్రాతఃస్నానము చేసి, రావి చెట్టుకు నీరు పోసి ప్రదక్షిణాలు చేయాలి. తులసిదళములతో మాధవపూజ, పానకంబు దధ్యన్న మహుపదార్థతతియు నుపహారమియ్యాలి.

## వైశాఖ శుద్ధ పాడ్యమి

వైశాఖ మాస స్నానవ్రతానికి ఇది ప్రారంభదినము. వాఙ్మనః కాయజాశేష పాపాలు వైశాఖ స్నానంతో పోతాయి. ప్రాతఃకాలంలో నియమంగా స్నానం చేస్తే మాధవునకు ప్రీతికలుగుతుంది. స్నానానంతరము రావి చెట్టుకు నీరుపోసి ప్రదక్షిణాలు చేయడం ఆరోగ్యకరము. ఈ మాసములో తులసి దళాలతో మాధవుడికి పూజ చేస్తే పుణ్యము కలుగుతుంది.

## వైశాఖ శుక్ల తదియ
## అక్షయ తృతీయ

వైశాఖ శుక్ల తృతీయ అక్షయ తృతీయ అనీ, ఈ పర్వం పూర్వాహ్ణ వ్యాపిని అనీ వ్రతరాజము చెబుతూ ఉంది. అక్షయ తృతీయ గొప్ప పుణ్యదినం.

అక్షయ తదియ సోమవారమునాడుకాని, బుధవారమునాడుకాని అయితే మరీ పవిత్రమైనది, కృత్తిక రోహిణీ నక్షత్రముతో కూడిన ఈ పర్వం అతిప్రశస్తం.

**"వైశాఖే మాసి రాజేంద్రశుక్ల పక్షే తృతీయకా.**

**అక్షయాసాతిథిః ప్రోక్తా కృత్తికా రోహిణీయుతా".** అని శాస్త్ర ప్రమాణము.

ఈనాడు చేసే దానాలు అక్షయ ఫలాన్ని ఇస్తాయి అనీ చెబుతారు. దానాలేకాదు ఈనాడు దేవతలను గురించి, పితృ దేవతలను గురించి చేసే పూజలు కూడా అక్షయ ఫలాన్ని ఇస్తాయి. అందుచేతనే దీనికి అక్షయ

తృతీయ అనే పేరు వచ్చింది. ఈ పర్వాన్ని గురించి శ్రీ కృష్ణుడు యుధిష్ఠిరునకు ఈ విధముగా చెప్పినట్లు భవిష్యపురాణంలో ఉంది.

"పూర్వకాలంలో దరిద్రుడు, ప్రియవాది, సత్యవంతుడు, దేవగురు జనభక్తుడు ఐన ఒక కోమటి ఉండెను. అతను ఒకసారి వైశాఖమాస శుక్లపక్ష మహాత్మ్యము పెద్దల వలన విని అక్షయతృతీయనాడు గంగాస్నానం చేసి ఇంటికి వచ్చి దేవపూజచేసి లడ్లు, విసిని కర్రలు దానము చేశాడు. ఆ కోమటి ఉత్తర జన్మలో కుశవతి నగరంలో ధనవంతుడైన ఒక క్షత్రియుని యింట పుట్టాడు. ఆ జన్మలోనూ అతడు దాననిరతిని వీడలేదు. ఎంతగా దానము చేస్తూ ఉన్నా అతని సంపద క్షయం కాక అక్షయమవుతూ ఉండింది. ఇది అంతా అక్షయ తృతీయ వ్రతాచరణ ప్రభావము.

వ్రతోత్సవ చంద్రికాకారుడు ఈ వ్రత విధానాన్ని వివరిస్తూ విశేషాలు ఇట్లా తెలుపుతున్నారు.

"ఈ రోజున గంగాస్నానం చేసేవారు సకల పాపవిముక్తులు అవుతారు. పితృదేవతలకు తర్పణాదులు విడవాలి. లక్ష్మి సహితమైన నారాయణుని, గౌరీసహితుడైన త్రిలోచనుని పూజించాలి. ఆ పూజా సమయంలో విసనకర్రలు, లడ్లు పంచిపెట్టినవారు వైకుంఠాన్ని, శివలోకాన్ని పొందుతారు. యవలతో అన్నం వండి దేవుడికి ఆరగింపు చేయాలి. గురువులకు నవధాన్యాలు, గ్రీష్మ ఋతువులో లభ్యమయ్యే ఇతర వస్తువులతో కలిపి దానం చేయాలి. ఈనాటి దానాల్లో జలపూరిత కుంభం ముఖ్యమైంది. ఈనాడు ఒంటి పూటే భోజనం చేయాలి.

ఈ వ్రతం కేవల ధార్మిక గుణ సంపన్నమైనది. అందువల్ల ఈ పండుగ అట్టే ఆర్భాటంతో జరిగేది కాదు. ఈ పర్వం హిందూ దేశం అంతటా ఉన్నది. దేవాలయాల్లో ఈనాడు విగ్రహాలకు ధవళవస్త్రాలు కడతారు."

ఈ వివరణ వల్ల ఈ రోజున తీర్థస్నానము, తిలలతో పితృతర్పణం, ఘటదాన ధర్మాలు, దైవపూజ విధాయకకృత్యాలని తెలుతూ ఉంది.

ఈనాటి వివరణలో పంచంగ కర్తలు అక్ష తృతీయా (1) దధ్యన్న వ్యజన ఛత్ర పాదుకోపానహదానాని ఉత కుంభ దానం (2)

లక్ష్మీనారాయణపూజా (3) గౌరీ పూజా, త్రిలోచన గౌరీవ్రతం, (4) త్రేతాయుగాది (5) బలరామజయంతి (6) సింహాచలక్షేత్రే చందనమహోత్సవః' అని వ్రాస్తారు.

ఈ ఆరు విషయాలను క్రమంగా వివరించుకుందాము.

అక్షయ తృతీయనాడు పెరుగు అన్నము, విసనకర్రలు, గొడుగులు, పాదుకలు, చెప్పులు, ఉదకుంభము మున్నగునవి దానము చేయాలని చెప్పబడిఉంది.

వైశాఖ మాసంలో 'వైశాఖపూజ' అనే పేరుతో సంపన్న గృహస్థులు ఒక వ్రతం చేస్తూ ఉండిరి. అందులో వేసవికి అవసరమైనవి వేసవిలో బాగా దొరికే మామిడి పళ్లు, పనస తొనలు మున్నగునవి కూడ పంచిపెట్టేవారు.

వేసవికి అవసరమైనవి, వేసవిలో దొరికేవి అయిన వస్తువులు విరివిగా దానం చేయడం అక్షయ తృతీయావ్రతం యొక్క ప్రధానోద్దేశ్యమని ద్యోతకమవుతూ ఉంది.

## ఉదకుంభదానము

ఈనాటి విధాయక కృత్యాలలో ఉదకుంభదానం ఒకటి. వైశాఖ మాసం నుండి ఎండలు మెండుగా ఉంటాయి. ఎండల రోజుల్లో కుండల్లో జాగ్రత్తపెట్టిన నీరు పుచ్చుకుంటే బాగా దాహశాంతికరంగా, ఆప్యాయంగా ఉంటుంది. కావుననే నీటితో నిండిన కుండల్ని ఈ కాలంలో దానం చేయడం మతవిధుల్లో ఒకటిగా మన పెద్దలు నిర్ణయించారు. గ్రీష్మర్తు చర్యల్లో వాగ్భటుడు మిక్కిలి చల్లనైన యుదకమును మట్టి పాత్రలో బోసిన కలిగొట్టు పూలవలి చేర్చి వాసెనగట్టి పచ్చ కర్పూరమును చేర్చి మట్టి దుత్తతోడనే పానము చేయవలయును." అనివాకొనుచున్నడు. వాగ్భటుని ఈ ఆరోగ్యసూత్రమును పట్టి గ్రీష్మర్తుముఖస్థంలో అక్షయ తదియనాడు ఉదకుంభ దానాచారాన్ని ఏర్పరిచిన మన పెద్దల లోకస్వాస్థ్య ప్రణవ బుద్ధిని మనము కొంతకు కొంత పోల్చుకోవచ్చును.

## లక్ష్మీనారాయణ పూజ

స్మృతికౌస్తుభములో, తిథితత్వములో, పురుషార్థ చింతామణిలో ఈనాడు విష్ణుపూజ చేయాలని కలదు.

## త్రిలోచన గౌరీపూజ

చైత్రశుక్ల తృతీయనాడు ప్రారంభించిన గౌరీపూజా వ్రతముకొన్ని ప్రాంతాలలో నెలరోజులుసాగి ఈనాడు ముగుస్తుంది. కావుననే పంచాంగంలో ఈనాటి వివరణలో గౌరీపూజ, త్రిలోచన గౌరీవ్రతము అని పేర్కొనబడి ఉంటుంది.

సుభోధిని (25-4-36) పత్రికలో ఒకరు ఇది శైవ సంబంధమైన పర్వంగా ఇట్లు వ్రాస్తున్నారు. "ఇది కార్తికేయ ప్రయుక్తమగు పర్వదినముగనున్నది. సామాన్యముగనీ దినమున కుమార స్వామికి (కార్తికేయునకు) అభిషేకోత్సవవాదులు జరుగును. శివాలయములలోనను విశేషముగ పూజాదులు చేయుదురు."

## యుగాదితిథి

అక్షయ తృతీయ యుగాది తిథి. కృత, త్రేత, ద్వాపర, కలియుగము లనేనాలుగు యుగాల్లోనూ త్రేతాయుగానికి ఇది మొదటి రోజు.

త్రేతాయుగ పరిమాణము నూటతొంభై ఆరువేల మానవ సంవత్సరాలు. శ్రీరామవతారము త్రేతాయుగానికి చెందింది. అప్పటి మానవాయుర్దాయం మూడు వేల సంవత్సరాలు. శరీరంలో మాంసం ఉండే వరకు ప్రాణాలు ధరించి ఉంటారు. త్రేతాయుగం రజత యుగం. ఆహవనీయ, గార్హపత్య, దక్షిణములను త్రేతాగ్నులను పూజించిన కాలము కావడము చేత అది త్రేతాయుగమని అనబడింది.

సంవత్సరంలో ఇతర యుగాదులు ఇట్లున్నాయి.

| | |
|---|---|
| కృతయుగాది | కార్తికశుద్ధనవమి |
| ద్వాపరయుగాది | మాఘకృష్ణ త్రయోదశి |
| కలియుగాది | భాద్రపదకృష్ణ త్రయోదశి |

యుగాది తిథుల్లో సముద్ర స్నానం చేసి పితృశ్రాద్ధం జరిపే వారికి కురుక్షేత్రంలో వేయిగోవులను దానము చేసిన ఫలము కలుగుతుందని శాస్త్రవచనం. ఈనాడు స్నానము, దానము, తపము, శ్రాద్ధము, హోమము చేయాలని వ్రతగ్రంథాల్లో వ్రాసి ఉంది. శివ గంగ కైలాస హిమాలయ భగీరథపూజ లున్నూ ఈనాటి కృత్యాలు.

ఈనాడు కల్పాది అని అమాదేర్ జ్యోతిషీ అనే గ్రంథం చెబుతోంది.

చతుర్వర్గ చింతామణిలో ఈనాడు మహాఫలవ్రతం, అనంతతృతీయా వ్రతం చేస్తారని కలదు.

ఈనాడు గంగాస్నానం, కౌశికీ స్నానం విశేష ఫలప్రదమైనది.

## బలరామ జయంతి

వైశాఖశుద్ధ తదియ బలరామ జయంతి. ఇట్లని మన పంచాంగాలు పేర్కొంటున్నాయి. దక్షిణాదిని కొన్ని ప్రాంతాల్లో భాద్రపదశుద్ధ తదియనాడు బలరామ జయంతి జరుపుతారని తెలుస్తున్నది.

బలరాముడు దేవకి ఏడవ గర్భమున అనంతాంశమున పడగా యోగమాయ ఆగర్భమును స్రవింప చేసి రోహిణి కడుపున చేర్చిందనీ, భాద్రపద మాసం కృష్ణపక్షాష్టమినాడు రోహిణి నక్షత్రమున రోహిణి సంకర్షణుడు అనే పుత్రుని కన్నది అని పద్మపురాణము చెప్పుచున్నది. కాని భాద్రపద కృష్ణాష్టమిని స్మృతి కౌస్తుభము మున్నగు వ్రత గ్రంధాలేవీ బలరామజయంతిగా పేర్కోవటం లేదు. పురుషార్థ చింతామణి మున్నగు గ్రంథాలు అక్షయ తృతీయను పరశురామ జయంతిగా చెబుతున్నాయి. కానీ మన పంచాంగాలలో పరశురామ జయంతి మార్గశిరబహుళ విదియనాడు అని ఉంటున్నది.

వ్రత గ్రంథాలలో వేఱొక తిథి పేర్కొన బడక పోవడంచేత మన పంచాంగాలు పేర్కొనడం చేత అక్షయ తృతీయనాడే బలరామ జయంతి అని నిర్ధారిద్దాము.

రోహిణి యందు ఆదిశేషుడు బలరాముడుగ పుట్టాడని పురాణగాథ. విష్ణుమూర్తి కృష్ణావతారం ఎత్తినప్పుడు ఇతడున్నూ అవతారమెత్తాడు. కృష్ణుని కంటే ఇతడే ఒక విధముగా గొప్పవాడనే ధోరణి మాటలు క్షేమేంద్రకవి చారు చర్యలో కనిపిస్తున్నాయి.

**శ్లో॥ బన్ధూనాం వారయే ద్వైరంనైక పక్షాశ్రయోభవేత్**

**కురుపాణ్డవసఙ్గ్రామే యుయుధేనహనహలాయుధః**

తా: బంధువులలోని కలహములను నివారింపవలెను. ఏకపక్షాశ్రయుడు కారాదు. కురుపాండవ యుద్ధంలో బలరాముడు యుద్ధం చేయలేదు.

## బలరామకృష్ణులు

భారతయుద్ధంలో ఆంధ్రులు కౌరవుల పక్షాన ఉండిరి. బలరాముడు ఒకవిధముగా కౌరవ పక్షపాతి అనవచ్చును. కృష్ణుడు పాండవ పక్షపాతి. కృష్ణుడు 'చాణూరాంధ్రనిషూదనుడు' కంసుని వద్ద ఉండిన చాణూరుడు అనే ఆంధ్రమల్లుని చంపినవాడు కృష్ణుడు.

బలరాముని ఆయుధం నాగలి. అతడు ఆ హలాయుధంతోకొన్ని అద్భుత కార్యాలు చేశాడు.

దుర్యోధనుని కూతురైన లక్షణను కృష్ణుని కుమారుడైన సాంబుడు వివాహార్థము తీసుకొనిపోతూ ఉండగా కౌరవసైనికులు అడ్డుకొని సాంబుని హస్తినాపురంలో చెరలో పెట్టారు. సాంబుని విడిపించడానికి బలరాముడు వెళ్లాడు. బలరాముడు ఎంతగా హెచ్చరించినా కౌరవులు సాంబుని విడవలేదు. అప్పుడు బలరాముడు తననాగలితో హస్తినాపురాన్ని పెళ్లగించి వేయడానికి పూనుకన్నాడు. అతని నాగలిపోటుతో హస్తినా పురమంతా అల్లఅల్లాడింది. అప్పుడు కౌరవులు బలరామునికి దాసోహమ్మని సాంబుని విడిచిపెట్టేరు.

నరకాసుర సంహారానంతరం నరకుని మిత్రుడు ద్వివిదుడనే వానరుడు పేట్రేగి పెద్ద పట్టణాలను, పెద్ద తోటలను పచ్చము పాడు చేస్తూ ఉండినాడు. రాళ్ళు రువ్వి వానిని పోద్రోలాలని బలరాముడు ప్రయత్నించాడు. కాని కార్యం లేకపోయింది. అప్పుడు బలరాముడు తన హలాయుధాన్ని వాడి వానిని చంపివేశాడు.

బలరాముడు గదాయుద్ధవిద్యలో దుర్యోధనునికి గురుడు. కురుక్షేత్రంలో భీమదుర్యోధనుల గదా యుద్ధంలో భీముడు దుర్యోధనుని యూరువుల మీద కొట్టాడు. అట్లా కొట్టడం అధర్మం కాబట్టి భీముని శిక్షించడానికి బలరాముడు హలాన్ని ఎత్తాడు. కృష్ణుడు అడ్డుపడి బలరాముని శాంత పరిచాడు.

బలరాముడు ఒకసారి గోపికలతో యమునానదికి స్నానానికి వెళ్లాడు. ఆ సందర్భంలో అతడు యమునా నదిని పిలిచాడు. కాని ఆమె రాలేదు. అప్పుడు అతనికి కోపం వచ్చి యమునను చీల్చి వేస్తానని హలాన్ని గ్రుచ్చాడు. అందుతో భయపడి యమున వెలరువారిన ముఖంతో స్త్రీరూపాన వచ్చి బలరాముడికి నమస్కరించి వినీల వస్త్రాలు కానుకలుగా యిచ్చింది.

హస్తినాపురాన్ని పెకళించడానికి, కోతిని చంపడానికి, భీమునికి ధర్మం గుర్తుకు తేవడానికి, యమునానదిని శిక్షించడానికి వాడిన హలంతో బలరాముడు ఆంధ్రులకు ఒక మహోపకారం చేశాడు. తన నాగలి చాలుతో అతడు ఆంధ్రభూమి మీద ఒక నదిని పుట్టించాడు. దానిని మహేంద్ర పర్వత శాఖ అయిన నిమ్మగిరుల నుండి నూటపదిహేను మైళ్లు నడిపించి మోపసు బందరు వద్ద తూర్పు సముద్రములో పడునట్లు చేశాడు. అది (లాంగలి= లాంగులము=నాగలి) లాంగుల్య (నాగలి వలన పుట్టినది) అనే పేరుతో నేటికిని ఉంది. దానిని గ్రంథాంతరాలలో లాంగలిని, నాగావళి అని కూడా అంటారు.

కర్షకుల కల్పవృక్షమగు తాటి చెట్టు ఇతని కేతన చిహ్నం.

దీనికి సంబంధించిన పురాణగాధను శ్రీమండ నరసింహము చిత్ర భాను శ్రావణ భారతిలో ఇట్లు చెప్పుచున్నారు.

"కురు పాండవులకు యుద్ధమాసన్నమగుతరి బలరాముడు తీర్థయాత్రనెపమున దేశసంచారమునకై వెడలెను. నైమిశ వనమున నాతడు పోవుచు ముని నివాసమొకటి పొడగాంచి యచట వేద శాస్త్ర పురాణాది వాదములను సూతుడు. శౌనకాది మునీశ్వరులకు పన్యసించు చుండుటగని యచ్చో గొంత దనుక నాగెను. సూతడు బోధనమున నిమగ్నుడగుటచే బలరాముని రాకగానడయ్యెను. అర్ఘ్య పాద్యాది సత్కారమీయని కారణమున నూతుని బలరాముడు పూజింప కుండుటకు గినిసి, కోరి తన్నవమానించుటకిట్లు చేసెనని తలచి నాగలి చేబూని వానిగొట్టగా సూతుడు తలదెగి నేలకొఱగెను. అంతసభలోన సంక్షోభ మంకురింప రాముడును బశ్చాత్తాపమంది సూతుని బునర్జీవితునిగ జేసెను. కాని శౌనకాదులు బలరాముని చర్యను గర్హించి పాపహరణార్థమొక నదీతీరమున పంచలింగ ప్రతిష్ఠ గావింప శాసించిరి.

బలరాముడు తన ప్రధానాయుధమగు నాగలిని భుజమున ధరించి నైమిశమున (బంగాళము) వీడి కళింగ రాజ్యమున ప్రవేశించెను. మార్గమధ్యమున వేటకై వచ్చిన కళింగాధిపతి వలన రాజ్యహీనస్థితిని రాముడు తెలిసి కొనెను. నీటివసతి లేకుండుటచే ఈ హీనస్థితి వచ్చెనని గుర్తించి బలరాముడు కళింగ రాజ్యము నుద్ధరింపనెంచి శంకరుని గుర్చి ధ్యానించెను. శివుడాతని ప్రార్థన నంగీకరించి జటాజూటముసడలించి

పర్వతాగ్రముననొక సలిల బిందువును జారవిడిచెను. బలరాముడు నాగలి పర్వతంబున నాటి ముందు నడువ నాతని వెంట పెద్దరొద నిడుచు నురుగుగ్రమ్ముచు నొక మహాప్రవాహము రాజొచ్చెను. శివుని ప్రసాదంబున బలరాముని నాగలి వెంట వచ్చు నీయేరు లాంగల్య యనబరగ జొచ్చెను. లాంగలి వెంబడి వచ్చిన కుల్యగావున లాంగుల్య యనునామ మర్ధానికి సార్ధకమయ్యెను. నది పుట్టిన పర్వతాగ్రము నుండి తూర్పు సముద్రమున కలియునందాక తీరంబున బలరాముడు శివలింగము లైదింటిని బ్రతిష్ఠ చేసెను. పంచలింగ ప్రతిష్ఠతో నాతని పాపము తొలగెను.

ఈ నదిపై పాలకొండ, శ్రీకాకుళము అను ముఖ్య నగరములును, అనేక గ్రామములును గలవు. దీని నిడివి రెండు వందలమైళ్లు. బలరామునిచే బ్రతిష్ఠింపబడినవని నమ్మబడు చుండిన శివాలయము లైదును సోమేశ్వరాలయము, భీమేశ్వరాలయము, సంగమేశ్వరాలయము, కోటీశ్వరాలయము, మణినాగేశ్వరాలయము - నేటికిని కొలది రాబడులతో రాగ భోగాదులందు చున్నవి. నది కిరుపార్శ్వముల కొంత మార్గము వరకుండు ప్రదేశమందలి జనులు సంకల్పమును జెప్పుకొనునపుడీ ప్రదేశమును బలరామక్షేత్రమని చెప్పుదురు. బలరామక్షేత్రమనునది శ్రీకాకుళము, చీపురుపల్లి తాలూకాలకు వైదికులు వ్యవహరించునామము. తూర్పు కనుమలందలి యొక పర్వతాగ్రమునకు బలరామగిరి యను వ్యవహారము.

గంగను భగీరథుడు, గోదావరిని గౌతముడు, నాగావళిని బలరాముడు తపస్సు చేసి శంకరుని మెప్పించి భూలోకమునకు దెచ్చిరనుటలో నంతరార్థము కలదు. తపస్సు చేయుటయనగా నరణ్యమున నొంటరిగా గూర్చుండి ముక్కు మూసుకుని భగవద్ధ్యానము చేయుటయే కాదు. పర్వతోపరిభాగము నుండి ప్రవహించి చుండు సెలయేళ్లనెల్లనేకము చేసి నిమ్నోన్నతముల గనిపెట్టి సముద్రము వరకు మార్గము చూపుట సామాన్యమైన పనికాదు. గొప్ప మేధాశక్తి, నిర్మాణ ,చాతుర్యము నుండిన గాని యట్టి పని నెరవేరదు. బలరాముడుకూడ నట్టి వాడనియే భావింపవలయును.

పైవిషయములను విమర్శింపగా నీప్రదేశమున బలరాముడు మత రాజకీయములందేకాక సాంఘిక జనోపయోగ నైతిక విషయములందు గూడ ప్రమేయము గలిగించుకొని యుండెననుట నిర్వివాదాంశము.''

ఇతర తావుల్లో జీవుల్ని, నదుల్ని, నగరాల్ని చంపడానికి వాడిన తన నాగలిని బలరాముడు ఈ తావున జీవుల్ని పెంచడానికి పనికి వచ్చే ఒక నది ఉత్పత్తికి ఉపయోగించాడు. కళింగమున కింతటి మహోపకారము చేసిన బలరాముడు దానికి సమీపస్థమైన ఉత్కళింగమునకు చెందిన పూరీ పట్టణము నందలి జగన్నాథస్వామివారి ఆలయమున స్వామి వారితో సమముగ పూజలందుకున్నాడు. కళింగమునకు బలరాముడు ప్రసాదించిన నది లాంగుల్య. ఇప్పుడు తెలుగు వారికి మహోపకారకమై ఉన్నది.

బలరామ క్షేత్రమహాత్మ్యమను స్థానిక పురాణమున బలరామునికి ఈ ప్రాంతాలతోగల సంబంధము విపులీకృతమై ఉన్నది. తెలుగు వారు దానిని తెలిసి కోవడము అవసరము. అంతేకాక తెలుగు నాటికి మహోపకారము చేసిన అతని జయంతిని ఏటేట వైభవముగా జరుపుకోవడమున్నూ తెలుగు వారికి అవసరమే.

## కూరపాదులు

తమకు ఎక్కువగా ఉపయోగించే తాటి చెట్టును కేతనం మీద నిలుపుకొని, తమకు ప్రధాన సాధనమైన నాగలిని ఆయుధముగా కలిగి ఒక నదితో తమ్ము హర్షకులనుగా చేసిన బలరాముని జయంతి దినమైన ఈ అక్షయ తదియ ఆంధ్రకర్షకులకు వారి కార్యకలాపాల విషయంలలో ఒక ముఖ్యదినంగా ఉంది.

ఆంధ్ర కర్షకులు తమపొలాల్లో, ఆంధ్రగృహస్థులు తమపెరళ్లలో ఈనాడు కూరపాదులు పెడతారు. అవి యథా కాలాన మొలకెత్తి భరణి, కృత్తికకార్తులలో ఎండలు తట్టుకుంటూ నెమ్మదిగా ఎదిగి మృగశిర కార్తెకు ముంగిళ్లు చల్లబడడంతోటే ఏపుగా ఎదిగి అప్పటినుంచి అక్షయంగా కాస్తాయి. ఈ విషయం పొట్లపాదుల సందర్భంలో బాగా దాఖలాగా ఉండడం తెలుగువారిలో చాలా మందికి తెలుసు.

## చందన మహోత్సవము

తెలుగుదేశములోని గొప్పక్షేత్రాలలో ఒకటైన సింహాచలమునందలి శ్రీవరాహ లక్ష్మీనరసింహ స్వామి వారికి ఈనాడు చందనోత్సవం జరుగుతుంది.

అక్షయ తృతీయనాడు సాధారణంగా కృత్తికా నక్షత్రం అవుతూ ఉంటుంది. గణిత భేదము చేత ఒకప్పుడు రోహిణీ మృగశీర్షా నక్షత్రములలో

ఏదో ఒకటి రావచ్చు. సాధారణంగా కృత్తిక అగ్ని సంబంధం కలది. రోహిణి కూడా కొంచెం ఇంచుమించు అటువంటిదే అని చెప్పవచ్చు. అగ్ని సంబంధము వలన తీక్షణత కలుగుతుంది. ఆతీక్షణత తగ్గడానికి చందన చర్చ ఒక విధమైన శైత్యోపచారము. సింహాచల స్వామికి విదియ నాటిరాత్రి గంధమును ఒలిచి వేస్తారు. తదియనాటి ఉదయాన సహస్ర ఘటాభిషేకము చేస్తారు. ఆ పిమ్మట స్వామినిజరూప దర్శనం. స్వామి రూపము లింగా కృతంలో కనిపిస్తుంది. పంది ముట్టి తరువాత విగ్రహరూపము కనిపిస్తుంది. ఆ రూపము ఇట్లు అభివర్ణితం "శ్రీస్వామి వారి విగ్రహాకారము అకృతాస్త్రుడయిన యొక శిల్పి చేమలచబడిన వరహావతారరూపము. క్షేత్రస్వామి వరాహ లక్ష్మీ నరసింహస్వామి, పందిముట్టి. ఊరువులవరకు మాత్రమే కనిపించుకాళ్లు. శిలస్తచ్ఛమయిన స్ఫటికము (విశాఖ పత్రిక 22-4-1936).

నిజరూపదర్శనం అయాక తిరిగి స్వామికి చందన చర్చ. ఈ గంధం వలుపు సహస్రఘటాభిషేకం చందన సేవ మున్నగునవి. సింహాచలము ఒకప్పుడు శైవక్షేత్రమై ఉండడాన్ని నిరూపిస్తూ ఉన్నాయి. ఈ నిరూపణాన్ని క్రింది కారణాలు బలపరుస్తున్నాయి.

## త్రినేత్రం

"సింహాచలము ప్రథమమున శైవక్షేత్రముగ నుండినదనియు శ్రీరామానుజులవారి కాలములో కాబోలు నది వైష్ణవ దివ్యదేశమయినదనియు కొందరు చెప్పెదరు.

(1) శివసంబంధము కలిగి యుండుటను బట్టియే ఆ క్షేత్రదేవత యొక్క ధ్యానములో 'త్రినేత్రం' అనియు కలదు. వైష్ణవము పుచ్చుకొనిన తరవాత కూడ 'త్రినేత్రత్వము స్థిరముగ నిలిచినది" **- సుబోధిని**

(2) ఈ దేవాలయమునకు సోమసూత్రము కలదు. ఇయ్యది అభిషేకాదులు తరుచుగా చేయబడు శివాలయము లందుండుట సాంప్రదాయము.

(3) విష్ణు క్షేత్రములందు సహస్ర ఘటాభిషేకము చేయునాచారము లేదు.

(4) ఇచ్చట కొండమీద కాలభైరవుడు, గంగాధార యొద్ద శ్రీ సీతారామస్వామి దేవాలయము కలదు. కొండ దిగువను పూవులతోట

దగ్గర శ్రీ వెంకటేశ్వరస్వామి వారి దేవాలయము కలదు. ఇయ్యవి రెండును కాని, వీనిలో నొకటి కాని క్షేత్ర పాలకదైవతములయి యుండవలయును, విష్ణుక్షేత్రముల యందు శివుడు క్షేత్ర పాలకుడయి యుండుటయు, శివుడు క్షేత్రస్వామియై యుండుచోట్ల విష్ణువు క్షేత్రపాలకుడయి యుండు టయు అనుశ్రుతముగా వచ్చుచున్న ఆచారము. ఈ సింహాచలస్వామికి కొండ రెండవ ప్రక్కనున్న మాధవస్వామి క్షేత్రపాలకుడని కొందఱందురు.

(5) ఇంతేకాదు, కొండదిగువను రెండుమైళ్ల దూరములో కాల భైరవుడు క్షేత్రమునకు కావలిగానున్నాడు. ఇయ్యది శైవ సాంప్రదాయము కాని వైష్ణవ సాంప్రదాయము కాదు.

(6) మొదట లింగాకారమునున్న విగ్రహమును కళా కౌశల్యము లేని యే అకృతాస్త్రుని చేతనో తొందరగానో, రహస్యముగానో ఇప్పటివరాహ లక్ష్మీనరసింహా కారముగా మార్పించిరనియు ధైర్యము చాలకయో మరియే కారణము చేతనో నాటి లింగాకారమును నేటివరకును గంధపు బూతవలన సంరక్షించు చున్నారనియు కొందఱు శైవమత పక్షపాతులు చెప్పుదురు

**- విశాఖపత్రిక**

(7) శైవసంబంధముండిన కాలములో నేర్పడిన గొప్పయాచారమును నిచట యిప్పటికి నిలిచియున్నది. ఆ క్షేత్రమునకు ప్రసిద్ధమగు 'చందన సేవ' అను గొప్ప యుత్సవము నాటికి నేటికిని యక్షయ తృతీయ నాడె జరుగుచున్నది. ఈ పాతవాడుక పోద్రోలనలవి కాదు. **- సుబోధిని**

## పుట్టధార

ఆంధ్రుని ప్రాచీన క్షేత్రాలలో సింహాచలం ఒకటి. దీనికి సింహాచలం అనే పేరు ఈ కొండ సింహం రూపంలో ఉండడం చేతనని కొందరు. నరసింహస్వామి క్షేత్రమగుటచేతనని కొందరు అంటారు. ఎనిమిది వందల అడుగుల ఎత్తుగల కొండ వేసవిలో కూడ చల్లగ ఉండును. నీటి ధారలు పెక్కు, హనుమద్ధార, ఆకాశధార, పంచపాండవుల ధార మున్నగు ధారలు ఈ కొండమీద అనేకం. వీటి ఆధారమైన ధారపుట్టధార.

కొండమీద ఎక్కడానికి రెండు మెట్ల దారులు, మాధవధారదారి, అడవి వరము దారి అని, అందులో రెండవది ఎక్కువసదుపాయమైనది. ఈ దారిలో 1120 మెట్లు ఉన్నాయి. పనితనము గల ప్రతిమలు, చెక్కడపు జిలుగులు, బాగా ఉన్నాయి.

ప్రాంతీయ జనులు ఈ కొండను అప్పన్న కొండ అనీ, ఇచట స్వామిని అప్పన్న అనీ అంటారు. శ్రీకాకుళము, విశాఖపట్టణము మండల ప్రాంతీయుల అప్పన్న పేరు ఎక్కువగా పెట్టుకుంటారు. ఈ గుడికి వచ్చే కోడె దూడలకు అచ్చు పోసి ఆపటెద్దులుగా వదులుతారు.

దేవాలయం చాలా విశాలమైంది. శిల్ప చాతుర్యం మెండు. జాతి స్తంభాల మీద ఆవరణలో శిలారథం కలదు. గర్భగుడి విశాల రమ్యమైనది. స్వామి విగ్రహం చుట్టూ ప్రదక్షిణం చేయడానికి జాగా బాగా ఉంది. గంధం పూతతో స్వామి విగ్రహం ఇతర రోజుల్లో లింగాకారంగా కనిపిస్తుంది.

శిలా విగ్రహాలు శాస్త్ర యుక్తంగా మలిచే విద్య ఇక్కడ ఇంకా బాగా ఉంది. సింహాచలము సంపెంగ పూవులకు వామన చక్ర కేళి అరటిపండ్లుకు, అనాసపండ్లుకు ప్రసిద్ధి.

అన్నిటి కంటే అక్షయ తదియనాడు జరిగే చందన వేడుక యాత్రే ఇక్కడికి విశేషంగా యాత్రికులను ఆకర్షిస్తుంది.

## గృహస్థులు : చందనచర్చ

చందనాను లేపనం మంగళ ప్రదమైంది. ఆరోగ్యప్రదమైంది. చందనం అమూల్యమైన మూలిక. ప్రియమైన వాసన కలిగి ఇది దుర్గంధాన్ని పోగొడుతుంది. రక్తదోషాన్ని, పైత్యాన్ని తగ్గిస్తుంది. విషాహారంగా, క్రిమిహారంగా ఉంటుంది. అంతస్తాపాన్ని పోగొట్టి మిక్కిలి చలవ చేస్తుంది. ఆయుర్వేద వైద్యంలో దీనిని విరివిగా వాడతారు. చందానాసవం, చందనాదివటి మున్నగునవి తయారు చేస్తారు.

చందనం నుండి చాందినీ అత్తరువు తయారు చేస్తారు. సబ్బులున్నూ చేస్తారు. మన మతవిధులలో దీనికి చాలా ప్రాముఖ్యం ఉంది. నిష్ఠాపరులు దీనిని పగటి భోజనానికి ముందు నుదుటికి, చాతీకి, పై జబ్బలకు రాచుకుంటారు. నుదుటికి రాచుకోవడం తలలో వేడి చేరకుండా తలనొప్పి రాకుండా కాపుదలగా ఉంటుంది. చాతీకి రాచుకోవడం వల్ల హృదయానికి మేలు చేసి గుండె జబ్బులు రాకుండా కాపాడుతుంది.

జ్వర సంబంధమైన వేడి తగ్గడానికి రోగి కణతలకు ఉడుకులోనుకు బదులుగా మంచి గంధం రాస్తారు.

వేసవిలో ఒళ్లు పేలకుండా ఉండడానికి గంధంపూత మంచిమందు. అనేక చర్మవ్యాధులకు, కీళ్ల వాపులకు, జుట్టురాలుటకు అది మంచి

అనులేపనం చందన చర్చ చెమటను, దుర్గంధమును పోగొట్టి మనస్సుకు ఉల్లాసం పుట్టిస్తుంది. భ్రమను పోగొట్టి స్మృతిని కలిగిస్తుంది.

శుభకార్యాలప్పుడు గంధాలు పూసుకుంటారు. పేరంటపు వేళలలో స్త్రీలు మెడలకు, బుగ్గలకు గంధం పూసుకుంటారు. గంధం పొడి చల్లుకుంటారు. గంధం సమర్పించడం పూజించడానికి గుర్తు.

శవాన్ని దహనం చేసేటప్పుడు మంటలో గంధపు చెక్క వేస్తారు.

గంధం కొంచెం కొబ్బరి నీళ్లలో కాని మంచినీళ్లలోకాని కలుపుకొని తాగితే దాహనం శాంతి కరంగా ఉంటుంది.

ఆరోగ్యకాములు వేపవిలో ముఖ్యంగానూ, విరివిగానూ వాడ తగిన వస్తువు చందనమని సింహాచలములోని చందనోత్సవం ఏటేట ఎలుగెత్తి చాటుతూ ఉంటుంది.

'చారుచర్య' శ్రీ గంధ గుణమును ఇట్లు పేర్కొంటూ ఉంది.

**శ్రీ గంధం కృమికుష్ఠహారి విశదం తిక్తం కషాయాన్వితం**

**శీతం హృద్యమరోచకఘ్న మలిన ప్రధ్వంసి పైత్యాపహృత్**

**బల్యం వర్ణకరం విదాహశమనం మోహాపహం ప్రీణనం**

**మూర్ఛాఛర్ది వాసర్ప కేషుచ హితం స్వర్గం పరం శ్రీకరం.**

"శ్రీగంధము కృములను, కుష్ఠ వ్యాధిని హరించును. వగరుతోకూడిన చేదుగల రుచి గలిగి యుండును. శీతవీర్యము గలది, హృదయమునకు మేలుజేయును. అరోచకమును, శరీరమాలిన్యమును, పైత్యమును బోగొట్టును. బలమును చేకూర్చును. మంచి వర్ణము కలిగించును. శరీరతాపము, మోహము, మూర్ఛ, వాంతులు, విసర్ప వ్యాధిని బోగొట్టును. లక్ష్మీ ప్రదమైనది. శుభములు చేకూర్చును."

**- వేటూరి శంకరశాస్త్రి.**

బదరిలో అక్షతృతీయా పర్వం జరిగే తీరు శ్రీ శిష్టా వేంకటసుబ్బయ్య గారు 'నాబదరీ యాత్ర' అను గ్రంథంలో ఇట్లా వివరిస్తున్నారు.

"ఋషికేశము నుండి హిమత్పర్వతాల మీద నూటముప్పయి ఐదు మైళ్ల వరకు చమోలీదాక బస్సు నడుస్తుంది. ఆ పైకి నడవ వలసిన బాగం బదరీదాకా సూమారు యాభైమైళ్లు.

ప్రతి సంవత్సరం అక్షయ తదియ నాటికి చమోలీనుండి బియ్యం, పప్పులు, ఉప్పులు, సమస్త వస్తువులు బదరికి తీసుకుపోతారు.

పాండుకేశ్వరములోని విగ్రహములను అక్షయ తదియ నాటికి బదరీ తీసుకుపోతారు. వైశాఖ శుద్ధ తదియ నాటికి ఉత్సవ విగ్రహాలన్ని బదరీలో చేరుతాయి. అదే అక్షయ తదియ. సెప్టెంబరు మొదలు మే నెల వరకు బదరీలో జనులే ఉండరు. అందుకనే ఆరునెలలు దేవపూజ, ఆరుమాసాలు నరుల పూజ అంటారు. అక్షతదియ నాడు పూజారి వేద ఘోషలతో ఆలయంలో ప్రవేశిస్తాడు. ఆలయము ఎదుట అందరూ కూర్చుంటారు. ఆరుమాసాల క్రిందట సీళ్లు వేసిన తాళాలు యాత్రికులకు చూపిస్తారు. అందరు చూస్తుండగానే సీళ్లు బ్రద్దలు కొట్టి తాళాలు తీస్తారు. పూజారి తిన్నగా గర్భాలయములలోనికి వెళ్లి ఆరునెలల నుండి వెలుగుచున్న అఖండ జ్యోతిని బయటికి తీసుకొని వస్తాడు. ఆరునెలల క్రిందట వెలిగించి పెట్టిన జ్యోతి అది అన్నాళ్లు ఎవరు ఎగసనదోయనక్కర లేకుండానే ఆరిపోక, కొడైనా కట్టక అలా వెలుగుతూనే యుంటుంది. ఆ దీపం యాత్రికులందరు ఆ అఖండ జ్యోతిని దర్శిస్తారు. దీనికే జ్యోతిర్దర్శన మంటారు. ఆదివ్య జ్యోతిర్దర్శనార్థమే అష్టకష్టాలు పడి అక్షయతదియనాటి కక్కడికి వెళ్లడం.

ఆ తరువాత ఆరు మాసాల క్రితం పూజ చేసిన పువ్వులు ఈవలకు తెస్తారు. పూజ చేసిన నాడెలా ఉంటాయో ఆనాటికి కూడా పరిమళము చెడక వాడక పరాగభర భరితంబై ఉంటాయి. ఆ పువ్వులు మంచులో వేసిన వస్తువులలాగే ఉంటాయి. ఎన్నాళ్లైనా సరేయని సైంటిఫిక్కు సమర్థన చేస్తారు. మనవారు ఒప్పుకుందాం దీపం మాట యేం చెబుతారు ఎలా సమర్థిస్తారు. తలుపులు తాళాలు వేస్తారు. ఆలయం మంచుచే కప్పబడి ఉంటుంది. ఎలా వెలుగుతూంటుందో మరి ఆ దీపం."

## వైశాఖశుద్ధ పంచమి

### శంకరజయంతి

వైశాఖశుద్ధపంచమి తిథి యందు శంకరాచార్యులు అవతరించి నందున ఆనాడు శృంగేరి మున్నగు జగద్గురు పీఠములందు జయంత్యు త్సవాలుగా అనాదిగా జరుగుతూ వస్తున్నవి.

కేరళదేశాన కాలడి అను అగ్రహారంలో విద్యాధిరాజు అనే పండితుడికి శివగురువు అను పేరు గల పుత్రుడు. ఆ శివ గురువు భార్య ఆర్యాంబ.

ఆదంపతులు సంతానము కొఱకు అతి భక్తితో శంకరుని అర్చిస్తూ ఉండిరి. శంకరుని అను గ్రహం వల్ల పుట్టడం చేత అతనికి శంకరుడు అని పేరు పెట్టేరు. శంకరుడు అనగా సుఖము కలిగించువాడు అని అర్థము.

శంకరుడు పిన్నట నాటనే తన ప్రతిభను ప్రదర్శింప సాగెను. అతని తెలివి చూచి తల్లిదండ్రులు అతనికి ఐదవ ఏటనే ఉపనయనం చేయడానికి ప్రయత్న పడ్డారు. ఇంతలో శివగురుడు మరణించాడు. తల్లియే కష్టపడి కొడుక్కి ఉపనయనం చేసింది.

తరువాత అతను గురుకుల వాసం చేశాడు. ఆ చిరకాలంలోనే అతడు చతుర్వేదాలు, షడంగాలు, షడ్దర్శనాలు, చతుష్షష్టి కళలు నేర్చాడు.

విద్యార్థిదశలో అతడు నెఱపిన అద్భుత మహిమ ఒకటి ఉంది. విద్యభ్యాసకాలంలో అతడు భిక్షాన్నం తెచ్చుకొని తింటూ ఉండేవాడు. ఒకనాడు అతడు ఒక బ్రాహ్మణుడి ఇంటికి భిక్షాకబళానికి వెళ్లాడు. ఆ బ్రాహ్మణుడు మిక్కిలి పేదవాడు. ఆనాడు ఆయిల్లు అయ్యవార్లంగారి నట్టిల్లు లాగున ఉండెను. ఆ స్థితిలో విద్యార్థి శంకరుడు ఆ యింటికి మధుకర కబళానికి వెళ్లాడు. అప్పుడు ఆయింటి యిల్లాలు 'నాయనా! మేము ఇప్పుడు కటిక దరిద్రులమై ఉన్నాము. ఈనాడు నేను నీకు ఒక అన్న కబళమైనా పెట్టలేని స్థితిలో ఉన్నాను. అని కన్నీటితో పలుకుతూ ఇల్లు నాలుగు మూలలా చూచి ఒక మూల దొరికిన ఒకే ఒక ఉసిరికాయ తెచ్చి శంకరుని జోలెలో ఆదరంతో ఉంచింది. ఆమె అన్న మాటలకు, చూపిన ఆదరణకు శంకరుడి హృదయం కరుణార్ద్ర మయింది. తోడనే భవ్య కవితా వేశుడయి అతడు లలిత పద విలసితాలయిన వృత్తాలతో లక్ష్మి దేవిని స్తుతించాడు. అప్పుడు లక్ష్మీదేవి ఆయింటిలో బంగారపు ఉసిరి కాయలు కురిపించింది. అతని అద్భుత మహిమకు అంతా ఆశ్చర్యపోయారు. కనకం ధారగా కురవడానికి కారణభూతమైన ఆ శ్లోకాలకు 'కనకధారాస్తవం' అనే పేరు వచ్చింది.

అప్పటికి అతనికి ఏడో ఏడు. అన్ని విద్యలు పూర్తిగా చదివి అతడు ఇంటికి వచ్చాడు. మాతృదేవిని అర్చిస్తూ ఉన్నాడు. అతనిని ఒక యింటి వానిని చేయాలని తల్లి సంకల్పించింది. కాని సన్యాసాశ్రమం స్వీకరించడం తన అభిమతమని అతడు చెప్పాడు. నాయనా! నన్ను యింత బూడిద చేయకుండా నీవు సన్యాసివి అవుతావా! అని తల్లి కన్నీళ్లు కార్చింది.

మాతృదేవుడగు శంకరుడు అప్పటికేమిన్నీ మాటలాడక ఊరుకున్నాడు.

పిమ్మట కొన్నాళ్లకు తల్లీ కొడుకు కలిసి తమ ఊరికి సమీపాన ఉన్న చూర్ణీ నదికి స్నానానికి వెళ్లారు. స్నానం చేస్తూ ఉండగా శంకరుని కాలు మొసలి పట్టుకుని లోపలికి ఈడుస్తూ ఉంది. అప్పుడు అదరిపాటుగా శంకరుడు తల్లితో "అమ్మా! నాకాలు మొసలి పట్టుకుంది. నాకు మరణం ఆసన్నమైనట్లే, సన్యాసినయిచస్తే మోక్షం వస్తుంది. కాబట్టి అనుజ్ఞ ఇమ్మా" అన్నాడు. ఆపద్ధర్మంగా తల్లి అందుకు అంగీకరించింది.

అప్పుడు శంకరుడు 'సన్యస్తంమయా' అని ప్రేషోచ్చారణ చేశాడు. తోడనే మొసలి శంకరుని వదిలి పెట్టి వేసింది. శంకరుడు తల్లిని, పిత్రీయ ధనాన్ని జ్ఞాతులకు అప్పగించి ఆశ్రమ ధర్మవిరుద్ధమైనా తాను వచ్చి ఆమెకు అవసానదశలో యథోక్త కర్మలు చేయడానికి వాగ్దానం చేసి వెళ్లిపోయాడు.

ఆ వెళ్లడం అతడు నర్మదానదీ తీరాన ఉన్న గోవింద పాదుల వద్దకు వెళ్లాడు. అతడు శంకరునికి అద్వైత బ్రహ్మ తత్వాన్ని ఉపదేశించాడు. ఒకనాడు గోవింద పాదులు సమాధి యందుండగా నర్మదానదికి వరద వచ్చి రెండు తటములు ఒరసి పారుతూ ఉండెను. నదీ ప్రవాహధ్వని సమాధిస్థితుడైన గురువునకు భంగం కలుగకుండా శంకరుడు ఆనది నీటిని తన కమండలము నందు బంధించెను.

సమాధి నుండి గురువు లేచి ఈ అద్భుత కృత్య విషయం తెలిసికొని శంకరుని చేరపిలచి "నదీ జలాన్ని అంతటిని కమండలములో ఇమిడ్చివేసినాడు. బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయడానికి సమర్థుడు అని పూర్వము వ్యాసులవారు సెలవిచ్చి ఉన్నారు. ఆ మహిమ నీవు నెఱపినావు. కావున నీవు కాశీకి వెళ్లి విశ్వనాథుని అనుగ్రహం పొంది గ్రంథ రచన చేయుము" అని చెప్పారు.

గురువు అనుమతి పొంది శంకరుడు కాశీకి వెళ్లాడు. చోళదేశంనుండి అప్పుడు సనందుడు అనే శిష్యుడు వచ్చి శంకరుని వద్ద చేరెను. చిత్సుఖ్యుడు. ఆనందగిరి మున్నగు వారు అతని ముఖ్యశిష్యులలో మఱికొందరు.

మాధ్యాహ్నికాహ్నికై ఒకనాడు శంకరుడు గంగానదికి వెళుతూ ఉన్నాడు. తోవలో నాలుగు కుక్కలను తోలుకు వెళుతూ ఉన్న చండాలుడు ఒకడు అతనికి కనిపించాడు. అప్పుడు శంకరుడు అతనితో తోవ తొలగి పొమ్మన్నాడు. "నీవు తొలగి పొమ్మనేది దేహమునా! లేక చైతన్యమునా!

దేహమే అయితే మన యిద్దరి దేహాలు అన్నమయాలే కదా! చైతన్యమే అయితే మన యిద్దరి యందును ఉన్నది ఒకే చైతన్యం కదా! అన్నాడు. ఆ మాటలతో శంకరుడు ప్రబుద్ధుడయినాడు. ఆ ఉదుటులో కొన్ని శ్లోకాలు చెప్పాడు. వాటిని మనీషా పంచక మంటారు.

ఆ శ్లోకాలు విని చండాలుడు విశ్వేశ్వరుడుగా ప్రత్యక్షమయ్యాడు. వేదవ్యాసుడు వ్రాసిన బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయమన్నాడు.

అప్పుడు శంకరుడు బదరికాశ్రమానికి వెళ్లి సూత్రభాష్యాది గ్రంథాలు వ్రాశాడు. అప్పటికి శంకరునికి పన్నెండో సంవత్సరం, సనందుడు మున్నగు శిష్యులకు వానిని మొదట భోధించాడు.

ఈ సందర్భంలో అతని శిష్యులలో కొంచెం పొరపొచ్చాలు పుట్టాయి. శంకరుడు సనందుని పట్ల ఎక్కువ అభిమానంతో ఉన్నాడనే అసూయ ఇతర శిష్యులకు కలిగింది. ఈ విషయం శంకరుడు తెలిసికొన్నాడు. సనందుని గురుభక్తిని మిగతా శిష్యులకు చూపించాలను కొన్నాడు. సనందుడు ఏటికి ఆవల ఉన్నాడు. మిగతా శిష్యులతో శంకరుడు ఇవతలి ఒడ్డున ఉన్నాడు. అప్పుడు శంకరుడు సనందుని ఇవతలకు రమ్మని పిలిచాడు. లోతునీరు ఎట్లారానని అనకుండా సనందుడు ముందుకు అడుగు వేస్తాడు. తోడనే నీటిలో నుంచి ఒక పెద్ద పద్మం పైకి లేచింది. సనందుడు దాని మీద ఒక అడుగు వేశాడు. దాని ముందు మరో పెద్ద పద్మం లేచింది. అట్లా పద్మాలు లేస్తూ ఉండగా వాటిమీద నడుచుకుంటూ సనందుడు గురువు వద్దకు వెళ్ళాడు. సనందుని ఈ అద్భుత మహిమను చూచి మిగతా శిష్యులు అతని పట్ల తమకు గల ఈసును మానారు. అప్పటి నుంచి సనందుడికి పద్మపాదుడనే పేరు వచ్చింది.

కొంత కాలానికి పిమ్మట శంకరుడు ఒకనాడు గంగానదిలో స్నానం చేసి ఆహ్నికము చేసుకొని మణికర్ణికా ఘట్టంలో శిష్యులతో కలసి కూర్చుండి ఉన్నాడు. అప్పుడు అక్కడికి ఒక ముసలి బ్రాహ్మణుడు వచ్చాడు. అతనికి శంకరునికి వ్యాస సూత్రార్థాలను గురించి వారం రోజులు వాదం జరిగింది. అప్పుడు పద్మపాదుడు తన గురువు వాదించుచున్నది వ్యాసునితో అని గుర్తించి ఆ సంగతి బయట పెట్టెను. అప్పుడు శంకరుడు నా భాష్యము వ్యాస సమ్మతమేని వ్యాస భగవానుడు నాకు నిజరూపమును చూపునుకాక అని అన్నాడు. అంతట వ్యాసుడు సశిష్యుడుగా దర్శనమిచ్చాడు. అందుమీద

శంకరుడు వ్యాసునితో మీ సమక్షాన ఈ మణి కర్ణికా క్షేత్రంలో ఈ శరీరాన్ని వదలవలెనని అనుకుంటున్నాను అనెను. దానికి వ్యాసుడు "శంకరా! నీవు చేయవలసిన పని ఇంకా ఉంది. ప్రతి వాదులను జయించి అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేయవలసి ఉంది. నీకు ఆదిలో ఈశ్వరుడు ఎనిమిది సంవత్సరాల ఆయువు ఇచ్చాడు. నీ శక్తి వలన ఎనిమిది సంవత్సరాల ఆయుర్దాయం నీవు అదనంగా ఆర్జించుకొన్నావు. ఇప్పటి నుండి మరి ఒక పదహారు సంవత్సరాల ఆయుర్దాయం నీకు పరమేశ్వరుడు ఇస్తాడు." అని వ్యాసుడు అంతర్ధానమయ్యాడు.

అటు పిమ్మట కాలడిలో ఆర్యాంబకు అవసానకాలము ఆసన్న మయ్యెను. ఆమె కుమారుని తలచుకొనెను. అతడు వెంటనే తల్లి చెంతకు వెళ్లి ఆమెకు వలయు ఉపచారాలు చేసెను. ఆమె మరణింపగా తాను సన్యాసి అయి ఉండిన్నీ దహనాది కర్మలు స్వయంగా చేశాడు. సన్యాసి చేయకూడని పని అని కులమువారు తప్పు పట్టిన అతడు అంతగా పట్టించు కోలేదు.

అటు పిమ్మట శంకరుడు శిష్యులతో దిగ్విజయార్థము బయలు దేరి భారతదేశమంతా తిరిగాడు. మండన మిశ్రుని జయించాడు. అతడు శంకరుని శిష్యత్వమంగీకరించి సురేశ్వరాచార్యుడనే కొత్తపేరు స్వీకరించాడు. గోకర్ణ క్షేత్రసమీపమున బలి అగ్రహారంలో ప్రభాకరుడనేవాడు అద్వైతాన్ని హస్తామలకం వతుగా విప్పి చెప్పగా అతనిని హస్తామలక నామంతో సంబోధించి శిష్యునిగా స్వీకరించాడు.

శంకరుని శిష్యులలో గిరి అను పేరిటవాడు కొంచెము మందమతి. చదువు మీద కంటె గురుశుశ్రూష మీద అతడు శ్రద్ధ చూపువాడు. ఒకనాడు శిష్యుడు శంకరుని వద్దకు వచ్చి భాష్యపాఠము ప్రారంభింప నుండిరి. గిరి గురువు కాషాయ వస్త్రాలు ఉతుకుతూ అప్పటికి ఇంకా రాలేదు. గిరి వచ్చేవరకు కాస్తతాళండి అని గురువు అన్నాడు. మందబుద్ధి అయిన గిరి వచ్చే వరకు ఉండడం అనవసరం అనే ధోరణిలో శిష్యులు మాట్లాడారు. ఈ శిష్యుల గర్వాన్ని శంకరుడు గుర్తించాడు. తన అద్భుత మహిమ చేత గిరికి ఫదునాలుగు విద్యల్లో పాండిత్యం అలవడేటట్లు చేశాడు. అంతట అతడు తోటక వృత్తాలతో అద్వైతత్త్వమంతా విడమర్చి వర్ణించాడు. మిగతా శిష్యులు ఆశ్చర్య చకితులు అయ్యారు. గిరి అప్పటి నుంచి తోట కాచార్యుడనే ప్రసిద్ధినందాడు.

శంకరాచార్యుని ఇట్టి మహిమలు ఇంకా అనేకంగా ఉన్నాయి. వానిని శ్రీ దైవజ్ఞులుడు కోటీశ్వరశర్మ శాస్త్రి 'శ్రీమచ్ఛంకర భగవత్పాదా చార్యుల' చరిత్ర మున్నగు వాని యందు చూడదగును.

శంకరాచార్యుడు ఉత్తర భారతదేశ సంచారము చేయు సందర్భంలో కాశ్మీరదేశంలో శారదాదేవి పీఠం ఒకటి ఉందనీ, ఆ మఠానికి నాలుగు దిక్కులా నాలుగు ద్వారాలు ఉన్నాయనీ, సర్వజ్ఞుడయిన వాడు కాని ఆ ద్వారాలు తెరవచాలడనీ, తూర్పు, పడమటి, ఉత్తరద్వారాలు ఆయాదిక్కుల నుండి పండితులు వచ్చి తెరిచారనీ, దక్షిణ ద్వారం తెరవగల దక్షిణ ప్రాంత పండితుడు ఇంతవరకు రాలేదని, అది తెరవ గల పండితుడు లేనందున ఆ ద్వారం అట్లే మూతపడి ఉందనే జనశ్రుతి విన్నాడు. అప్పుడు అతడు కాశ్మీరానికి వెళ్లి అక్కడి పండితులతో వాదించి దక్షిణ ద్వారం తెఱచుకునేటట్లు చేసి విశేష కీర్తిని పొందాడు.

పిమ్మట శంకరాచార్యుడు మతకార్యనిర్వహణార్థము భారతదేశం నాలుగు మూలలా నాలుగు మఠాలు స్థాపించాడు. తూర్పున జగన్నాథంలో గోవర్ధన మఠం, పడమట ద్వారకలో శారదా మఠం, ఉత్తరాన కేదారములో జ్యోతిర్మఠం, దక్షిణాన శృంగేరిలో శృంగగిరి మఠం స్థాపించాడు. అతడు కేదారాన నివశిస్తూ ముప్పది రెండో ఏట కైలాసగమనం చేశాడు.

శంకరుని విషయంలో కొన్ని విశిష్టతలు ఉన్నాయి. బ్రహ్మచర్యాశ్రమం నుండే అతను సన్యాసాశ్రమం స్వీకరించాడు. సన్యాశి అయి ఉండిన్నీ తల్లికి అంత్యకర్మలు చేశాడు. డెబ్భైయి రెండు మతాల వారిని జయించాడు. శతాధికమైన ఉద్గ్రంథాలు రచించాడు. ఇది అంతా ముప్పైరెండేళ్లలో అతను పూర్తి చేశాడు. అతడు శంకరాచార్యుడు అనే ప్రధితయశాన్ని అందాడు. అతడు స్థాపించిన పీఠాధిపతులకు కూడ శంకరాచార్యనామం అనంతరకాలాన ఉట్టంకింపబడుతూ రాగా అతనికి ఆదిశంకరులు అనే పేరు వచ్చింది.

అతడు అద్వైత మత స్థాపనాచార్యుడు. అద్వైతమతము వేదాలలో, ఉపనిషత్తులలో, భగవద్గీతలలో ఉన్నదే. ప్రజలు దానిని మరిచిపోగా శంకరుడు తిరిగి దానిని వెలార్చెను. బౌద్ధమతములోని మంచి సిద్ధాంతాలను కూడ ఇందు చేర్చెను. అందుచేత దీనికి ప్రచ్ఛన్న బౌద్ధం అనే పేరు వచ్చింది.

# వైశాఖశుద్ధ షష్ఠి

## రామానుజాచార్య జయంతి

వైశాఖ శుద్ధ షష్ఠి రామానుజాచార్య జయంతి దినము. శంకర, రామానుజ, మధ్వ అను త్రిమతాచార్యులలో అతను రెండవవాడు. విశిష్టాద్వైత మతోద్ధారకుడు.

అతడు క్రీస్తు శకము 1017లో నలనామసంవత్సరం వైశాఖశుద్ధ షష్ఠి గురు వారము నాడు జనన మందెను. తండ్రి ఆసూరికేశవ పెరుమాళ్. తల్లి భూమి పిరట్టియార్, చెన్నపురి చెంతగల శ్రీ పెరుంబుదూరు అతని జన్మ స్థలము.

కేరళ పెరుమాళ్ కొడుక్కి ప్రాథమిక విద్య తానే చెప్పాడు. తరువాత కాంచీ పురానికి పంపాడు. అక్కడ అతడు యాదవ ప్రకాశులు అనే గురువు వద్ద వేదాంతం చదివాడు. రామానుజుల చుట్టము గోవిందభట్టు కూడ అప్పుడు అక్కడే చదువు కుంటూ ఉండెను.

యాదవ ప్రకాశుల వద్ద ఈ వేదాంతాభ్యాసము చిరకాలం సాగలేదు. మూలమునకు వ్యాఖ్యానం చేయడంలో గురువుకి శిష్యుడికి అభిప్రాయాలు భేదించాయి. స్థితి ఇట్లా ఉండగా స్థానిక రాజప్రముఖుని కూతురికి దయ్యము పట్టింది. యాదవ ప్రకాశుడు ప్రయత్నించి తన మంత్ర శక్తి చేత దయ్యాన్ని వదల్చలేక పోయాడు. అందుమీద రామానుజాచార్యులు ప్రయత్నించి తన మంత్ర శక్తి చేత రాజుకూతురు గ్రహ బాధ వదిల్చాడు.

అందుతో గురువుకి శిష్యుడి మీద ఊద పుట్టింది. రామానుజుల్ని చంపి వేయడానికి కుట్ర తలపెట్టాడు. గురువు కాశీకి ప్రయాణం కట్టాడు. శిష్యుల్ని కూడా తీసుకువెళ్లి మార్గము మధ్యలో అతన్ని మట్టుపెట్టడానికి ఏర్పాటు. రామానుజుడికి తప్ప ఇతర శిష్యులకు ఈ విషయం తెలిసింది. అందులో గోవిందభట్టు ఈ సంగతి రామానుజుడికి చెప్పేశాడు. ప్రయాణం ఎంతో దూరం సాగలేదు. ఒకరాత్రి రామానుజుడు తప్పించుకుని తిరిగివచ్చి కంచికి చేరుకున్నాడు.

అప్పుడు తల్లి ఉపదేశంపైన అతడు వివాహంచేసుకుని కంచి వరదరాజు స్వామి సేవలో కాలక్షేపం చేస్తూ ఉండినాడు.

ఆనాళ్లలో శ్రీరంగంలోని వైష్ణవుల గురువైన అళవందారు

రామానుజుని ప్రతిభ విన్నాడు. అతడు రామానుజుని తీసుకురమ్మని తన శిష్యుడైన పెరియనంబిని పంపాడు. ఇంతకుముందే రామానుజుడు అళవందారు ప్రతిష్టవిని ఉన్నాడు. అతన్ని చూడాలని ఈ వటికే అనుకుంటూ ఉండినాడు. కాగా వెంటనే అతడు శ్రీరంగానికి ప్రయాణమయ్యాడు.

అళవందారు అప్పటికి పండుముసలి. రామానుజుడు శ్రీరంగం వెళ్లే సరికి కొద్ది గంటల ముందు అళవందారు చనిపోయాడు. అతడు అళవందారుని శవాన్ని మాత్రం చూడగలిగాడు. ఆ శవంచేతి వేళ్లలో మూడు వింతగా ముడుచుకుని ఉన్నాయి. ఈ వింతయేమిటని రామానుజుడు అళవందారు శిష్యుల్ని అడిగాడు. అళవందారు కోరికలు మూడు నెఱవేఱకుండా ఉండిపోయాయి అనీ, అ వేళ్ల ముడుపు దానికి చిహ్నామనీ శిష్యులు చెప్పారు. ఆ మూడు కోరికలు ఏమిటంటే బ్రహ్మసూత్రాలకు, సహస్ర నామాలకు, తిరువాయి మొళికి సులభార్థబోధకమైన వ్యాఖ్యానాలు వ్రాయడం అని తేలింది. ఆ మూడు పనులు తాను చేస్తానని రామానుజుడు వాగ్దానం చేశాడు. ముడుచుకుని ఉన్న అళవందారు మూడు వేళ్లుతోడనే తెరుచుకున్నాయి.

అనంతరం రామానుజుడు కంచికి తిరిగి పోయాడు.

ఇట్లా కొంతకాలం గడిచింది. అళవందారు కోరికలు మూడున్నూ అట్లాగే ఉండిపోయాయి. అళవందారు ప్రధాన శిష్యుడైన పెరియనంబి వద్ద కొంతకాలం చదివి ఆ మీద గ్రంథ రచనకు పూనుకుందామని రామానుజుడు శ్రీ రంగానికి బయలు దేరాడు. మార్గమధ్యాన మధురాంతకంలోనే అతనికి పెరియనంబి దర్శనం దొరికింది. అక్కడే రామానుజుడు అతని శిష్యుడిగా చేరాడు.

ఇద్దరు కలిసి కంచికి వచ్చారు. విద్యాభ్యాసం మొదలయింది. ఆరుమాసాలు గడిచాయి. ఇంతలో ఇంట్లో పెరియనంబి భార్యకున్నూ రామానుజులు భార్యకున్నూ షష్టాష్టకమైంది. అందుచేత పెరియనంబి రామానుజుడి ఇంటిని వదిలి కంచి నుంచి శ్రీరంగం వెళ్లిపోయాడు.

తన భార్య కజ్జాకోరుతనంతో రామానుజుడు విసుగెత్తి పోయాడు. లోగడ రెండుసారులు అతను ఆమెను మన్నించి ఉన్నాడు. కాని ఈసారి అతడు ఇక సహించ లేకపోయాడు. తన భార్య గయ్యాళి తనం కారణంగానే

పెరియనంబి మనస్సులో నొచ్చుకొని కంచిని వదలి పోయాడు. ఇక తాను ఈ సంసార బంధానికి కట్టుబడి ఉండలేడు. కాగా అతడు అప్పుడు సన్యాశ్రమం స్వీకరించాడు.

అళవందారు పీఠాధ్యక్ష పదవిని చేకొనమని రామానుజుని వద్దకు శ్రీ రంగాన్నుంచి రాయబారులు వచ్చారు. అందుమీద అతడు శ్రీ రంగం వెళ్లాడు. విద్యకు, విమల వర్తనానికి పేరు మోసిన పెద్దల చేత అలంకరింపబడుతూ వచ్చిన ఆ అధ్యక్ష పీఠం మీద కూచోడానికి తనకు ఇంకా అర్హత లేదని రామానుజుడు సందేహించాడు. కాగా వైష్ణవాగ మములు అన్నీ క్షుణ్ణంగా చదవడానికి ప్రారంభించాడు. తిరుక్కోటి యూర్నంబి ప్రఖ్యాతివిని తన్ను శిష్యునిగా చేకొనవలసిందిగా రామానుజాచార్యులు ఆరుసారులు కోరాడు. అతనికి ఇంకా అర్హత రాలేదు. అని అతనిని ఆరు సారులు తిరగగొట్టాడు. ఏడోసారి గురువు అతనిని చేరబిలిచి మంత్రరహస్యం ఎవరికీ చెప్పననే వాగ్దానాన్ని పుచ్చుకుని శిష్యునిగా చేకొని మంత్రోపదేశం చేశాడు.

మోక్షం సంపాదించడానికి ఆ మంత్రానికి గల శక్తి అతనికి అంతలో తెలిసి పోయింది. చాలా ఆనందమైంది. ఆ ఆనందంలో ఈతను అందరినీ పిలిచి మంత్ర రహస్యం చెప్పేశాడు. ప్రేమను, సానుభూతిని అగ్గలముగా గర్భితమొనర్చు కొనిన అతని హృదయం మానవులకు సులభంగా మోక్షాన్ని ప్రసాదించే ఆ మంత్రాన్ని దాచుకోలేక పోయింది.

తన ఆజ్ఞను రామానుజుడు ఈ విధంగా మీరినందుకు తిరుక్కోటి యూర్నంబికి చాలా కోపం వచ్చింది. రామానుజుని తన ఎదుటికి పిలిపించు కొన్నాడు. తన మాట ఆ విధంగా జవదాటినందుకు అతను శాశ్వతంగా నరకానికి పోతాడని చెప్పాడు. జన సమూహం మోక్షం పొందడానికి తాను కారణం కాగలిగే పక్షంలో తాను నరకానికి పోవడానికి సంతోష పూర్వకంగా సంసిద్ధుడనై ఉంటానని రామానుజుడు నెమ్మదిగా జవాబు చెప్పాడు.

రామానుజుని ఖ్యాతి వైశాల్యానికి, ఉన్నతా దర్శానికి ఆగురువు అనంతంగా సంతోషించాడు. రామానుజుని ఆశీర్వదించి అతని ప్రయత్నం ఫలోదయాంత మవుతుందని చెప్పాడు.

రామానుజుని హృదయ వాడవాడలా పాకి పోయింది. తన సిద్ధాంతాల ప్రచారంలో అతను పలువురితో వాదిస్తూ వచ్చాడు.

యజ్ఞమూర్తి అనే అద్వైత వేదాంతి ఆ రోజుల్లో శ్రీ రంగం వచ్చాడు. అతనికి, రామానుజుడికి వాదం పడింది. ఆవాదం పదహారు రోజులు సాగింది. చివరికి రామానుజుడు జయించాడు. యజ్ఞమూర్తి వైష్ణవం పుచ్చుకున్నాడు. తనపేరు అలాల పెరుమాళ్ ఎంబెరుమానార్‌గా మార్చుకున్నాడు.

ఆ మీద రామానుజాచార్యులు బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాయడానికి పూనుకున్నాడు. బ్రహ్మసూత్రాలను గురించి బోధాయన వృత్తి వ్రాయడానికి పూనుకున్నాడు. బ్రహ్మసూత్రాలను గురించి బోధాయన వృత్తి అనే గ్రంథం సంపాదించడానికి అతడు ఉత్తర దేశానికి వెళ్లాడు. అతని శిష్యుల్లో ఒకడైన కురత్తాళ్వారు ఆ గ్రంథాన్ని కంఠపాఠం చేశాడు. గురువుకు కావలసినప్పుడల్లా అతడు ఆ గ్రంథాన్ని అప్పగిస్తూ ఉండినాడు. ఈ విధంగా సంసిద్ధుడై బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాశాడు. దానికి శ్రీ భాష్యం అని పేరు.

వేదాంతసారం, వేదాంత సంగ్రహం, వేదాంతదీపం అనే గ్రంథాలు వ్రాసి ముగించి అతడు శ్రీ భాష్యాన్ని పూర్తి చేశాడు. గీతకు కూడా అతడు భాష్యం వ్రాశాడు.

గ్రంథ రచన పూర్తి చేసి వానికి పండితామోదం సంపాదించడం కోసం వివిధ ప్రదేశాలకు వెళ్లాడు. కాశ్మీరంలో, పండిత మండలిలో అతడు ఆ గ్రంథాలను చదివి వినిపించాడు. ఆ పండితులు అతనిని ఆ గ్రంథాలను అభినందించారు.

తిరిగి వస్తూ అతడు తిరుపతిలో ఆగాడు. అక్కడ దేవస్థానములోని పూజాదిక విషయమై రెండు తెగల వారికి తగాదాగా ఉండినది. అందులో రామానుజుడు మధ్య వర్తిగా ఉండి దేవాలయంలో వైష్ణవ ప్రాబల్యానికి కట్టుదిట్టం చేశాడు.

అతను బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాయడంతో అళవందారు కోరికల్లో ఒకటి నెరవేరింది. మిగతా కోరికలు పూర్తి చేయడానికి అతను ఇప్పుడు పూనుకున్నాడు. కురత్తాళ్వారు కొడుకైన పరాశర భట్టు చేత సహస్రనామాలకు భాష్యం వ్రాయించాడు. రామానుజుని చుట్టము తిరుక్కురైప్పిరన్ పిళ్లర్ చేత 'తిరువాయిమొళి' మీద భాష్యం వ్రాయించాడు.

ఇట్లు తాను చేయవలసిన పనులు అన్నీ పూర్తి చేసి అతడు

ప్రశాంతంగా జీవిస్తూ మత ప్రచారం చేస్తూ ఉండినాడు. కాని ఇంతలో అతనికి మళ్లీ కష్టాలు కలిగాయి.

అప్పటి చోళరాజు కుళోత్తుంగుడు. అతడు శైవుడు. శివుడికి మించిన దైవం లేడనే సిద్ధాంతం అందరూ ఒప్పుకోవాలని అతడు నిర్బంధించాడు.

ఇది వైష్ణవమత ప్రచారకులకు గొడ్డలి పెట్టు అయింది. రాజు దర్శనానికి రావలసిందిగా రామానుజుడికి కబురు వచ్చింది. రాజు రామానుజుడికి ఏదో హాని తలపెట్టాడని అర్థమై పోయింది. కురత్తాళ్వారు రామానుజుడి దుస్తులు ధరించి రాజు వద్దకు వెళ్లాడు. రాజు శివుడు తప్ప మరోదైవం లేడనే సిద్ధాంతాన్ని ఒప్పుకోమన్నాడు. ఆళ్వారు అంగీకరించలేదు. అందుమీద రాజు అతని గ్రుడ్లు పీకించాడు.

ఈలోగా రామానుజుడు వాయసల బిత్తి దేవుని రాజ్యంలోకి పారిపోయాడు. కావేరి తీరం వెంబడినే ప్రయాణం చేస్తూ అతడు సాలిగ్రామం అనే తావు చేరి అక్కడ పన్నెండేళ్లు నివసించాడు. వాదంలో జైనులను ఓడించి బిత్తిదేవుని వైష్ణవుడుగా మార్చాడు.

అతని వద్ద తిరుమాన్ : (శ్రీచందనం) చెక్కలు అన్ని అయిపోయాయి. వానికోసం అన్వేషించడంలో ఈతనికి మేల్కోటలోని ఒక చిన్న దేవాలయం కనిపించింది. ఢిల్లీరాజు రాజభవనంలోని రామప్రియ అనే విగ్రహాన్ని తెచ్చి రామానుజుడు మేళ్‌కోటలో ప్రతిష్ఠించాడు. ఢిల్లీ నుంచి ఈవిగ్రహాన్ని తెస్తూ ఉండగా ఒకానొక గ్రామంలోని పంచములు అతనికి ఆశ్రయం యిచ్చారు. అందుకు మెచ్చి రామానుజుడు మేల్కోటలో రథోత్సవం జరిపే రోజున ఆ ఆలయంలో పంచములకు ప్రవేశం కలిపించాడు.

చోళరాజు కులోత్తుంగుడు మరణించాక రామానుజులు శ్రీరంగానికి తిరిగి వచ్చాడు. తన అనంతరం మత ప్రచారానికి డెబ్బైనలుగురు శిష్యులను నియమించాడు. అందులో నలుగురు ముఖ్యులు అతని భాష్యప్రతులకు పూటకాపులైరి. ఇతడు శ్రీరామానుజులు నూటఇరవై ఏళ్లు బ్రతికాడు.

ఇతడు వ్యాస సూత్ర భాష్యము, గీతాభాష్యము, తర్కభాష్యము మున్నగు గ్రంథాలు వ్రాయడం చేత భాష్యకారులు అనే పేరు వచ్చింది. ఎంబెరుమానారు అని అతనికి మరి ఒక పేరు. త్రిదండసన్యాసికావడం

చేత అతనికి యతిరాజు అనిన్నీ పేరు వచ్చింది. రామానుజుడు శేషాంశసంభూతుడని చెబుతారు.

ఈనాడు పుత్రప్రాప్తివ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి.

## వైశాఖశుద్ధసప్తమి

### గంగాసప్తమి

గంగోత్పత్తి కథను పురాణనామచంద్రిక ఇట్లు చెబుతూ ఉంది. "తన ముత్తాతలు అగు సగరపుత్రులు కపిల మహాముని యొక్క కోపాగ్ని చేత నీఱు కాగా వారికి సద్గతి కలిగింప తలంచి గంగను కూర్చి తపస్సు చేసి భూలోకమునకు దిగి వచ్చునట్లు భగీరథుడు ప్రార్థించెను. అప్పుడు ఆ మహానది తాను భూలోకమునకు వచ్చునెడ తన ప్రవాహ వేగమును ధరింప గల వారిని ఒకరిని ఏర్పఱుచు కొనిన పక్షమున తానువచ్చునట్లు ఒప్పుకొనెను. అంతట భగీరథుడు రుద్రుని గూర్చి తపము ఆచరించి అతని అనుగ్రహము పడసి గంగా ప్రవహమును వహింప ప్రార్థించెను. అపుడు గంగ మిక్కిలి అట్టహాసముతో భూమికి దిగిరాసాగెను. రుద్రుడు గంగను తన జటా జూటము నందు నిలిపి పిదప కొంతకాలమునకు భగీరథుని ప్రార్థనచే తన శిరస్సు నుండి ఏడుబిందువులను భూమిమీదకు వదలెను. ఆబిందువులు పడిన చోటు బిందుసరస్సు. అసరస్సు నుండి వెడలి ప్రవహించుచూ గంగ జహ్నుమహాముని యజ్ఞశాలయందు ప్రవేశింపగా అతడు కోపగించి దానిని పానముచేసి, పిమ్మట భగీరథుడు ప్రార్థింపగా ప్రసన్నుడై తన చెవి నుండి వెడల విడిచెను. ఇందువలన గంగకు జాహ్నవి అనుపేరు కలిగెను.

గంగా నది జహ్నుముని చెవినుండి పుట్టిన రోజు వైశాఖశుద్ధ సప్తమి. కాగా ఈరోజున గంగానదిలో స్నానం చేసి పూజ చేయాలి. శర్కరాసప్తమి, నింబాసప్తమి, అనోదనసప్తమి, ద్వాదశసప్తమి మున్నగు వ్రతాలు ఈనాడు చేస్తారని చతుర్వర్గ చింతామణి.

ఈనాడు పర్జన్యపూజ చేయాలని కూడా వ్రతగ్రంథాలు చెప్తున్నాయి.

## వైశాఖశుద్ధ అష్టమి

'దేవీపూజా అమ్రరసేన' అని స్మృతి కౌస్తుభము చెబుతూ ఉంది. దుర్గాష్టమి అని ఆమాదేర్ జ్యోతిషీ.

## వైశాఖశుద్ధ ఏకాదశి

### మోహిన్యేకాదశి

ధనవంతుడైన ఒక కోమటి తన ధనాన్ని అంతటినీ దుర్వ్యయము చేశాడు. అప్పుడు బంధువులు అతనిని యింటినుండి వెళ్లగొట్టారు. ఏమీతోచక అతడు ఒక అడవికి పోయి అందు తిరుగుతూ ఉన్నాడు. అక్కడ ఒకముని కనిపించి అతనికి ఏకాదశి వ్రతాన్ని ఉపదేశించాడు. ఆకోమటి ఈనాడు ఏకాదశీ వ్రతాన్ని చేసి పుణ్యం వలన తిరిగి ధనవంతుడు అయ్యాడు. అందువల్ల ఈ ఏకాదశి మిక్కిలి ఫలకారి.

## వైశాఖశుద్ధద్వాదశి

### పరశురామజయంతి

వైశాఖశుద్ధ తృతీయ పరశురామ జయంతిగా 'హిందువుల పండుగలు, పేర్కొంటూ ఉంది. వ్రతోత్సవచంద్రికాకారుడు కూడ ఇట్లే వ్రాయు చున్నాడు. మార్గశీర్ష బహుళ విదియ పరశురామ జయంతి అని మరి కొందరు. చతుర్వర్గ చింతామణి వైశాఖశుద్ధ ద్వాదశి జామదగ్న్య వ్రత దినము అని చెబుతున్నది. స్మృతి దర్పణము మున్నగు గ్రంథాంతరాలలో ఈనాడు మధుసూదన పూజా, వైష్ణవ ద్వాదశీ, రుక్మిణీ ద్వాదశీ వ్రతమ్ అని కలదు. మన పంచాంగాలలో ఈనాటి వివరణలో పరశురామ ద్వాదశి అని ఉంటుంది. కాగా ఈ దినమే పరశురామ జయంతి దినంగా చేకొనవలసి ఉంటుంది.

పరశురాముడు విష్ణువు యొక్క దశావతారాలలో ఆరో అవతారం. అతడు వైశాఖశుద్ధ ద్వాదశి నాడు రాత్రి మొదటి జామున పునర్వసు నక్షత్రంలో ఆరు గ్రహాలు ఉచ్చంలో ఉండగా పుట్టాడు. తండ్రి జమదగ్ని. తల్లి రేణుక. ఆమె క్షత్రియకాంత, ఇది ఒక అనులోమ వివాహము.

పరశురాముడు మిక్కిలి చిన్నతనంలో తన తండ్రి పితామహుడైన భృగువు ఆశ్రమానికి వెళ్లాడు. అతని తేజస్సుకు తాళలేక భృగుముని శిష్యులు కళ్లు మూసుకొన్నారు. ముత్తాత ఇతనిని హిమాలయ పర్వతాల మీదకు వెళ్లి శివుని గూర్చి తపస్సు చేయమన్నాడు. అతడు వెళ్లి తపస్సు ప్రారంభించాడు. శివుడు ప్రత్యక్షమై రామా! నీవు ఇంకా చిన్నవాడవు. రౌద్రాస్త్రాలు ధరించే శక్తి నీకు ఇంకా కలగలేదు. కొంతకాలం తీర్థయాత్రలు సాగించి తిరిగి రావలసింది అని చెప్పాడు.

తీర్థ యాత్రలన్నీ చేసి పరశురాముడు తిరిగి తపం ప్రారంభించాడు.

ఆ సమయంలో ఇం(ద్రాది దేవతలకు రాక్షస భాధ ఎక్కువ కాగా వారు శివుని శరణుచొచ్చారు. అపుడు శివుడు రాముని రప్పించి పరశువు అనే గం(డగొడ్డలి ఆయుధాన్ని ఇచ్చి దేవతల మీదికి పంపాడు. అప్పటి నుంచి అతడు పరశురాముడు అయ్యాడు. పరశురాముడు వెళ్లి స్వర్గలోకంలో రాక్షసులు లేకుండా చేశాడు.

ఆ పిమ్మట అతడు తల్లిదం(డ్రులను చూడ్డానికి వచ్చాడు. ఒకనాడు రేణుక నీళ్లు తేవడానికి ఏటికి వెళ్లింది. అక్కడ చి(త్రరథుడనే గంధర్వరాజు కుమారుడు తన భార్యతో జలవిహారం చేస్తూ ఉన్నాడు. తన కట్టి అదృష్టం లేకపోయింది కదా అని రేణుక చింతించింది. ఈ చింతనంతో ఆమె ఆ(శమానికి ఆలస్యంగా వెళ్లింది. ఆలస్యానికి కారణం ముని తెలుసుకున్నాడు. కళింకిత అయిన ఆమెను ఖండించవలసినదిగా జమదగ్ని కొడుకులను కోరాడు. మొదటి ముగ్గురు కొడుకులు ఆపని చేయడానికి ఒప్పుకోలేదు. నాలుగో కొడుకైన పరశురాముడు వెంటనే ఆమెను ఖండించాడు. అందుకు మెచ్చి తం(డ్రి కొడుకును ఏదైనా వరం కోరుకోమన్నాడు. అప్పుడు అతడు తనకు మాతృభిక్షపెట్టమని కోరాడు. అందుమీద జమదగ్ని రేణుకను పునర్జీవితను చేశాడు.

తన ఆయుధమైన గం(డగొడ్డలితో అతడు చేసిన ఘనకార్యాలు ఇట్టివి. నాడు తం(డ్రి ఆ(శమంలో లేడు. తల్లి దుఃఖిస్తూ తమ హోమధేనువు 'సురభి' ని కార్త వీర్యుడు అనేరాజు బలవంతంగా తోలుక పోయాడని చెప్పింది. రాముడు గం(డగొడ్డలి భుజాన వేసుకుని పోయి ఆ రాజును చంపి గోవును తిరిగి తీసుకువచ్చెను.

ఇందుకు పగబట్టి కార్తవీర్యుని కొడుకులె పరశురాముడు ఇంటలేని సమయంలో వచ్చి జమదగ్నిని చంపి వేశారు. రాముడు తిరిగి వచ్చేసరికి తల్లి తం(డ్రి శవం మీద పడి ఏడుస్తూ ఉంది. కొడుకుని చూచి ఆమె ఇరవైఒక్కసారులు గుండెలు బాదుకుని ఏడ్చింది. అప్పుడు పరశురాముడు ముయ్యేడు మారులు రాజుల మీద దండెత్తి గర్భాలలో నున్న పిండాలను కూడా చంపివేశాడు. తాను చంపిన రాజుల నెత్తుటితో పితరులకు తర్పణం చేశాడు. ఆ నెత్తురు శమంతపంచకం అనే పేరుతో అయిదు మడుగులు అయింది.

ఇట్లు రాజులను అందరినీ చంపి వేయడం చేత భూమి అంతా పరశురామునిదే అయిపోయింది. అప్పుడు పరశురాముడు యజ్ఞము చేసి ఆ భూమి అంతా కశ్యపాది బ్రాహ్మణులకు దానం చేసివేశాడు. ఆ పిమ్మట అతడు మహేంద్రగిరి మీద తపస్సు చేసికొనుటకు ఆశ్రమం నిర్మించుకొన్నాడు. నీవు దాన మిచ్చిన నేల మీద నీవు ఇక నివసింపకూడదని బ్రాహ్మణులు అన్నారు. అప్పుడు పరశురాముడు పడమటి సముద్ర తీరానికి వెళ్లి తన స్రువమును సముద్రంలోనికి విసిరాడు. అది రెండు యోజనాల దూరాన పడింది. ఆ ప్రదేశాన్నుండి సముద్రుడు ఉపసంహరించుకున్నాడు. ఆ కొత్తగా ఏర్పడిన ప్రదేశం పరశురాముడు తనకు నివాసంగా చేసుకున్నాడు. అదే మలబారుదేశం.

ఈగాథను పురస్కరించుకుని వ్రతోత్సవం చంద్రికా కారుడు. దక్షిణ భారతదేశంలో మలబారు వారది పరశురామశకం. పరశురాముడు ఉన్నచోట కరువు ఉండదంటారు. కాబట్టే మలబారులో ఎప్పుడూ కరువు ఉండదు.

మహేంద్రగిరి అనునది ఆంధ్రోత్కళ దేశాల సరిహద్దున ఒరిస్సా నుండి ఖాండవము (నేటి గోండ్వానా) వరకు వ్యాపించిన పర్వతము ఇది కుల పర్వతాలలో ఒకటి. మహేంద్రగిరి నుంచి తరలి పోయి అతడు మలబారులో వలస నెలకొన్నాడు.

పరశురాముని చేతలను శ్రీ ప్రతాపరెడ్డి ఇట్లు పరిమర్శించుచున్నారు.

"పరశురాముడు ఒక విధముగా గొప్ప సంస్కర్త. అతడు అనులోమ సంజాతుడు. అతడు క్షత్రియ స్త్రీయగు రేణుకకును, బ్రాహ్మణుడగు జమదగ్నికిని బుట్టిన వాడగుటచే నేటి ఆచారమును బట్టి సంకర జాతిలో చేరవలసినవాడు. కాని పూర్వకాల మందుండిన మర్యాదల వలన జామదగ్ని యొక్క యుత్పత్తి అనులోమ పద్ధతిచే సశాస్త్రీయమే.

పరశురాముని కాలమందు క్షత్రియులకును బ్రాహ్మణులకును జాత్యున్నతి విషయమై కలహములు జరుగుచుండెనని చరిత్రకారుల యభిప్రాయము. ఉత్కృష్టతకై పెనగుచుండిన బ్రాహ్మణ క్షత్రియ వివాదమును పరశురాముడు గొడ్డలితో తీర్చెను. ఇతని క్షత్రియ సంహారము నేటి వరకును చాలజాతులకు అనుకూలమగు నాధారముగా నేర్పడియున్నది. పతిహీనులైన క్షత్రియ స్త్రీలనుండి మిశ్రజాతులేర్పడినట్లు ఎందరో ప్రమాణములను కల్పించుకొనినారు.

మఱియు స్కాందపురాణములోని సహ్యాద్రి ఖండములో పరశురాముని గుఱించి ఇట్లు వ్రాసినారు. తాను కశ్యప బ్రాహ్మణునిచే వెడలగొట్టబడిన వాడై సహ్యాద్రిపర్వత ప్రాంతమందు నివసించి అందు బ్రాహ్మణుడు లేకుండుటను చూచి అచ్చటి ఆటవికులైన కొండ జాతివారి మెడలలో జందెములు వేసి వారిని బ్రాహ్మణులనుగా చేసెను.

ఇంతటి సంస్కార కార్యము సామాన్యమైనదికాదు."

బ్రాహ్మణుల పక్షము వహించి క్షత్రియులను సంహరించి సంఖ్యాధిక్యము కొఱకు ఆటవికులకు కూడ జందెమువేసి బ్రాహ్మణత్వమాపాదించి బ్రాహ్మణ పక్షపాతము చూపిన ఈ బ్రాహ్మణుడు బ్రాహ్మణ కులమునకే సాముదాయకముగా ఒక శాప మిచ్చినగాధ ఒకటి ఉంది. దానిని తర్కాచార్య, భాషాప్రవీణ శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి ఇట్లు చెప్పుచున్నారు.

"యజ్ఞము చేయించిన బ్రాహ్మణులకు పరశురాముడు తాను జయించిన భూభాగమంతయు దక్షిణగా నిచ్చి వేసెను. పిమ్మట ఒక చోట ఆశ్రమము వేసికొని జపము చేసికొనుచుండగా కొందరు బ్రాహ్మణులు వెళ్లి 'నీవు దాన మిచ్చి వేసిన భూమిలో నీవిక ఉండరాదు. దానమిచ్చినది తిరిగి పుచ్చుకొనరాదు అని కఠినముగా పలికిరి. దానితో కోపించి అతడు 'జపము చేసికొనుటకు కూర్చున్నంతనే భూమి పోవునా! ఇట్టి నీచస్వభావమే కాని ఉదార బుద్ధి మీకు లేదు. కానమీరెన్ని దానములు పట్టినను, ఎంతగా కష్టపడినను విద్యలు వచ్చునేకాని ధనమురాదు ! వచ్చినను నిలువ ఉండదు' అని శపించి తాను పడమర సముద్రతీరమునకు పోయెను.

పరశురామావతార విషయంలో కొన్ని విలక్షణాలు కనిపిస్తాయి. పరశురామావతారము తరువాతది రామావతారము. కాలములో, నామములో రెండూ సన్నిహితమైనవి. ఆజన్మ క్షత్రియ కులహంత అయిన పరశురాముడు క్షత్రియుడైన రాముని చేతులలో తుదకు ఓడిపోయాడు. శివధనుస్సు విరిచి వివాహితుడై వచ్చుచున్న రాముని ఎదిరించి పరశురాముడు భంగపడ్డాడు. విష్ణువు యొక్క ఒక అవతారము చేత మఱిఒక అవతారము ఓడింపబడిన సందర్భం ఇది ఒక్కటే.

పరశురామావతారము గురించి పద్మపురాణములో ఇట్లు ఉంది. "పరశురాముడు భగవచ్ఛక్త్యావేశావతారుండగుటంజేసి మహాత్ములును

భగవద్భక్తులును విశిష్టులునగు భాగవతోత్తములకుపాస్యుండు కాడు. రామకృష్ణావతారంబులు షడ్గుణ పరిపూర్ణంబులుగావున విశిష్ట భగవద్భక్త విప్రజనంబులకుపాస్యంబులై మోక్షంబులై మోక్షప్రదంబులగును."

## పరశురామకుండము

బ్రహ్మపుత్రనదీ తీరాన పరశురామ కుండం అనే తీర్థం ఒకటి ఉంది. పరశురాముడు ఆకుండంలో స్నానం చేసి తల్లిని చంపిన తన పాతకాన్ని పోగొట్టుకున్నాడు. ఇప్పటికిన్నీ పరశురామకుండం పెద్ద తీర్థంగా ఉంటూ ఉంది.

దశావతారాల్లో పరశురామావతారం ఆరోది. వైశాఖ శుద్ధ ద్వాదశినాటి రాత్రి మొదటి జామున పునర్వసు నక్షత్రంలో పరశురామావతారము ప్రారంభమైందని స్కాందపురాణ, నిర్ణయసింధువులు చెప్పుచున్నవి.

శ్రీ కృష్ణుని శ్రీ రాముని జయంతులు ఏమాదిరిగా జరుపుతున్నామో అట్లే పరశురామ జయంతి కూడా జరపవలసిందిగా మన శాస్త్రాలు ఆజ్ఞాపిస్తున్నాయి. కాని ఈ జయంతి అంత విశేష ప్రచారంలో లేదు. ఉత్తర హిందూ స్థానంలో మధుర, వారణాసి నగరాల్లో ఈ జయంతి విశేషంగా చేస్తారు.

అస్సాముదేశంలో కామాక్షిదేవి గుడి వుంది అదే జమదగ్ని ఆశ్రమం అని చెబుతారు. ఆ ప్రాంతంలో పరశురామాలయం కూడా వుందని తెలుస్తూ వుంది.

దక్షిణ భారతదేశంలో మలబారు భూమి వున్నచోట కరువు వుండదట. రత్నగిరిలో పరశురామమందిరం వుంది. అక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. **- వ్రతోత్సవ చంద్రిక**

ఈ రోజున పరశురాముడికి అర్ఘ్యం ఇస్తే శత్రునాశనమవుతుంది.

## వైశాఖశుద్ధ చతుర్దశి

## నృసింహజయంతి

స్మృతిదర్పణము, గదాధరపద్ధతి, పురుషార్థ చింతామణి, చతుర్వర్గ చింతామణి మున్నగు గ్రంథాలన్నీ వైశాఖ శుక్ల చతుర్దశిని నరసింహ చతుర్దశి వ్రతదినంగా పేర్కొంటున్నాయి. కాగా ఈనాడే నృసింహ జయంతి అని కంఠోక్తిగా చెప్పవచ్చు.

విష్ణుమూర్తి పది అవతారాలలో నరసింహావతారము నాలుగోది.

హిరణ్యకశిపుడు రాక్షసరాజు. అతని భార్య లీలావతి. ఆమె గర్భవతి అయి వుండగా హిరణ్యకశిపుడు తపస్సుకు వెళ్ళేను. అదే మంచి అదనని దేవతల రాజు ఇంద్రుడు రాక్షస సంహారానికి ప్రారంభించెను. లీలావతి గర్భమందున్న పిండమును కూడ చంపడానికి అతడు ప్రయత్నించెను. అప్పుడు నారదుడు అడ్డుపడి ఆమెను తన ఆశ్రమానికి తీసుకువెళ్లి కాపాడాడు. ఆమె గర్భస్థశిశువుకు అతడు విష్ణుభక్తి బోధించాడు.

తపస్సు వలన బ్రహ్మను మెప్పించి హిరణ్యకశిపుడు తనకు నరులచేకాని, మృగములచేకాని, పగలుకాని, రాత్రికాని, ప్రాణమున్న వానిచేకాని, ప్రాణము లేనివానిచే కాని చావులేకుండేటట్లు వరాలు పొందాడు.

ఆమీద అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. తాను లేనపుడు తన భార్యను అరసి రక్షించినందుకు నారదునకు కృతజ్ఞత తెలిపి భార్యను ఇంటికి తీసుకువెళ్లాడు. పుట్టిన బిడ్డడికి ప్రహ్లాదుడు అని పేరు పెట్టాడు.

వరగర్వంతో అతడు దేవతలను బాధపెడుతూ వచ్చాడు. అతడు విష్ణుద్వేషి. అతని కుమారుడు విష్ణుభక్తుడు.

కొడుకు మనస్సు మార్చడానికి తండ్రి అనేక విధాల ప్రయత్నిస్తాడు. కాని కార్యంలేక పోతుంది. తుదకు ప్రాణం విసిగి తండ్రి కొడుకుని విష్ణువు ఎక్కడ ఉన్నాడు అంటాడు. అప్పుడు ప్రహ్లాదుడు

**క. ఇందుగలండందు లేడని**
**సందేహమువలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందువెదకి చూచిన**
**నందందే కలడు దానవాగ్రణి వింటే!**

అంటాడు. అట్లా అయితే ఈ స్తంభంలో విష్ణువు ఉన్నాడా! అని హిరణ్యకశిపుడు ఒక స్తంభాన్ని తన్నుతాడు. అప్పుడు ఆ స్తంభం విచ్చుపోతుంది. అందులో నుండి విష్ణుమూర్తి నరసింహరూపంతో బయటకు వెడలి వస్తాడు.

బ్రహ్మయిచ్చిన వరాలకు ప్రత్యవాయం లేకుండా సగము మనిషి సగము మృగము రూపు ధరించి పగలు రాత్రి కాని సంధ్యాకాలంలో ప్రాణం

కలవని కాని లేనివని కాని చెప్పడానికి వీలులేని గోళ్లతో చీల్చి రాక్షసుని చంపివేశాడు.

**"ఉగ్రవీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖం**

**నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుంనమామ్యహం".**

అనే మంత్రంతో ఈదినమున నరసింహమూర్తిని పూజిస్తే శత్రుజయం కలుగుతుంది. నృసింహ చతుర్దశి వ్రతాన్ని హేమాద్రి, నృసింహపురాణం, స్కాంద పురాణాలు వివరిస్తూ వున్నాయి.

వైశాఖశుక్ల చతుర్దశినాడు ఈ వ్రతం చేయాలి. "వైశాఖ శుక్ల చతుర్దశి నాటి రాత్రి నేను పుట్టితిని. కాబట్టి ఆనాడే వ్రతము చేయుటకు తగిన రోజు' అని నృసింహస్వామి వచించినట్లు కలదు.

"వైశాఖ శుక్ల చతుర్దశి సోమవార స్వాతీనక్షత్రం ప్రదోషకాలంలో నృసింహస్వామి అవతరించాడు. స్వాతి నక్షత్రం శనివారం సిద్ధియోగంలో వణిజమను కరణంలో ఈ వ్రతం చేయడం పరమశ్రేష్ఠము. కాని ఈ విధమైన యోగం కలిసిరావడం చాలా కష్టము. ఆయోగం కుదిరిన నాడు నాపుట్టిన రోజు ఈ వ్రతం చేయతగింది. నావ్రతం చేయడానికి అన్ని వర్ణాలవారికి అధికారముంది." అని నృసింహస్వామి వచించినట్లు స్కాందపురాణంలో కలదు. ఈ వ్రతం చేయడానికి అన్ని వర్గాల వారికి అధికారం ఉన్నట్లు చెప్పబడ్డా ఇది ఇప్పుడు వైష్ణవులే ఎక్కువగా చేస్తున్నారు.

వ్రతవిధి, వైశాఖశుక్ల చతుర్దశినాడు ఈ వ్రతం చేయాలి. ఆ రోజున ఎట్టి పాపంకాని చేయకూడదు. మధ్యాహ్నం స్నానం చేయాలి. గోమయశుద్ధమైన యింట అష్టదళపద్మం పెట్టి కలశ స్థాపన చేయాలి. ఆ కలశం మీద బియ్యంతో నిండిన వెదురు గొట్టం వుంచాలి. అక్కడ లక్ష్మీనారాయణుల విగ్రహాలు వుంచాలి. శాస్త్రాచారప్రకారం వ్రతం జరపాలి. ఆ కాలంలో దొరికే పూవులతో పూజచేయాలి. రాత్రి జాగరణ చేసి పురాణకాల క్షేపం చేయాలి. మరునాటి ఉదయాన్ని తిరిగి పూజ చేయాలి. తరువాత యథాశక్తి నృసింహప్రతిమాదానాలు, భోజనాలు.

మూల్టాన్‌లో నృసింహ జయంతి గొప్పగా సాగిస్తారు. ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడు ఆ వూరివాడట. ఆ సందర్భ చిహ్నాలు ఇప్పటికి కూడా అక్కడ వున్నాయి.

దక్షిణ దేశంలో నృసింహజయంతిపర్వ సందర్భంలో దీపోత్సవాలు జరుగుతాయి. ఊరేగింపులు చూడతగ్గవి. హంపిలోని దేవాలయం చాలా గొప్పది. జయపుర సంస్థానంలో ఖండేలా అనే చోట పన్నెండు చేతులు గల అపూర్వ నృసింహ విగ్రహం కలదు.

మధుర, అయోధ్యనగరాల్లో నృసింహలీల అనే ఉత్సవం జరుగుతుంది. మాళవదేశంలో ఊరేగింపు.

-వ్రతోత్సవ చంద్రిక

విధ్యుక్త నృసింహ జయంతిని జరపడం వల్ల సకలపాపాలు, సమస్తగ్రహ బాధలు తొలగిపోతాయి. వైష్ణవులు ఈనాడు సాయంకాలం వరకు ఉపవాసం ఉంటారు. నృసింహస్వామిని పూజించిన రాత్రి విందు భోజనాలు. పానకము నరసింహస్వామికి ప్రియమైన నివేదన.

**తప్తహాటక కేశాంత జ్వలత్పావకలోచన**

**వజ్రాధికన స్పర్శ దివ్య సింహా నమోస్తుతే.**

## వైశాఖశుద్ధ పూర్ణిమ

ఇరవైయేడు నక్షత్రాలలో విశాఖ పదహారోది. విశాఖ అయిదు నక్షత్రాల కూటమి. అది కుమ్మరి సారెలాగున ఉంటుంది. విశాఖకు కాంతిని వ్యాపింప చేసేది అని అర్థం. అట్టి విశాఖ నక్షత్రంతో కూడిన పున్నమకు వైశాఖి అని పేరు. ఏమాసంలో వైశాఖి పూర్ణిమ వస్తుందో ఆమాసానికి వైశాఖ మాసమని పేరు. వైశాఖిని మహావైశాఖి అని గొప్పగా చెబుతారు.

వైశాఖ పూర్ణిమనాడు సముద్ర స్నానం చేయాలి. అది అఘునాశనిగా ఉంటుంది. ఈనాడు ధర్మరాజు ప్రీతిని కోరి నానావిధ దానాలు చేయాలనీ ఈనాడు చేసేదానాలు అనంత ఫలాన్ని ఇస్తాయనీ తిధితత్వము చెబుతూ ఉంది. ధర్మరాజు ప్రీతి కొరకు ఈనాడు నానావిధ దానాలు చేయాలని స్మృతికౌస్తుభము.

ఈనాడు బుద్ధజన్మ మహోత్సవమని నీలమత పురాణము చెబుతున్నది.

మహావైశాఖీ పుణ్యదినాన మహోదధిలో స్నానం చేసి పురుషోత్తమ దర్శనం చేస్తే కోటి జన్మాలలోని పాపం పోతుందని, గంగా ద్వారే విశిష్ట ఫలదా అనీ అంటారు.

ఈనాడు సోమవ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి. ఈనాటి

దానం అనంతఫలాన్ని ఇస్తుందని తిధితత్వము.

వైశాఖ పూర్ణిమను పంచాంగ కర్తలు 'మహావైశాఖీ' అని అంటారు.

అరవవారు 'వెయ్‌కాసి విశాఖ' అంటారు. వెయ్‌కాసి అనేది విశాఖ మాసానికి అరవపేరు. ఆమాసంలో విశాఖ నక్షత్రం వచ్చేనాడు అనగా విశాఖ పూర్ణిమనాడు వారు ఒక పండుగ జరుపుతారు. యమధర్మరాజు ఆనాడు పూజలు అందుతాడు.

సుబ్రహ్మణ్యస్వామి విశాఖ పూర్ణిమనాడు అవతారమెత్తినట్లు చెబుతారు.

నమ్మాళ్వారు అనే వైష్ణవ స్వామి పూర్ణిమనాడే పుట్టువునొందాడని చెబుతారు. కూర్మావతారం కూడా ఈనాడే ప్రాదుర్భవించింది. అందుచేత ఈనాడు కూర్మజయంతి జరుపుతారు. ఇట్లని కొన్ని పురాణాలు. దశావతారాల్లోను రెండు అవతరాలు ఈనాడే ప్రారంభం కావడం గమనింప తగ్గది. కూర్మావతారమే కాక బౌద్ధవతారం కూడా ఈనాడే.

వైశాఖ మాసంలో ఎండలు బాగా ముదురుతాయి. రాత్రి పగలు బాగా ఉక్కపోస్తూ ఉంటుంది. కాగా మన పెద్దలు ఈనాడు దధ్యన్న, వ్యజన, ఛత్ర, పాదుకోపానహమున్నగుదానాలు, కృష్ణాజినదానం, ఉదకుంభదానం మున్నగు దానాలతో వైశాఖ పూజచేసే ఆచారాన్ని ఏర్పాటు చేశారు.

తులసి, అశ్వత్థమున్నగు వృక్షాలకు ఈ మాసంలో నీళ్లు పోయడం పుణ్యకార్యం.

నమ్మాళ్వారు గొప్పవైష్ణవఋషి. అతడు వేదాలను అరవంలో చెప్పాడు. తిరునల్వేలిజిల్లా తిరునగరిలో అతడు ఒకానొక వైశాఖ పూర్ణిమనాడు పుట్టువునొందాడు. అందుచేత ఆనాడు తిరునగరి దేవాలయంలో గొప్ప ఉత్సవం చేస్తారు. ఆ వూరికి ఆళ్వారు తిరునగరి అనే పేరు వచ్చింది.

తంజావూరు చెంతగల తిరుమాఘువాడిలో కూడ విశాఖ పూర్ణిమ ఉత్సవం చేస్తారు. అక్కడ ఒకానొక వైశాఖ పూర్ణిమనాడు శివుడు గొప్పగా నాట్యం చేశాడనీ, మరి ఒక వైశాఖ పూర్ణిమనాడు ఈశ్వరుని నంది వాహనం అక్కడ పుట్టువు నొందిందనీ చెబుతారు. అందుచేత అక్కడ విశాఖ పూర్ణిమ ఉత్సవం గొప్పగా సాగుతుంది.

విశాఖ పూర్ణిమ నాడు బ్రహ్మపురాణమును దానమిస్తే బ్రహ్మలోక ప్రాప్తి కలుగునని చెబుతారు.

## బుద్ధ జయంతి

వైశాఖ పూర్ణిమ బుద్ధ జయంతి దినం.

బుద్ధుని జీవిత కాలంలో వైశాఖ పూర్ణిమ మూడు సారులు అత్యంత ప్రాముఖ్యాన్ని వహించింది.

అతడు ఒకానొక వైశాఖ పూర్ణిమనాడు పుట్టువు నొందాడు.

మరి ఒక వైశాఖ పూర్ణిమనాడు అతడు బుద్ధుడు అయ్యాడు.

వేఱొక వైశాఖ పూర్ణిమనాడు అతడు నిర్యాణము చెందాడు.

ఈ విషయాన్ని సూర్యప్రకాశ అనువారు స్టేట్సుమెన్ పత్రికలో ఒక కథగా ఇట్లా చెబుతున్నారు.

"నాడు వైశాఖ పూర్ణిమ. రెండువేల ఐదువందల ఎనభై సంవత్సరాలకు మునుపు నేడు నేపాళము అనిపిలవబడే హిమాలయసానుప్రదేశాల చెంత శాక్యులను తెగవారు నివసిస్తూ ఉండిరి. వారికి కపిలవస్తు అనే నగరం రాజధాని. కపిలవస్తు రాజనగరిలో రాణి మాయాదేవికి నీళ్లాడ ప్రొద్దులు అయ్యాయి. అట్టి సమయంలో ఆమె తన పుట్టినింటికి పోవాలనే కోరికను వెల్లడించింది. రాజు వెంటనే పాలకీ బోయీలను రప్పించి ప్రయాణ సన్నాహాలు చేశాడు.

ఆమె పుట్టినిల్లు తోడిశాక్య ప్రజాసత్తాక రాజ్యమైన దేవదహనగరం. కపిలవస్తునుండి దేవదహకు పోయేదారి లుంబినీ వనం అనే అడవి గుండ పోతుంది. అక్కడ సాల వృక్షాలు సాంద్రంగా ఎదిగి ఉన్నాయి. ఆవన మధ్యంలో ఒక చక్కని తామర కొలను ఉంది. పుష్పించిన సాలవృక్షాలు చుట్టుబారలు తీరి ఉండగా ఆ కొలను ప్రశాంతంగా ఉంది.

పల్లకి అక్కడకు వచ్చింది. మాయాదేవి నొప్పులు ప్రారంభ మయ్యాయి. పల్లకీ ఆపమని ఆమె ఆజ్ఞాపించింది. ఆమెతో కూడా ఆమె సోదరి ఉంది. పురిటి సమయం ఆసన్నమైందని ఆమె గ్రహించింది. ఆదరాబాదరా అక్కడ బాగుచేసి పురుడు పోసుకోవడానికి అనువు పరచారు. కొద్ది నిముషాల అనంతరం అక్కడ మాయాదేవి మగశిశువును ప్రసవించింది. అతడే గౌతముడు.

ముప్పైఐదు సంవత్సరాల అనంతరం మళ్లీ అది ఒక వైశాఖ పూర్ణిమాదినం. ఆ వైశాఖపూర్ణిమాచంద్రుడు నేటి బీహారులోని గయ చెంతగల ఒక మట్టి వృక్షము మీద వెన్నెల వెదజల్లుతూ ఉన్నాడు.

అప్పటి ఆరేళ్ల పూర్వం గౌతముడు పెళ్లాన్ని, పిల్లవాడిని, రాజ్యాన్ని

వీడి మానవలోకం నుంచి దుఃఖాన్ని పారద్రోలడానికి పరిశ్రమిస్తూ శాక్యముని అయ్యాడు. సన్యాసుల సాంగత్యము, ఉపవాసాలు, జపాలు, తపాలు ఏమీ కార్యకారులు కాలేదు. తుదకు అతడు మఱ్ఱి వృక్షము క్రింద కూర్చుని కొత్త వెలుతురు కోసం చిత్తాన్ని సమీకృతం చేశాడు.

వైశాఖ పూర్ణిమా చంద్రుడు దివ్యంగా ప్రకాశిస్తూ ఉండగా అతనికి ప్రబోధము కలిగింది. ఆ సమయంలో అతనికి ఆశ్రయం యిచ్చిన మహా వృక్షము బోధి వృక్షమైంది. ప్రదేశం బుద్ధగయ ఐంది. అతడు బుద్ధుడు అయ్యాడు.

నలభైఐదు సవంత్సరాల అనంతరం మళ్లీ అది ఒక వైశాఖ పూర్ణిమా దివసం. అతడు బుద్ధుడు ఐన తరువాత వర్షాకాలాల్లో తప్ప మిగతా అన్ని కాలాల్లో దేశదేశాల వెంట తిరుగుతూ బౌద్ధమత సిద్ధాంత ప్రచారం చేస్తూ వచ్చాడు. కాని ఇప్పుడు అతడు బాగా వృద్ధుడు అయ్యాడు. తన చరమకాలాన్ని అతడు పాటలీ పుత్రం, వైశాలిమున్నగు నగరాల్లో కాక ఒక పల్లెపట్టున గడపాలనుకున్నాడు. ఆనందుడు అనే ముఖ్య శిష్యునితో కలసి అతడు ఒక సాలవృక్షాల అరణ్యంలోకి వెళ్లాడు. అక్కడ ఆనందుడు రెండు సాలవృక్షాల నడుమ కొమ్మలతో ఒక చిన్న మంచంతయారు చేశాడు. అక్కడే బుద్ధుడు నిర్యాణం చెందాడు. ఆప్రదేశం కుసినర అనే ప్రఖ్యాతి నందింది.

లుంబిని వనంలో సాలవృక్షచ్ఛాయలలో వైశాఖ పూర్ణిమనాడు అతని జననం.

గయలో మఱ్ఱిచెట్టుక్రింద వైశాఖపూర్ణిమనాడు ఈతడు బుద్ధుడు అయ్యాడు.

కుసినర గ్రామంలో సాలవృక్షాల క్రింద వైశాఖ పూర్ణిమనాడు అతని నిర్యాణం.

బుద్ధుని జీవితంలో ఇవి ముఖ్యఘట్టాలు. ఈ మూడు ముఖ్య ఘట్టాల్లో ప్రదేశాలు మారాయి. చెట్లుమారాయి. తిథి మాత్రం మారలేదు.

అందుచేత వైశాఖ పూర్ణిమ బౌద్ధులకు మహా పర్వమై ఉంది. గౌతముని బుద్ధునిగా చేసిన బోధి వృక్షము పూజా భాజనమైంది.

వైశాఖ పూర్ణిమనాడు బోధి వృక్షానికి పూజచేసే ఆచారం బుద్ధుని జీవిత కాలంలోనే ప్రారంభమైంది.

జేతవన విహారంలో బుద్ధుడు మకాము చేసి ఉన్న రోజులలో ఒకనాడు

భక్తులు పువ్వులు తెచ్చారు. కాని ఆసమయంలో బుద్ధుడు ఎక్కడికో వెళ్లి ఉన్నాడు. భక్తులు బుద్ధుని దర్శనం కోసము చాలాసేపు వేచి ఉన్నారు. ఎంత సేపటికిన్నీ బుద్ధుడు రాలేదు. బుద్ధుని దర్శనం కాక భక్తులు నిరుత్సాహులై ఆ పువ్వులు అక్కడే వదలి వేసి వెళ్లిపోయారు. జేతవన విహారదాత అనంత పిండకుడు పరిస్థితి చూచాడు. పూజకు వినియోగం కావలసిన ఆ పుష్పాలు అట్లా అక్కడ నిరుపయోగం కావడం అతనికి నచ్చలేదు. కాగా బుద్ధుడు రావడంతోటే అనంత పిండికుడు ఈ విషయం చెప్పాడు. అతను లేనప్పుడు కూడా పూజ సాగడానికి అక్కడ ఏదైనా వస్తువును ఉంచి వెళ్లవలసిందని కోరాడు. శారీరక పారిభాగాది (అవయవాలు) పూజలు అతను ఒప్పుకోలేదు. బోధివృక్షం పూజకు మాత్రం అతను అనుమతించాడు. తన జీవితకాలంలోనూ, తదనంతరమూ ఈ ఒక్క విధమైన పూజ సాగడమే తనకు సమ్మతమైందని అతడు చెప్పాడు.

అందుమీద జేతవన విహారంలో ఒక బోధి వృక్షాన్ని నాటి పెంచడానికి ఆనందుడు నిర్ణయించాడు. గయలోని బోధివృక్షం నుండి విత్తనం తెప్పించి నాటారు. అప్పుడు ఒక గొప్ప ఉత్సవం సాగింది. కోసలదేశపు రాజు తన ఉద్యోగులతో, అనుచరులతో వచ్చి ఈ ఉత్సవంలో పాల్గొన్నాడు. వేలాది బౌద్ధభిక్షకులు వచ్చారు.

ఆనాటి నుంచి బోధివృక్ష పూజ బౌద్ధులలో ప్రబలింది. ఆ పూజ ఏడాదికి ఒకసారి వైశాఖ పూర్ణిమనాడు సాగించడం ఒక ఆచారమైంది. ఇప్పుడు బౌద్ధమతం ప్రబలి ఉన్న అన్ని దేశాల్లో వైశాఖ పూర్ణిమనాడు బోధి వృక్షపూజ సాగుతూ ఉంది.

ఆనాడు బౌద్ధులు బోధి వృక్షానికి జెండాలు కట్టి, దీపాలు పెట్టి మొదట్లో పరిమళజలాన్ని పోస్తారు. హీనయాన బౌద్ధమతాన్ని అవలంబించే బర్మాలో ఈ ఉత్సవం ఈనాటికిన్నీ చూడతగి ఉంటుంది. రంగూను, పెగు, మాండలే మున్నగు బర్మాబస్తీల్లో ఈ పండుగను నితాంత వైభవంతో చేస్తారు. ఈ ఉత్సవం కొంచెం ఇంచుమించు రోజల్లా ఉంటుంది. ప్రతి ఇంటిలోని స్త్రీలు పరిమళ జలభాండాన్ని తలపై ధరించి బయలు దేరుతారు. మేళతాళాలు ఉంటాయి. వెనకనుంచి దీపాలు, జెండాలు పట్టుకు వస్తారు. బస్తీ నాలుగు మూలలనుంచీ ఇట్లా బయలు దేరిన ఉత్సవాలు సాయంకాలానికి ఒక చోట కలుసుకుంటాయి. సమ్మర్దదారుణమైన ఆ ఊరేగింపు బౌద్ధాలయానికి వెళుతుంది. లోపలి దేవాలయానికి ముమ్మారు

ప్రదక్షిణం చేస్తారు. ఆ మీద కుండల్లో నీరు వృక్షం మొదట్లో పోస్తారు. దీపాలు వెలిగిస్తారు. చెట్టుకి జెండాలు కడతారు. హిందువులు ఆచరించు 'వట సావిత్రి' మున్నగు వ్రతాలు ఈ బౌద్ధ పర్వం ఛాయవే అని అంటారు.

**శరభజయంతి**

వైశాఖ శుద్ధ చతుర్దశినాడు విష్ణువు నరసింహావతారము ఎత్తాడు.

హిరణ్యాకశిపుని కోసమే ఆ అవతారము. కాని హిరణ్యాకశిపుని సంహరించిన తరువాత కూడా నరసింహమూర్తికి ఉగ్రము తగ్గలేదు. అప్పటి అతని రౌద్రము చూచి అందరూ భయపడ్డారు. తుదకు లక్ష్మీదేవి కూడ ఆ రౌద్రాన్ని తగ్గించలేకపోయింది. అప్పుడు దేవతలు శివుణ్ణి ప్రార్థించారు. అతడు శరభావతారం ఎత్తాడు. వైశాఖ పూర్ణిమ నాడు శివుడు శరభావతారాన్ని ఎత్తాడు. కాబట్టి ఆనాడు శరభజయంతి. శరభం ఎనిమిది కాళ్ల జంతువు. అది సింహాన్ని చంపగలిగే శక్తి కలది. ఆశరభము ఆ సింహాన్ని చంపి వేసింది. శరభరూపాన శివుడు నరసింహమును చంపి ఆ చర్మమును ఒలిచి కప్పుకున్నాడు.

**కూర్మ జయంతి**

వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు కూర్మజయంతి అని ఆమాదేర్ జోతిషీ అనే గ్రంథం చెబుతోంది.

పుష్య శుక్ల ద్వాదశి నాడు కూర్మద్వాదశీ వ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి చెబుతూ ఉంది.

కూర్మవతారము విష్ణువు యొక్క దశావతారాలలో రెండోది.

దేవతలును, రాక్షసులును పూర్వము అమృతము కోసము ప్రయత్నం చేసినారు. పాలసముద్రాన్ని మథిస్తే అమృతము వస్తుందని వారు తెలుసుకొన్నారు. అప్పుడు వారు మందర పర్వతాన్ని కవ్వముగానూ, వాసుకి అనే నాగరాజును కవ్వపుతాడుగానూ చేసి సముద్రమథనానికి ప్రారంభం చేశారు. కవ్వపుతాడును ఒకకొస దేవతలు పట్టుకున్నారు. రెండవ కొసరాక్షసులు పట్టుకున్నారు. చిలకడం ప్రారంభమైంది. భారానికి మందరపర్వతం క్రిందికి దిగిపోతూ వచ్చింది. వాళ్లకు ఏమిచేయడానికి తోచింది కాదు. భగవంతుని ప్రార్థించారు. అప్పుడు విష్ణువు పెద్దతాబేలు రూపాన్ని ధరించాడు. మందరగిరిని తన వీపుమీద మోచి పైకి ఎత్తి సముద్ర మథనానికి వీలు కలిగించాడు.

కూర్మావతారము ఆంధ్రదేశంలో పూజితమవుతూ ఉంది.

శ్రీకాకుళానికి నలభై మైళ్ల దూరంలో వంశధారాతీరాన ఉన్న శాలిహుండాం కొండకు కూర్మాద్రి అనే పేరు ఉంది. శ్రీకాకుళానికి పది మైళ్లదూరంలో సముద్రానికి ఒకటిన్నర మైళ్లదూరంలో శ్రీకూర్మం అనే ఊరు ఉంది. అక్కడ వైష్ణవాలయంలో కూర్మావతారం కూర్మనాయకులు అను పేర పూజలు అందుతూ ఉంది. కూర్మనాథ స్వామికి అనగా కూర్మావతారరూపి అయిన భగవంతుడికి ఆలయం భారతదేశంలో మరి ఒక చోట ఉన్నట్లు కానరాదు. ఆంధ్రప్రదేశ్ విషయంలో ఇది ఒక విశిష్టతగా మనం చెప్పుకొనవచ్చు.

కావున ఈ ఆలయమును గురించి కొంచెం విపులంగా తెలుసు కొందాము. "తాబేలు రూపమున శ్రీ స్వామివారి సాల గ్రామము గర్భాలయమున పూజింపబడుచున్నది. చంద్రవంశము నందు జన్మించిన శ్వేత చక్రవర్తికి ఈ కూర్మావతార రూపము ప్రత్యక్షమైనట్లును, అతనిచే అనేక సవంత్సరములు పూజింపబడినట్లును, అతని చేతనే ఆలయ ప్రాకార నిర్మాణమయినట్లును క్షేత్రపురాణమున గలదు. ఈ శ్వేత చక్రవర్తి యెప్పటివాడో తెలియుటలేదు. ఈ దేవాలయము నల్లరాతిపై చక్కని శిల్పముతో నలరారుచున్నది. ఇందలి లోపలి ప్రాకారముల స్తంభముల పంక్తి ఒకే రాతిపైని మంచి శిల్పముతో ఒక స్తంభము పోలిక ఇంకొకటికాక అనేక స్తంభములతో నలరారుచున్నది.

శ్రీస్వామివారు వేంచేసి యున్న ఆలయమునకు శ్రీకూర్మవిమానమని విమానసంజ్ఞకలదు. ఈ విమానము నారసింహ, కపీశ, హయగ్రీవ, దధివక్త్రుల విగ్రహములతోను, ఇంకననేక చిత్ర విచిత్రమైన విగ్రహములతో నలంకృతమై అష్టదళపద్మాకారముగ నుండుట వలన గాంధర్వ విమానమని కపిలసంహిత యందు చెప్పబడి యున్నది.

ఈ విమానమును దీని ననుసరించి భోగమంటపము పుష్పాంజలి మంటపము ఆస్థానమంటపము మొదలగుమంటపములును, శంఖనిధి, పద్మనిధి, వైష్ణవీ దుర్గ అను పేరులు గల విగ్రహములను, అష్టాక్షర మంత్రోదార విన్యాసముగా బ్రహ్మప్రతిష్ఠయని ప్రసిద్ధి గలది.

ఈ దేవాలయ చిత్రనిర్మాణము అద్భుతమగు పనితనముతో చిత్ర విచిత్రమగు లతా సముదాయముతో నలరారుచున్నది. ఈగుడి తూర్పుదక్షిణ ద్వారములకు గల పనితనము బంగారముపై జేయతగిన పనితనముతో నొప్పుచున్నది.

ఏ కారణము చేతనో ఈ దేవాలయమునకు సుమారు ఆరు అంగుళముల దళసరి గల సున్నముతో ఇందలి చిత్రములు కప్పబడినవి.

ఈ సున్నము వేయుటకు కారణము. పూర్వము రోహిల్లాలు ఈ దేశమునకు వచ్చి హిందూ దేవాలయ చిత్రములను ధ్వంసము చేయుచుండ పూర్వులు ఆ వార్త తెలిసి చిత్రములను భిన్నము చేయుదురను భయముచే సున్నము వేసిరని కొందరును, పక్షులు చిత్రమునకును, చిత్రమునకు సందునరెట్టవేయ మొక్కలు లేచి మందడి పాడగునని కొందరును చెప్పుదురు.

శ్రీకూర్మనాథుని కుశలవులు సేవించినట్టు, తీర్థ యాత్రలో బలరాముడు దర్శించినట్లును వాడుకయున్నది.

క్షేత్రములకాది కూర్మక్షేత్రమని వాడుక.

శ్రీ రామానుజాచార్యుల వారు ఇచ్చటకు వచ్చి వైష్ణవ స్థలముగా నిరూపించి వారి దేవతార్చన శ్రీ గోవిందరాజు స్వామి, శ్రీదేవి, భూదేవి వీరిని ఇచ్చట నిత్యోత్సవులుగా ఉంపించి సింహాచలమునకు వెళ్లిరని ఆచార్య సూక్తి ముక్తావళి మొదలగు గ్రంథములు చెప్పుచున్నవి.

ఇచటి శిలాశాసనములలో ఒక దాని యందు సర్వప్ప అప్పారాయనింగారి కాలమున శ్రీ కూర్మం గ్రామము శ్రీ కూర్మనాథుని సకల కైంకర్యమునకును, పరివారమునకును, రామానుజ కూటమునకు అన్ని వృత్తులతో ఏర్పాటుగా వ్రాయబడి ఉన్నది. శ్రీ కూర్మం గ్రామము శ్రీ కూర్మనాథునికి సమర్పించినట్లు ఆస్థాన మంటపములో కుడివైపు స్తంభము మీద పలక యందు చెక్కబడియున్నది. ('ఉత్తరాంధ్ర'లో శ్రీ భాష్యం వెంకటా చార్యులు).

## వైశాఖ బహుళ పాడ్యమి

ఈనాడు 'భూతమాత్రుత్సవ' అని చతుర్వర్గ చింతామణి. ఆగ్రంథంలోనేనాడు మొదలు జ్యేష్ఠ పూర్ణిమాంతం శ్రీ ప్రాప్తి వ్రతం చెయ్యాలని చెబుతూ ఉంది.

## వైశాఖ బహుళ విదియ
## నారద జయంతి

ఈనాడు నారద జయంతి. ఈనాడు వీణాదానము చేయాలని మత గ్రంథాలలో కలదు. నారదుడు గాన విద్యా కుశలుడు. అతని వీణకు మహతి అని పేరు. ఆ వీణపై సదా విష్ణుగానము చేస్తూ త్రిలోకాలలో సంచరిస్తూ ఉంటాడు నారదుడు.

ఒకసారి ఇంద్రసభలో రంభాదులలో గానములో గొప్పవారు ఎవరో తేల్చవలసినదని ఇంద్రుడు నారదుని కోరెను. అట్టి నిర్ణయం చేయడానికి నారదుడే సమర్థుడనెను. నారదుడు అటూ ఇటూ తేల్చక చమత్కారముగ

దుర్వాసుని తనగాన చమత్కారముతో లోబఱుచుకొన్నది గానవిద్యలో గొప్పది అనెను.

నారదుడు కడచిన కల్పమున ఉపబర్హణుడు అను గంధర్వుడుగా ఉండినవాడు. అతడు నారాయణ కథలు గానము చేయువాడు. తరువాతి కల్పమున బ్రహ్మ మానసపుత్రుడయినాడు అని ప్రార్థివకల్పము.

## వైశాఖ బహుళ ఏకాదశి
## అపరైకాదశి

ఆమాదేర్ జ్యోతిషీ గ్రంథం ఈ ఏకాదశిని అపరైకాదశి అంటూ ఉంది. ఈనాడు ఏకాదశి వ్రతం చేసి ఉపవాసం ఉంటే పవిత్ర తీర్థాల్లో స్నానం చేసిన ఫలం, పలురకముల దానం చేసిన ఫలం కలుగుతుందని చెప్పబడుతూ ఉంది.

## వైశాఖ బహుళ చతుర్దశి
## శివరాత్రి, సావిత్రీ వ్రతమ్

ఈనాడు ఉపవసించి ప్రదోషకాలంలో స్నానం చేసి, తెల్లని వస్త్రాలు ధరించి, గంధం మొదలగు ఉపచారాలతో, మారేడు దళాలతో శివలింగాన్ని పూజించాలి.

లింగ వ్రతము: ఈనాడు పిండితో శివలింగమును తయారు చేసి పంచామృతాలతో స్నానం చేయించి కుంకుమ పూసి ధూప, దీప నైవేద్యాలతోపూజ.

## వైశాఖ బహుళ అమావాస్య

వైశాఖ బహుళ అమావాస్య గురువారంతో కలిసి వస్తే విశేష ఫల ప్రదం అంటారు.

ఈనాడు ప్రయాగలో స్నానం పాపహరంగా ఉంటుంది. త్రయోదశి నాడు ఆరంభించి ఈనాటితో సావిత్రీ వ్రతం పూర్తి చేస్తారని పురుషార్థ చింతామణి.

పితరులను పూజించుట-పార్వణవిధితో శ్రాద్ధము దానము ఈనాటి విధులు.

## వృషభ సంక్రాంతి

ఈనాడు కృష్ణపూజ చేయాలనీ, ఉపవాసం ఉండాలనీ హేమాద్రి చెబుతున్నాడు.

ఈనాడు సుజన్మా వాప్తి వ్రతం, సంక్రాంతి స్నాన వ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి.

# జ్యేష్ఠము

ఇది సంవత్సరములో మూడో మాసం

జ్యేష్ఠమాసాన గృహనిర్మాణానికి ఆరంభించిన మృత్యువు (మత్స్య పురాణము).

## జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి

ఈనాడు కరవీర(వ్రతము: భద్రచతుష్టయ (వ్రతము చేయాలని (వ్రత (గ్రంథాలు పేర్కొంటున్నాయి.

## జ్యేష్ఠ శుద్ధ తదియ

జ్యేష్ఠ శుద్ధ తదియ నాటి వివరణలో మన పంచాంగకర్తలు 'రంభా(వ్రతమ్' అని (వ్రాస్తారు. స్మృతి కౌస్తుభము, తిథితత్త్వము, పురుషార్థ చింతామణి, చతుర్వర్గ చింతామణి మున్నగు (గ్రంథాలు దీనిని 'రంభాతృతీయా' అని అంటున్నాయి. రాజ్య(వ్రతము, (త్రివి(క్రమతృతీయా (వ్రతము మున్నగు ఇతర (వ్రతాలు కూడ ఈనాడు చేస్తారని ఉంది. వీటి అన్నిటిలో రంభా(వ్రతము కొంతవరకు ఆచరణలో ఉన్నట్లు కనిపిస్తుంది.

తపోనిష్ఠలో నున్న శివునకు ఉపచరించడానికి హిమవంతుడు తన కూతురు పార్వతిని అప్పగించాడు. పార్వతి యందు శివునికి (ప్రేమ కలగడానికి ఆసమయంలో మన్మథుడు తన బాణాలు (ప్రయోగించాడు. శివునికి చిత్తం చెదిరింది. అందుతో శివునికి కోపం వచ్చి తన మూడవ కన్ను తెరిచి చూచాడు. మన్మథుడు భస్మమయ్యాడు. శివుడు అక్కడ నుంచి వెళ్లిపోయాడు.

పార్వతి చిన్నబుచ్చుకుని ఇంటికి వచ్చేసింది. తల్లి ఎదురుగా వచ్చి ఆమెను గుచ్చి కౌగిలించుకుంది. పార్వతి బావురుమంది. తల్లి ఓదార్చి ఆమెను తం(డ్రి అయిన హిమవంతుని వద్దకు తీసుకు వెళ్లింది. ఇంతలో అక్కడికి సప్తమహా మునులు వచ్చారు. వారికి హిమవంతుడు తనకూతురు సంగతి చెప్పాడు. అప్పుడు ఆమునులలోభృగువు 'బిడ్డా'! ఒక (వ్రతం ఉంది. ఆ (వ్రతం ఆచరిస్తే నీకు శివుడే భర్త అవుతాడు. అని అన్నాడు.

అప్పుడు పార్వతి 'మహాభాగా! ఆ (వ్రతం ఎప్పుడు ఎట్లా చేయాలి' అని అడిగింది.

దానికి ముని ఇట్లా చెప్పాడు. "బిడ్డా! ఆ (వ్రతాన్ని పెద్దలు 'రంభా(వ్రతము' అంటారు. రంభ అనగా అరటిచెట్టు. ఆ (వ్రతాన్ని

జ్యేష్ఠశుద్ధ తదియనాడు చేయాలి. ఆనాడు ఉదయాన్నే స్నానం చేసి అరటి చెట్టు మొదట అలికి పంచవన్నెముగ్గులు పెట్టాలి. రంభకు అధిష్ఠాన దేవత సావిత్రి కావున అరటి చెట్టు క్రింద సావిత్రీ దేవిని పూజించాలి."

అందుమీద పార్వతి మహాశయా! అరటిచెట్టుకు సావిత్రీదేవి అధిష్ఠానదేవత ఎట్లైనది! అని అడిగింది. దానికి సమాధానముగా భృగువు ఇట్లా అన్నాడు. బిడ్డా! అడగదగిన ప్రశ్న వేశావు. సావిత్రి, గాయిత్రి అని బ్రహ్మదేవుడికి ఇద్దరు భార్యలు. సావిత్రీదేవి సౌందర్య గర్వం చేత ఒకసారి బ్రహ్మవద్దకు వెళ్లడంమాని వేసింది. గాయిత్రి ఆమెకు చాలా దూరము చెప్పి చూచింది. సావిత్రి తన మంకుపట్టు వదలలేదు. బ్రహ్మకు కోపం వచ్చింది. ఈ లోకాన్ని వదలిపో మానవ లోకంలో బీజంలేని చెట్టు వైపుట్టు అని అతడు సావిత్రిని శపించాడు.

అప్పుడు సావిత్రికి పశ్చాత్తాపం కలిగింది. బ్రహ్మకాళ్ల మీదపడి మన్నించమని ప్రాధేయ పడ్డది. కాని బ్రహ్మకు దయరాలేదు. గత్యంతరం లేక సావిత్రి భూలోకానికి వచ్చి అరటి చెట్టయిపుట్టింది. అరటి చెట్టయి ఆమె అయిదేళ్లు బ్రహ్మను గురించి తపస్సు చేసింది. అప్పటికి బ్రహ్మకు మనస్సు కరిగింది. జ్యేష్ఠశుద్ధ తదియనాడు అతడు సావిత్రికి ప్రత్యక్షమయ్యాడు. "నీవు ఒక అంశతో అరటి చెట్టును ఆశ్రయించుకుని ఉండు అరటిచెట్టు ద్వారా నిన్ను పూజించే వారికి కోరికలు ఈడేరుతాయి. ఇక నీవు నాతో సత్య లోకానికి వచ్చి వేయి" అంటూ బ్రహ్మ ఆమెను కొని పోయాడు. సావిత్రికి శాపమోక్షమయిన దినము కాబట్టి జ్యేష్ఠశుద్ధ తదియ ఒక పర్వదినమయింది.

అప్పుడు పార్వతి 'స్వామీ! అయితే ఈ వ్రతం సాంగం చేసే నియమాలు దయచేసి తెలియ చేయండి' అని కోరింది.

అందుమీద భృగుమహర్షి బిడ్డా! ముగ్గులు పెట్టిన అరటిచెట్టు కింద మంటపం వేయవలెను. దానిని సరస పదార్ధ సంపన్నం చేయాలి. అరటిచెట్ల నీడను పద్మాసనం వేసుకుని సాయంకాలం వరకు కూర్చుని సావిత్రి స్తోత్రము చేయవలెను. రాత్రి జాగరణము చేయాలి. మరునాటి నుంచి రాత్రి జాగరణ అవసరం లేదు. పద్మాసనస్థ అయి పగలు సావిత్రి స్తోత్రం చేస్తూ రాత్రులు అరటి చెట్ల క్రిందనే విశ్రమిస్తూ ఉండాలి. ఇట్లా నెలరోజులు చేసి ఆ మీద సరస పదార్థ సంపన్నమైన ఆ మంటపమును పూజ్యదంపతులకు

దానం చేయాలి. ఈ వ్రతాన్ని ఈవరకు లోపాముద్ర చేసి భర్తను పొందింది". అని చెప్పాడు.

పార్వతి ఆ విధముగా రంభా వ్రతాన్ని దీక్షతో చేసింది. ఆ దీక్షకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై ఆమెను పెళ్ళాడాడు. ఇది రంభా వ్రతగాథ.

ఇచట పద్మాసనం వేసుకుని కూర్చుని తపస్సు చేయాలన్న చోట కృత్యసారసముచ్చయం అను గ్రంథంలో పంచాగ్ని సాధన చేయాలని ఉన్నది. పంచాగ్ని సాధనమనగా నాలుగు ప్రక్కల నిప్పుల గుండాలు ఉంచుకుని తాను సూర్యుని వైపు ఱెప్పవేయకుండా చూస్తూ ఉండడం. ఇది కఠోరదీక్ష.

రంభావ్రతం ఉత్పత్తి చూడగా ఇది ప్రత్యేకం స్త్రీల కొఱకు ఉద్దిష్టమైనదని తెలిపోతూనే ఉంది. అరటిచెట్లు నీడను జ్యేష్ఠశుద్ధ తదియ మొదలు. ఆషాఢశుద్ధ తదియ వరకు నెలరోజులు నివశించడం ఆరోగ్యాన్ని కూరుస్తుంది. వేసవిలో పగటిపూట చెట్ల నీడ దాహతాపాన్ని తగ్గిస్తుంది. చల్లగా ఉంటుంది.

మనదేశంమీదికి ఎత్తి వచ్చిన అలెగ్జాండరు ఇచ్చటి మునులు కొందరు ఈ చెట్ల ఫలాలు మాత్రమే తిని జీవిస్తూ ఈ చెట్లనే నివాసంగా ఉండడం చూసి ఆశ్చర్యపడ్డాడనీ, అందుచేతనే అరటికి గ్రీకు భాషలో సాపియంటమ్ (జ్ఞానము కలది) అనే పేరు వచ్చిందనీ చెబుతారు. దీనిని పట్టి అరటి చెట్టు నీడ జ్ఞానదాయిని అని గ్రీకులు కూడా భావించినట్లు వెల్లడి అవుతూ ఉంది.

ఈ రంభావ్రతం కాక అరటి చెట్టు సంబంధమైనది కదళీవ్రతం అని మఱి ఒక వ్రతం కూడా భారతీయులు చేస్తారు. అది భాద్రపద శుక్ల చతుర్దశినికాని, వీలులేకపోతే కార్తిక శుద్ధ చతుర్దశిని కాని చేస్తారు. ఆ వ్రతం చేస్తే స్త్రీలు సౌభాగ్య వతులై చిరకాలం జీవిస్తారని ఫలశ్రుతి.

### జ్యేష్ఠశుద్ధ చవితి

దీనిని స్మృతి కౌస్తుభం ఉమాచతుర్థిగా పేర్కొంటూ ఈనాడు ఉమాపూజనము చేయాలని చెబుతూ ఉంది.

గణేశ చతుర్థి అని ఆమాదేర్ జ్యోతిషీ.

ఈనాడు శుక్లాదేవి పూజ చేయాలని స్మృతి కౌస్తుభము.

### జ్యేష్ఠశుద్ధ పంచమి

పితృదేవతలను పూజించాలని కొన్ని వ్రత గ్రంథాలు.

## జ్యేష్ఠశుద్ధ షష్ఠి

ఆరణ్యాక షష్ఠి అని గదాధర పద్ధతి. స్కందషష్ఠి అని నామాంతరము.

వింధ్యేశ్వర్యాః పూజా అని ఆమాదేర్ జ్యోతిషీ

అరణ్య గౌరీ వ్రతం. వింధ్యవాసినీ పూజ. అరణ్యాల్లో కొండల్లో గౌరిని పూజించేవారికి సౌభాగ్యం.

## జ్యేష్ఠ శుద్ధ సప్తమి

ద్వాదశ సప్తమీ వ్రతం చేయాలని చతుర్వర్గ చింతామణి.

వరుణ పూజ చేయాలని కొన్ని గ్రంథాలలో కలదు.

## జ్యేష్ఠశుద్ధఅష్టమి

ఆమాదేర్ జ్యేతిషీ గ్రంథం శుక్ల అష్టమిని దుర్గాష్టమి. త్రిలోచనాష్టమి నామాలతో పేర్కొంటూ ఉంది.

## జ్యేష్ఠశుద్ధనవమి

బ్రహ్మాణీ నామ్యా ఉమాయాః పూజా, శుక్లాదేవి పూజ ఈ రోజు, ఆచరింపవలసినవి.

## జ్యేష్ఠశుద్ధ దశమి

### దశపాపహరదశమి

దశమి తిథితో సంబంధపడి మనకు రెండు పెద్ద పండగలు కనిపిస్తున్నాయి.

ఒకటి జ్యేష్ఠశుద్ద దశమి, రెండు ఆశ్వీయుజ శుద్ద దశమి. మొదటిది దశపాపహరదశమి, రెండవది విజయదశమి. రెండూ కూడ పది రోజులు పర్యాప్తమయ్యే పాడ్యమి తిథులతో ప్రారంభమై దశమితిథితో ముగిసే పర్వాలు.

దశపాపహర దశమి అనగా పది పాపాలను పోగొట్టే దశమి అని అర్థము. పది పాపాలను పోగొట్టడానికి సమర్థమైన ఈ వ్రతము జ్యేష్ఠ శుక్ల పాడ్యమి నుండి దశమి వరకు చేస్తారు.

ఈ పాడ్యమి నాటి వివరాలలో మన పంచాంగములో 'దశహారాదశాశ్వ మేథేస్నానమ్, ఇత ఆరభ్యదశమీపర్యంతమ్' అని ఉంటుంది.

ఈనాడు ఏనదిలో చేసినా స్నానం విశేషఫలప్రదమైనది. అందులో గంగానదిలో చేస్తే గొప్ప విశేషం. అందులో కాశీలోని దశాశ్వమేథఘట్టంలో గంగాస్నానం మరీ విశేషం.

గంగావతారం ఈనాడు జరిగిందని స్మృతికౌస్తుభం చెబుతూ ఉంది. వ్రతోత్సవచంద్రికాకారుడు జ్యేష్ఠశుక్ల దశమి బుధవారం హస్తానక్షత్రం కాలంలో గంగావతారణం అయిందనీ, ఈ విషయాన్ని వాల్మీకి రామాయణం చెబుతూ ఉందనీ అంటున్నారు.

జ్యేష్ఠశుక్లదశమి సౌమ్యవారంతో హస్తా నక్షత్రంతో కలిసివచ్చిననాడు ఈవ్రతాన్ని ఆచరిస్తే సర్వపాపాలు సమసి పోతాయని నమ్మిక.

వైశాఖమాస శుక్ల సప్తమి నాడు గంగావతారణం జరిగినట్లు గ్రంథాంతరాల్లో ఉంది. గంగావతరణకు ఇది మరి ఒక తిథి. ఇది ఎట్లు పొసుగుబాటు అగునో! ఈ దినము గంగావతరణ దినమైనాకాక పోయినా ఈ పర్వం గంగానదిని ఉద్దేశించి చేయబడేది కావడం కాదనరానిది.

జ్యేష్ఠశుద్ధదశమి వ్రతవిధానం స్కంధ పురాణంలో ఉంది. జ్యేష్ఠ శుక్ల దశమి కొందరికి సంవత్సరాది అట. ఆనాడు స్నానము, దానము, ముఖ్యము. పాడ్యమి మొదలు దశమి వరకు స్నానం చేయడం కూడా ఈపర్వ విధులలోదే.

గంగాదేవి కృపను సంపాదించడం ఈ పర్వప్రధానోద్దేశంగా కనిపిస్తూఉంది. ఈఉత్సవాన్ని గంగోత్సవమని కూడా అంటారు. గంగానది నీరు అతిపవిత్రమైంది. ఎన్నాళ్లు నిలవ ఉన్నా చెడిపోదు. గంగా తీరప్రదేశాలు అనేకం తీర్థ స్థలాలై ఉన్నాయి. ఈ పర్వం నదీతీర గ్రామాల్లో విస్తరించి జరుగుతుందనవచ్చు. కాశి, హరిద్వారము, నాశిక్, మధుర, ప్రయాగ మొదలైన నదీ తీరనగరాల్లో ఈ పండుగ బాగ ఆచరిస్తారు. ఈప్రదేశాల్లో అక్కడక్కడ గంగాదేవి ఆలయాలు ఉన్నాయి. అక్కడ గంగపూజ జరుగుతుంది.

ఈనాడు గంగాస్నానం చేసి గంగాదేవిని పూజించి గంగా స్తోత్రం పఠిస్తే దశవిధ పాపాలు పోతాయి అని వ్రతగ్రంథం. షోడశోపచార విధిచే గంగ పూజ. గంగాదేవి పూజా మంత్రము.

**నమోభగవత్యై దశపాపహరాయై**
**గంగాయై నారాయణ్యై**
**రేవత్యై దక్షాయై శివాయై**
**అమృతాయై విశ్వరూపిణ్యై**
**నందిన్యై తేనమోనమః**
**ఓం నమశ్శివాయై నారాయణ్యై**

**దశహరాయై గంగాయై నమోనమః**

అని ఈ వ్రతకాలాన గంగాదేవిని పైన చెప్పిన జపనీయ మూల మంత్రాన్ని అహో రాత్రాలు అయిదు వేలసారులు జపించి వ్రతం పూర్తి చేయాలి.

ఈగంగోత్సవదశమికి మరోపేరు దశపాపహరదశమి అని. దశపాపహర దశమిని దశహరదశమి అనడం కూడా కద్దు. దీనికి శాస్త్రప్రమాణం.

**శ్లో: లింగం దశాశ్వమేధేశం**
**దృష్ట్వా దశహరాతిథౌ**
**దశజన్మార్జితైః పాపైః**
**త్యజ్యతే నాత్రసంశయః**

దశహర తిథినాడు దశాశ్వమేథ ఘట్టంలోని లింగమును చూచినట్టయితే లోగడ పది జన్మలలో చేసిన పాపం నిస్సందేహముగా నశించి పోతుంది అని తాత్పర్యం.

ఈనాటి స్నాన సంకల్పంలో కూడా ఇదే ధోరణి మాటలు: **"మమ ఏతజ్జన్మ జన్మాంతర సముద్భూత దశవిధపాపక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం దశహర మహాపర్వనిమిత్తం స్నానమహం కరిష్యే"** జన్మజన్మంతరాల నుండి వచ్చిన పది విధాలైన పాపాలు పోగోట్టే స్నానమని కదా దీని భావము.

పర్వతిథి దశమి. ఆపర్వం పదిపాపాలను పోగొట్టేది. కాగా ఈనాటి పూజ పదిరకాల పూవులతోననీ, ఈనాటి నైవేద్యం పది రకాలపళ్లతో ననీ చెబుతారు.

" Daughters of Malwa"అనే పుస్తకంలో మాళ్వదేశంలో ఈ పండుగ జరపబడే తీరు ఇట్లు వివరింపబడి ఉంది.

"జ్యేష్ఠ శుక్ల పాడ్యమి మొదలు దశమి వరకు ప్రతిరోజున స్త్రీలు పిండి వంటలు చేస్తారు. ప్రతిరోజు పదేసి భక్ష్యాలు దక్షణయుక్తంగా గురువులకు ఇస్తారు. పదకొండోనాడు అనగా ఏకాదశినాడు ఉపవాసం ఉంటారు. ఆ ఉపవాసకాలంలో పచ్చి మంచి నీళ్లు కూడా తాగకూడదు. అదే నిర్జలైకాదశి."

దశపాపహరదశమి వ్రత విధానమిది. ఈ వ్రతోద్యాపన సందర్భంలో చెప్పబడే కథ తెలుగు వారికి గర్వకారణమైంది.

మొగలాయి చక్రవర్తుల కాలంలో జగన్నాథ పండిత రాయలు అనే సంస్కృత కవి ఒకడు ఉండెను. అతడు గోదావరి తీరానికి చెందిన ఆంధ్ర బ్రాహ్మణుడు. ఢిల్లీ మొగలాయి కొలువులో పండితకవిగా ఉంటూ అతడు ఒక మహమ్మదీయ స్త్రీని వివాహమాడాడు. కాగా సనాతనులు అతనిని సంఘ బహిష్కృతుని చేశారు. అందుమీద అతడు తన యొక్క తన భార్య యొక్క పావిత్ర్యాన్ని నిరూపించుకోవడానికి కాశీ వెళ్లాడు. అచ్చటి పండితులతో వాదించేడు. అయినా అతని వెలితొలగలేదు.

మీరు ఒప్పుకోకపోయినా గంగా భవాని మా పావిత్ర్యాన్ని ప్రత్యక్షీకరిస్తుందని అతడు ఒక రేవులో గంగాస్తోత్రం చేయసాగాడు. ఆరేవుకి ఏభై రెండు చీడీలు ఉన్నాయి. పండితరాయలు ఎత్తున రెండో చీడీ మీద కూర్చుని యాభై రెండు స్తోత్రశ్లోకాలు చెప్పడానికి ప్రారంభించాడు.

ఒక్కొక్క శ్లోకం చెప్పి ముగించే సరికి గంగానది ఒక్కొక్క మెట్టు పైకి వచ్చేది, చివరి శ్లోకంతో గంగ యాభై రెండు మెట్లకు పొంగి పండితరాయల్ని తనలోనికి తీసుకుంది. అందుతో అతని పావిత్ర్యం నిరూపితమైంది.

పండితరాయలు తెలుగువాడు. ఈ పర్వం అతని మూలకంగా ఏర్పడింది. ఉత్తర హిందూ స్థానంలో ఈ పండుగ ప్రచారంలో ఉంది.

నదులను పూజించే ఆర్యుల ఆచారాన్ని పట్టి ఆదిలో ఈ పర్వం ఏర్పడినా ఇటీవల ఇది పండితరాయల చరిత్రతో జతపడుతూ ఉంది. ఈ రూపేణా ఆంధ్రుడు ఒకడు ఉత్తర హిందూ స్థానమున పూజితుడు అవుతూ ఉండడం, ఆంధ్రులకు అత్యంత ఆమోదకర విషయం.

దక్షిణాదిని ఈపర్వం ఈతీరున ఉన్నట్లు లేదు. ఇక్కడ దశపాపహరదశమి పర్వం సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి స్వామి వారి పూజకు ప్రత్యేకింపబడి ఉంది.

వైశాఖ మాసాంతాన స్వామి వెరూరు గ్రామం చేరి 'నేను జ్యేష్ఠ శుద్ధ దశమినాడు జీవితం చాలిస్తాను. ఆ రోజున కాశీ నుండి ఒక బ్రాహ్మడు ఒక లింగాన్ని తెస్తాడు. నాసమాధి సమీపంలో ఒక ఆలయం కట్టించి అందులో ఆ లింగాన్ని ప్రతిష్ఠించండి.' అని చెప్పేడు.

దశమినాడు ఆయన ఆదేశానుసారం తవ్వబడిన గోతిలో స్వామి ఉపవిష్టుడు అయ్యాడు వారి శిరస్సు నుండి ఒకదివ్య తేజం లేచి ఆకాశం వైపుగా పోయి అదృశ్యమయింది.

ఆసమయంలో బ్రాహ్మడు ఒకడు కాశీనుంచి లింగాన్ని ఒకదానిని తెచ్చేడు.

పుదుక్కోట ప్రభువు ఆలయం కట్టించాడు. లింగ ప్రతిష్ఠ జరిగింది. సమాధి మీద బిల్వ వృక్షాన్ని పాతేరు. ఇప్పటికిన్నీ వెరూరులో పుదుక్కోటలో జ్యేష్ఠశుద్ధ దశమినాడు ఉత్తరాదిని పండితరాయల పూజ. దక్షిణాదిని సదాశివయతి పూజ. ఇద్దరు తెలుగులను పూజ్యలింగములుగా చేస్తూ ఉన్న పుణ్యదినమది.

## జ్యేష్ఠశుద్ధ ఏకాదశి

## నిర్జలైకాదశి

జ్యేష్ఠశుద్ధ పాడ్యమి మొదలు దశమి వరకు గంగోత్సవాలు జరుగుతాయి. జ్యేష్ఠమాసంలో ఎండలు మెండుగా ఉంటాయి. భూమిలో నీటి మట్టం చాలా అడుగుకు పోతుంది. అట్టి గడ్డు వేసవిలో ఈ ఏకాదశినాడు పచ్చి మంచి నీళ్లయినా పుచ్చు కోకుండా ఉపవాసం ఉంటారు. అందుచేతనే దీనికి నిర్జలైకాదశి అని పేరు వచ్చింది.

ఈ నిర్జలైకాదశి ఆదిలో భీముని వల్ల ఏర్పడినట్లు పురాణగాథ ఉంది.

భీముడు తిండిపోతు. ఒక పూట కూడా తిండి లేకుండా ఉండలేడు. అందుచేత దశమినాడు ఏకభుక్తం మాత్రంచేసి ఏకాదశినాడు ఒక పూట అయినా భోజనం లేకుండా అతడు ఉండలేడు. అతడు వ్యాసుల వారితో సంప్రదించాడు. అప్పుడు వ్యాసుడు అతనితో 'నీవు జ్యేష్ఠశుద్ధ ఏకాదశిని నీళ్లుకాని, అన్నంకాని తినకుండా ఉండు. ఏడాదిలోని ఇరవై నాలుగు ఏకాదశి వ్రతాలను చేసిన ఫలితం నీకు సమకూరుతుంది. అని చెప్పాడు. భీముడు అట్లే చేశాడు. ఏడాదికి ఒక వ్రతాన్ని చేసి భీముడు ఏడాదిలో వచ్చే ఇరవై నాలుగు ఏకాదశి వ్రతాల ఫలితాలను పొందాడు. ఆ ఏకాదశి అంత మహాత్తు కలది. ఆ ఏకాదశిని గురించి స్మృతి కౌస్తుభము. చతుర్వర్గ చింతామణి మున్నగు గ్రంథాలలో విపులంగా కలదు.

## జ్యేష్ఠ శుద్ధ ద్వాదశి

ఈనాడు చంపక ద్వాదశి పర్వమని గదాధర పద్ధతి. త్రివిక్రమపూజ అని స్మృతి కౌస్తుభం.

దీనిని రామలక్ష్మణ ద్వాదశి అంటారు. ఈనాడు కూర్మజయంతి అని కొన్ని వ్రత గ్రంథాలు పేర్కొన్నాయి. శ్రీశంకరాచార్య కైలాసగమనం ఈ రోజే.

## జ్యేష్ఠశుద్ధ త్రయోదశి

జ్యేష్ఠశుద్ధ త్రయోదశి మూడు వ్రతాలు చేసే ముహూర్తదినంగా చతుర్వర్గ చింతామణి చెబుతూ ఉంది. ఆ మూడు వ్రతాలలో ఒకటి దుర్గంధ దౌర్భాగ్య నాశన త్రయోదశీ వ్రతం. మిగతా రెండు వ్రతాలు ఈనాటి రాత్రి మొదలు మూడు రాత్రుల పర్యంతం పర్యాప్తమైసాగేవి. ఆ వ్రతాల నామాలు జాతి త్రిరాత్రి వ్రతము, రంభాత్రిరాత్రి వ్రతము అనీ. ఇందు రెండవ వ్రతంలో ఈనాటి రాత్రి ప్రారంభించి అరటి చెట్టు కింద ఉమా మహేశ పూజ చేయాలని కలదు.

పైన పేర్కొన్న మూడు వ్రతాలకు ముఖ్యదినం కావడం చేతనే కాకుండా ఈనాడు మరి ఒక విషయం చేతకూడా పావిత్ర్యాన్ని కూర్చుకున్నది. అది జ్యేష్ఠశుద్ధ త్రయోదశి విద్యారణ్యారాధనదినం కావడం.

విద్యారణ్యస్వామి సిద్ధి పొందిన దినము జ్యేష్ఠ శుద్ధ ద్వాదశి అని కొన్ని గ్రంథాలలో చెప్పబడి ఉంది. విద్యారణ్యుల జీవిత చరిత్ర విషయంలో కొంత కృషి చేసిన శ్రీ మిన్నికంటి గురునాథశర్మకు వ్రాయగా వారు 28-4-61 తేదిని లేఖా మూలమున నిట్లు తెలిపిరి. "విద్యారణ్యుల వారి జననము 1267లో సన్యాసము తీసికొన్నది 1331లో. సిద్ధి 1386లో. వారు 1331 ప్రజోత్పత్తి సవంత్సర కార్తిక శుద్ధ సప్తమినాట శృంగేరి పీఠాధి పత్యము వహించిరి. 1386 జ్యేష్ఠ శుద్ధ త్రయోదశీ సోమవారము బ్రహ్మైక్యమొందిరి. పదిరోజుల క్రిందట శ్రీశృంగేరి పీఠాధిపతులు 35 వ విద్యాతీర్థ స్వాముల వారితో ప్రసంగించు సందర్భమున వారిట్లనిరి. నేటికిని మా పీఠమున జ్యేష్ఠ శుద్ధ త్రయోదశిని విద్యారణ్యారాధన మొనర్తుము.''

విద్యారణ్యుడు విఖ్యాత పురుషుడు. మహాయోగి. తత్త్వార్థ కోవిదుడు. వేదత్రయ భాష్యకర్త. మహామతి. సాంఖ్యయోగ రహస్యజ్ఞుడు. బ్రహ్మవిద్యా పారాయణుడు. శ్రౌతస్మార్తక్రియాపరుడు. వేదాంత శాస్త్రాది అనేక గ్రంథాలు రచించాడు. విద్యానగరమును, విద్యానగర సామ్రాజ్యమును నిర్మించాడు. లౌకిక వైదికముల రెండింటి యందు అసమాన ప్రతిభ చూపినవాడు. మతోద్ధారకుడు, రాజ్యోద్ధారకుడు కూడ నయిన ఈతని చరిత్ర ప్రతివారును తెలిసికొనతగినది.

సాధారణంగా ఈతని విద్యారణ్యస్వామి అని పేర్కొంటారు. ఈ పేరు ఇతను సన్యశించిన తరువాత వాడుకలోకి వచ్చింది.

ఇతనికి తల్లిదండ్రులు పెట్టిన పేరు మాధవుడు అని. సన్యాసం

పుచ్చుకున్నాక విద్యారణ్య నామంతో ప్రవర్తించాడు.

పరాశరస్మృతి వ్యాఖ్యానంలో విద్యారణ్యుడు తమ వంశాదికాలను ఇట్లా వివరించాడు.

**"శ్రీమతీ జననీయస్య సుకీర్తిర్మాయణః పితా**

**ప్రాయణం౯ః సోమనాథశ్చ మనోబుద్ధి సహోదరౌ**

**యస్య బోధాయనం సూత్రం శాఖాయస్యచయాజుషీ**

**భరద్వాజం యస్యగోత్రం సర్వజ్ఞస్సహి మాధవః."**

"తల్లి శ్రీమతి, తండ్రి మాయణుడు, సహోదరులు సాయన, సోమనాథులు, బోధాయన సూత్రం, యజుర్వేద శాఖ. భారద్వాజస గోత్రము. పేరు మాధవుడు.

విద్యా తీర్థులు, భారతీ తీర్థులు, శంకరానందులు మున్నగు వారు ఇతని గురువులైనట్లు తెలియవస్తూ ఉంది. 'సర్వజ్ఞ విష్ణు' అనే పేరు గల గురువు గారి దగ్గర వేద, వేదాంత శాస్త్రాలు అభ్యసించినట్లు సర్వదర్శన సంగ్రహంలో ఉంది.

బ్రహ్మచర్యాశ్రమం నుండే ఇతడు సన్యశించినట్లు చెబుతారు. కాని ఇతడు చాళుక్య చక్రవర్తి మంత్రి అయిన వీతిహోత్రుని కుమార్తె "వీతిహోత్రి" అను కన్యను తల్లిదండ్రుల ఆజ్ఞానుసారము పెండ్లియాడి కొంతకాలము సంసార సాగరమున సంచరించెను. వివాహం ఆయన నలుబదవ ఏట జరిగింది. అయినను బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠు డగుటచే ఇరువది అయిదు వసంతముల యవ్వనవంతునివలె భాసించెడువాడు." అని శ్రీ పురాణపండ రామమూర్తి గారు అంటున్నారు.

ఇతని విద్యాభ్యాసకాలమునాటికి దక్షిణ భారతాన ఆర్షమతపరిస్థితి శోచనీయమై ఉండింది. వేదశాస్త్రాలు అడుగంటాయి. శ్రౌతస్మార్త విద్యలు భ్రష్టమైనాయి. వేదార్థ విశదీకర్త అంతవరకు ఎవరూ లేకుండిరి. మత త్రయాచార్యులు వేదాంత శాస్త్రాన్ని మాత్రమే విస్తరింప చేశారు. దాని ఫలితంగా ఉపనిషన్మతం పెడత్రోవల్లో పడింది. మతం పలుశాఖలుగా చీలిపోయింది. ఈ పరిస్థితులలో విద్యారణ్యుడు అవతరించి వేదమతాన్ని ఉద్ధరించాడు.

ఇతనికి ప్రాజ్ఞత వచ్చేసరికే ఉత్తర హిందూస్థాన మంతా మహ్మదీయుల వశమైంది. ఆ అన్యమతస్థులు దక్షిణాదిని అక్కడక్కడ పీట పెట్టారు. ఈ విషయాలు ఇతనిని కలత పెట్టాయి. అప్పుడు అతడు

తుంగభద్రా తీరాన భువనేశ్వరీ అమ్మవారిని గురించి తీవ్రమైన తపస్సు గాయత్రీ మంత్రంతో ప్రారంభించేడు. అమ్మవారు ప్రసన్నురాలై ప్రత్యక్షమయింది. వరం కోరుకోమంది. ఐశ్వర్యం ఇమ్మని కోరారు. ఈ జన్మలో ఐశ్వర్యం పొందడానికి అర్హతలేదని అమ్మవారు చెప్పింది. అప్పుడు అతడు సన్యసించాడు. సన్యసించి శృంగేరి పీఠాధిపత్యం స్వీకరించి విద్యారణ్య బిరుదం వహించాడు. సన్యాసం జన్మాంతం కాబట్టి ఐశ్వర్యం ఇమ్మని అతడు అమ్మవారిని అర్థించాడు. ఆమె ఆ అభ్యర్థనాన్ని అంగీక రించింది. మూడు గడియల సేపు సువర్ణ వృష్టి కురిపించింది.

అదే సమయానికి హరిహరరాయలు, బుక్కరాయలు అతని వద్దకు వచ్చారు. విరూపాక్షస్వామి పేరిట వారిచే అతడు ఒక రాజ్యాన్ని స్థాపించాడు. భువనేశ్వరీమాత అనుగ్రహించిన అపారధనసంపత్తిని అతడు విరూపాక్ష పీఠం నెలకొల్పడానికి విద్యానగరాన్ని పెంపొందించడానికి, విద్యానగర సామ్రాజ్యన్ని విస్తరింప చేయడానికి వినియోగించాడు.

ఈ రాజుల వద్ద అతడు కొంతకాలము మంత్రిగా ఉన్నాడు. ఆ మీద అతడు శృంగేరీకి వెళ్లి అచటి శంకర పీఠానికి అధిపతి అయ్యాడు. అతడు తన నూట ఇరవయ్యో ఏట సిద్ధి పొందినట్లు చెబుతారు.

విద్యారణ్యుని గుఱించి ముఖ్యముగా తెలుసు కొనవలసిన విషయాలు కొన్ని ప్రముఖులు రచనల నుండి ఇక్కడ క్రోడీకరింపబడుతున్నాయి.

## విద్యారణ్యనామం

ఇది 'విద్య' 'అరణ్యా' అను రెండు పదాల కలయికచే ఏర్పడినది. సరస్వత్యపరావతారమగు మాధవచార్యుడే విద్యారణ్యా" యోగపట్టము స్వీకరించి శృంగేరీ జగద్గురు పీఠాధిష్ఠితుడయ్యెను. శృంగేరీ - కామకోటి - విరూపాక్షపీఠములం దధిష్ఠితు లైనవారలు తాము స్వీకరించిన యోగ పట్టమున కంత్యభాగమునందు తీర్థ - ఆశ్రమ - వన - అరణ్యా - గిరి - పర్వత - సాగర - సరస్వతి - భారతి -పుర్యాదిగాగల దశవిధనామములం దొకటి జేర్చికొనుట యాచారమైయుండెను. ఆపద్ధతి శృంగేర్యాదిగాగల జగద్గురుపీఠములందు నేడును గలదు. ఈ దశవిధనామవివరణ మిటులున్నయది.

**1. తీర్థనామ :-**

**త్రివేణీసంగమే తీర్థే తత్త్వమస్యాదిలక్షణే.**
**స్నాయాత్తత్త్వార్థభావేన తీర్థనామా స ఉచ్యతే.**

2. ఆశ్రమనామ:-

ఆశ్రమగ్రహణే ప్రౌఢ ఆశాపాశవివర్జితః

యాతాయాతవినిర్ముక్త ఏష ఆశ్రమ ఉచ్యతే.

3. వననామ:-

సురమ్యే నిర్జనస్థానే వనే వాసం కరోతియః

ఆశాబంధవినిర్ముక్తో వననామా స ఉచ్యతే.

4. అరణ్యనామ:-

అరణ్యే సంస్థితో నిత్యమానందే నందనే వనే,

త్యక్త్వా సర్వమిదం విశ్వమరణ్యః పరికీర్త్యతే.

5. గిరినామ:-

వాసో గిరివరే నిత్యం గీతాధ్యయనతత్పరః

గంభీరాచలబుద్ధిశ్చ గిరినామా స ఉచ్యతే.

6. పర్వతనామ:-

వసన్పర్వతమూలేషు ప్రౌఢం జ్ఞానం లభర్తి యః

సారాసారం విజానాతి పర్వతః పరికీర్త్యతే.

7. సాగరనామ:-

తత్త్వసాగరగంభీరో జ్ఞానరత్నపరిగ్రహః

మర్యాదాం నైవలంఘేత సాగరః పరికీర్త్యతే.

8. సరస్వతీనామ:-

సర్వజ్ఞానరతో నిత్యం సర్వవాదీ కవీశ్వరః

సంసారసాగరాసారహన్తా సాహి సరస్వతీ.

9. భారతీనామ:-

విద్యాభారేణ సంపూర్ణః సర్వభారం పరిత్యజన్,

దుఃఖభారం న జానాతి భారతీ పరికీర్త్యతే.

10. పురీనామ:-

జ్ఞానతత్త్వేన సంపూర్ణః పూర్ణతత్త్వపదే స్థితః

పరబ్రహ్మరతో నిత్యం పురీనామ స ఉచ్యతే.

--'మఠామ్నాయసేతౌ

ఇక శృంగేరి జగద్గురుపీఠ మధిష్ఠించిన విద్యారణ్య యోగపట్టము బరిశీలింతము. ఇది 'విద్య' 'అరణ్య' యను రెండుపదముల కలయిక గలది. ఇందు మొదటిపదము 'విద్య' విద్యారణ్యులకుముందు

శృంగేరికామకోటిపీఠము అధిష్ఠించువారలందు గొందరికి 'విద్య' పదముతోడ ప్రారంభమైన యోగపట్టము లున్నటుల మనకు కన్పట్టుచున్నవి. విద్యాజ్ఞానేంద్ర, విద్యాఘన, విద్యఘనేంద్ర, విద్యాతీర్థ. రెండవపదము 'అరణ్య' అరణ్యపదము పై నుదహరింరబడిన దశవిధనామము లందొకడు. పైవిషయములనెల్ల బరిశీలించిచూడ తురీయాశ్రమస్వీకరణానంతరము శృంగేరీ పీఠాధిష్ఠితుడైన మాధవాచార్యునకు కలిగిన 'విద్యారణ్య' యోగపట్టము శృంగేరి జగద్గురుపీఠపు నియమముల ననుసరించి గొనినదియే. తురీయాశ్రమస్వీకరణమున బ్రహ్మచర్య గృహస్థవానప్రస్థము లందు వ్యవహరించిననామము విడిచి నూతననామము ధరింపవలయు నను నియమ మున్నటుల స్మృతులు సైతమంగీకరించుచున్నవి. కాన విద్యాతీర్థుల యంతేవాసియగు మాధవాచార్యుడు సన్యాసాశ్రమమున బ్రవేశించి విద్యారణ్యయోగపట్టము బడసి తత్పీఠాధిష్ఠితు డయ్యెనని సుస్పష్టముగ గోచరించుచున్నది." - సాహిత్య సరస్వతి శ్రీరాచర్లతిప్పయ్య.

అతడు పధ్నాలుగు వందల గ్రంథాలు రచించినట్లు చెబుతారు. వేదభాష్య రచనలో అతనికి అతని సోదరుడగు సాయణుడు మాత్రమేకాక నారాయణ వాజిపేయయాజి, నరహరి సోమయాజి, పాండరీదీక్షిత, పెద్దవిద్యావల్లభ, మంత్రసిద్ధి మున్నగు ఇరవై నలుగురు పండిత ప్రకాండులు తోడుపడినట్లు తెలుస్తూ ఉంది.

### గురుభక్తి

విద్యారణ్యుల గురుపాదులు విద్యాతీర్థులు, విద్యాతీర్థులు లంబికాయోగసిద్ధులు. ఒకనాడాయన శిష్యులను బిలిచి తాను లంబికాయోగమందు ప్రవేశించుచున్నాననియు, తనను సజీవునిగా సమాధిచేసి పండ్రెండేళ్ళ వరకు సమాధిని కదుపవలదనియు శాసించిరట. అట్లేచేసిన శిష్యులు గడువుదాటక ముందుగనే ఒకనాడు త్రవ్విచూడ అందు గురుని దేహమం దేవియో మార్పులు కనుపట్ట వారుభయపడి దానిని యధాతథముగనుంచి వేసిరి.

అనంతరము విద్యాతీర్థులు విద్యారణ్య స్వామికి స్వప్నములో సాక్షాత్కరించి తన సమాధిపై ఒక మందిరము గట్టింపుమని యాజ్ఞాపింప విద్యారణ్యులు గురుదేవుని అభిమతానుసారము మందిరము నిర్మించి దానికి "విద్యాశంకర" మందిరమని నామకరణము చేసిరి.

ఆ మందిర ముఖమండపము చుట్టునున్న పన్నెండు స్తంభములు

మేషాదిరాశుల నామములతో బరగుచున్నవి. ఇందొక విచిత్రము గలదు. సూర్యుడే మాసమున ఏ రాశి యందు సంచరించునో ఆ మాసమున ఆ స్తంభము మీదనే సూర్యకాంతి ప్రసరించునుగాని తదితర స్తంభముల యందు ప్రసరింపదు. నేటికిని విదేశీయులనేకులు ఈ విచిత్రమును చూచి నివ్వెరపడుచుందురు. ఆనాటి శాస్త్రవికాస పద్ధతులు ఈ నాటికిగూడ పాశ్చాత్యులకు లొంగలేదనిన వారెంతటి ప్రతిభాశాలురో, ప్రజ్ఞావంతులో బుధులు గ్రహించగలరు.

### విద్యారణ్యుడు ఆంధ్రుడు

విద్యారణ్యస్వామి ఆంధ్రుడా, ద్రవిడుడా, కర్ణాటకుడా, మహారాష్ట్రుడా, అనే శంక ఉంది. అతని జాతి విషయకమైన చర్చ శ్రీ వావిలాల శివావధానులు 'విద్యారణ్య చరిత్ర'లో కలదు. అతడు ఆంధ్రుడనుటకు అనేక కారణాలు అగుపడుచున్నవి. కావేరి తీరస్థుడు, వడమ బ్రాహ్మణుడు, అప్పయ్య దీక్షితులు సంతతిలోనివాడు, అఖిలభారత ప్రసిద్ధిగల గొప్ప విద్వాంసుడు అయిన శ్రీ రాజు శాస్త్రులు విద్యారణ్యులు ఆంధ్రుడనే అభిప్రాయాన్ని దృఢపరచి ఉన్నారు.

### స్థలము: కాలము

అతడు పుట్టిన స్థలము, కాలము సరిగా తెలియదు. వైశాఖ శుద్ధ దశమి అతని జయంతి దినమని కొందఱంటారు. అతడు సిద్ధి పొందినది 1386లో అని కొందరు, 1395లో అని మరికొందరు. అతడు 102 సంవత్సరాలు జీవించెనని కొందరు, 120 సం॥ జీవించెనని మరికొందరు, అతడు 1321లో సన్యసించినట్లు, 1331లో శృంగగిరి పీఠమధిష్ఠించినట్లు, 1336లో విద్యానగర నిర్మాణం చేసి విరూపాక్ష పీఠం స్థాపించినట్లు చెబుతారు. అతడు శృంగేరి పీఠాన్ని యాభై ఐదు సంవత్సరాలు ఏలినట్లు తెలియవస్తూ ఉంది. ఆదిశంకరుల తరువాత అతడు పదకొండో ఆచార్యులు.

### శారదా విగ్రహం

శంకరుల తరువాత అతడు శంకరుని వంటివాడు. ఆది శంకరుడు కాశ్మీరం నుండి శృంగేరి తెచ్చిన శారదా విగ్రహం చందన ప్రతిమ. విద్యారణ్యస్వామి తన హయాములో ఆశారదా విగ్రహాన్ని పంచ లోహాలతో నిర్మింపచేసి పూర్ణకుంభాలతో అభిషేచనం చేశాడు. ఆవిగ్రహమే నేటికి ఈ శృంగేరి పీఠంలో అర్చింపబడుతూ ఉంది. అది ఆ మహనీయుని చేతి చలవ.

ఇట్టి ఉత్తమ శ్లోకునిచే స్థాపింపబడిన విద్యానగరం, విద్యానగర సామ్రాజ్యం రెండు వందల ముప్ఫయి సంవత్సరాలు మాత్రమే మనుటకు హేతువు ఏమిటనే జిజ్ఞాస ఈ సందర్భంలో కలగక మానదు. ఆ సందర్భంలో ఒక ఉదంతం చెప్పబడుతూ ఉంది. విద్యానగర నిర్మాణానికి అతడు ఒక ముహూర్తాన్ని ఉంచాడు. ఆ ముహూర్తసమయానికి సరిగ్గా తాను గంటకొడతానని, అప్పుడు నగర నిర్మాణానికి గుణావర్ధనం చేయమనీ చెప్పాడు. ఆ సంగతిని విన్న ఒకడు ముహూర్తానికి అరగంట ముందుగానే గంటకొట్టినాడు. నగరనిర్మాణం అప్పుడే ఆరంభమయింది. విద్యారణ్యుడిది తెలిసికొన్నాడు. నగర నిర్మాణం ఆరంభింపబడిన ముహూర్తాన్ని పట్టి దాని ఆయుర్దాయం రెండువందల ముప్ఫయి సంవత్సరాలు మాత్రమే అని అతడు అప్పుడే చెప్పివేశాడు. 1336లో నిర్మితమైన ఆనగరం 1565లో మహమ్మదీయులదొద్దకు గురిఅయి పచ్చము పాడైంది.

శతాధిక సంవత్సరాలు జీవించినవాడు. శతాధిక గ్రంథాలు వ్రాసినవాడు అయిన విద్యారణ్యస్వామి స్మృతి చిహ్నాలు శృంగేరీలోనూ, విద్యానగరంలోనూ కూడా ఉన్నాయి. విద్యానగరాన విరూపాక్షస్వామి ఆలయానికి వెనకతట్టున విద్యారణ్యస్వామి మందిరం ఉంది. శృంగేరిలో విద్యారణ్యస్వామి పూజకు ప్రత్యేకం ఒక ఆలయం ఉంది. ఆ ప్రాంతాన విద్యారణ్య పురమనే అగ్రహారం కూడా ఉంది.

జాతిని ఉత్తేజపరచిన మహనీయులలో విద్యారణ్యుడు ఒకడు. ఏడాదికి ఒకనాడైన అతనిని ఆరాధించడము మన విధాయక కృత్యం. అతడు బ్రహ్మైక్యం పొందిన జ్యేష్ఠశుద్ధ త్రయోదశిని శృంగేరిపీఠంలో వలెనే ప్రతి హిందూ దేవాలయంలోనూ అతని స్మరణ, పూజసాగవలసి ఉంది.

## జ్యేష్ఠశుక్ల చతుర్దశి

చంపక చతుర్దశి అని ఆమాదేర్ జ్యోతిషీ చెబుతున్నది. ఈనాడు వాయువ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి, రుద్రవ్రతం చేస్తారని స్మృతి కౌస్తుభము చెబుతున్నాయి.

## జ్యేష్ఠ పూర్ణిమ

మనపంచాంగంలో జ్యేష్ఠపూర్ణిమ నాటి వివరాల్లో 'వృషభ పూజా, హల ప్రవాహః' మున్నగు పదాలు ఉంటాయి. ఎద్దులను పూజించడం, నాగలి సాగించడం ఆనాటి విధి కృత్యాలని ఇందుతో తేలుతూ ఉంది.

దీనిని తెలుగునాట ఏరువాక పున్నమ అని వ్యవహరిస్తున్నారు.

ఏరువాక అనగా ఏమి? ఆ పండుగ ఎట్టిది? ఈ సందర్భమున శ్రీసురవరము ప్రతాపరెడ్డి ఇట్లు వ్రాస్తున్నారు.

"ఏరువాకయను పదమునకు ఆంధ్రదీపికా నిఘంటుకారుడిట్లు వ్రాసియన్నాడు.

ఏరు=సర్వావయవములు కలనాగటికి యెడ్లనుపూనినది. సర్వావయములు గల నాగలి. ఏరువాక= దున్నుటకారంభము.

శబ్దరత్నాకరనిఘంటు కారులును నిట్లుసెలవిచ్చియున్నారు. ఏరు=ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపరచిన నాగలి.

ఏరువాక=దుక్కి యొక్క ప్రారంభము.

ఈ రెండర్థములను విచారించి చూచిననిది వ్యవసాయకులకు సంబంధించినది అని విశదమయ్యేడిని ఈపండుగ వర్షర్తువు యొక్క యారంభదశలో జేయబడును. అప్పుడువర్షములు గురిసి భూమి పదునైన యెడల (పునర్వసు కార్తిలో) పునాసవిత్తనములు వేయుదురు. పునర్వసు నుండియే పునాసపద మేర్పడినది.) ఈ పండుగనాడెద్దులకు మైకడిగి కొమ్ములకు రంగులు పూసి గజ్జెలు, గంటలు, అద్దము, కుచ్చులు మెడనుగట్టి యలంకరింతురు. ప్రొద్దుననే యింటిలో పొంగలి (పులగము) చేసి యెద్దులకు బెట్టుదురు. ఎద్దులనుగట్టివేయు గాడికి ధూపదీప నైవేద్యములిత్తురు. సాయంకాలమందుతప్పెట, మేళము, మున్నగు మంగళవాద్యములతో నూరివసుల నన్నిటిని నూరిబయుట కు దోలుకొనిపోవుదురు. ఊరివాకిటికొక పుంటినారతోజేసిన తోరణము కట్టుదురు. ఈతోరణమును గ్రామజనులు చేఱుకోలలతో గొట్టి పీచుపీచుచేసి యెవ్వరికిదొఱకిన పీచువారుతీసికొనిపోయి యింటబెట్టు కొందురు. ఇదిపసులకు మేలుకలిగించునని వారి విశ్వాసము.

కర్షకులకు ఎద్దులే జీవిత సర్వస్వము. కావున వాని పూజ కృతజ్ఞతాసూచకము. ప్రశంసనీయము.

పైవివరములను బట్టి ఇది వ్యవసాయమదారులకు ప్రధానమైన పండుగగా కనిపిస్తు ఉంది.

కన్నడులలో ఈ పండుగను కారుణిపబ్బమందురు.

ఈ ఏరువాక పున్నమనే సంస్కృత మందు ఉద్వృషభ యజ్ఞమని పూర్వకాల మందు చేయుచుండిరి. జైమినీయ న్యాయమాలా గ్రంథమందు

హలాకాధికరణములో నిట్లు ఆ పండుగ సూచనగా నున్నది.

**సూ: ఉద్వృషభయజ్ఞాదయ ఉదీచ్యైః**

**జ్యేష్ఠమాసస్య పౌర్ణమాస్యాంబలీవర్దాన్**

**అభ్యర్చ్యధావయంతిసోయమ్ ఉద్వృషభయజ్ఞః**

"ఔత్తరాహులు ఉద్వృషభయజ్ఞము చేయుదురు. ఇది జ్యేష్ఠమాస పూర్ణిమనాడు చేయబడును."

ఇట్లు జైమిని కాలము నాటికే యీ పండుగ సుప్రసిద్ధమై యుండెను.

ఈ పండుగను గురించి శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి ఇట్లు వ్రాస్తున్నారు.

"ఉద్వృషభోత్సవమును గూర్చి 'అనడుత్సవము' అను పేరుతో అథర్వవేదమున గలదు. దాని విధి నిషేధికము శ్రౌతసూత్రమున గలదు. ఇది తొల్లుత హలకర్మము, అంకురారోపణము అను బ్రాహ్మణుల కర్మములకు సంబంధించియే యున్నది. లేకుండిన పరాశర బోధాయనాది గృహ్యాసూత్రములకిది యెక్కదు. వ్యవసాయము బ్రాహ్మణుడు చేయుటమానిన పిమ్మటనది అమంత్రకముగా బ్రాహ్మణేతరుల పాలబడెను.

వ్రతగ్రంథములందంతగా కానరాక పోయినను సేద్యగాండ్రు మాత్రము తడవులను బట్టి ఈ పండుగను జరుపుతూనే ఉన్నారు. ఈ పండుగ సంబంధమైన పాటలు కొన్ని సేకరించి శ్రీ రావూరు 'కృష్ణా పత్రిక'లో (యువసంవత్సరం) ప్రచురించారు. అందుండి ఏరువాక పాట, నాగలిపాట అను రెండుపాటలు ఇక్కడ ఉదాహృతాలు అవుతున్నాయి.

**ఏరువాకపాట**

ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
ఏళ్ళునదులూపొంగి వెంబడేవచ్చాయి.
నల్లమేఘాలలో నాట్యమాడింది.
కొండగుట్టల మీద కులుకులాడింది.
ఇసుకనదిలో దూరి బుసలుకొట్టింది.
పాడుతూ కోయిలా పరువులెత్తింది.
ఆడుతూ నెమలి అలసిపోయింది.
నవ్వుతూ మా అయ్య బువ్వతిన్నాడు.
ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ

ఏళ్ళునదులుపొంగి వెంబడేవచ్చాయి.
ఆకాశమునమబ్బు లవతరించాయి.
మబ్బులో ఒక మెరుపు మాయమైపోయింది.
ఉరు మొక్కటావేళ ఉరిమిపోయింది.
కాపుపిల్లల మనసు కదిలిపోయింది.
అటకమీద గంప అందుకోవయ్యా
విత్తనాలుతీసి విరజిమ్మవయ్యా
మృగశిరకార్తిలో ముంచెత్తువాన
కలుపరా అబ్బాయి కొత్తదూడల్ని
కట్టరా అబ్బాయి కొత్తనాగళ్లు
దున్నరా ఓ అయ్య దుక్కుల్లుమీరు
ఒకగింజ కోటియై వర్థిల్లుమీకు
ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
ఏరునదులు పొంగి వెంబడేవచ్చాయి.
కొత్తల్లుడొస్తాడు కోడలొస్తుంది.
కొత్తబట్టలు తెచ్చి దాచండిమీరు
పళ్లుపూవులు తెచ్చి పంచి పెట్టాలి.
కొత్తబట్టలుకట్టి కొత్త నాగళ్ళతో
కొత్తదూడలతో కొత్తపాలేళ్లతో
ఏరువాకాసాగి మురుసుకోవాలి
కొత్తపంటలు మనము కోరుకోవాలి.
ఏరువాకొస్తుంది ఏరువాకమ్మ
ఏళ్లునదులూపొంగి వెంబడేరావాలి
ఏరువాకమ్మకి ఏమి కావాలి
ఎఱ్ఱఎఱ్ఱనిపూల మాలకావాలి
ఎరుపు తెలుపుల మబ్బు టెండకావాలి
ఏరువాకమ్మకీ ఏమి మొక్కాలి
పొలముగట్టున నిలిచి వేడుకోవాలి
టెంకాయవడపప్పు తెచ్చిపెట్టాలి.
ముత్తైదులందరూ పాటపాడాలి
పాటబాడుతుతల్లి పాదాలుమొక్కాలి

ఏరవాకమ్మనీ ఏమికోరాలి!
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలు కోరి పరవశించాలి
ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
ఏళ్లునదులు పొంగి వెంబడే వచ్చాయి.

**నాగలిపాట**

ముందటేరు దున్నేవాడా
ముద్దులబావ!
దాపటెద్దుకు దాహమాయెను
కాపువదిలావా!
వెనుకనాగలి దున్నేవాడా
ఎఱ్రపంచెల చిన్నవాడా!
వెలపటెద్దుకు దాహయాయెను
తెలుసుకున్నావా!
వెండిమురుగులు వెలుగుచూచి
ఎఱ్రపంచెల షోకుచూచి
తోలవేమో దొరగిత్తని అలసిపోయావా!
ఆపలేక మెట్టనాగలి
ముందు కురులుపైకిచుట్టి
ములుకఱ్ఱా చేతపట్టి
దుక్కిదున్నిన దేశమందు
దుఃఖముంటుందా!
కాపునడచిన భూమిమీద
ఏపుతగ్గిందా!
మోటనాగలి దున్నుకుంటూ
పాటలేవో పాడుకుంటూ
పాటుపడితే లోటులుంటాయా!

**సావిత్రీవ్రతం**

తిలపాత్రదిదానం మహాజ్యేష్ఠి.

సావిత్రీవ్రతం: బంగారముతోకాని మట్టితో కాని సావిత్రీ సత్యవంతుల ప్రతిమలను చేసి యధాశక్తిని పూజించవలెను. రాత్రి సావిత్రి

చరిత్రము వింటూ జాగరం చేయాలి. తెల్లవారినతరువాత ఆసావిత్రి ప్రతిమను దక్షిణసహితంగా దానంచేయాలి. ఇదిస్త్రీలకు సౌభాగ్యప్రదమైనది.

తిలచ్ఛత్రాదిదానం, బిల్వత్రిరాత్రి, పుత్రకామ, అశోకత్రిరాత్ర మున్నగు వ్రతాలు చేస్తారని వ్రతగ్రంధాలు.

అమాదేర్‌జోతిషీ దీనిని స్నానపూర్ణిమ అని పేర్కొంటూ ఉందని.

జగన్నాథదేవస్యస్నానమ్. స్నానయాత్రా. మహాజ్యేష్ఠి పురుషోత్తమ క్షేత్రాన జరపడం, విశిష్టఫలదంగా ఉంటుందని, ఈనాడు తిలదానం చేస్తే అశ్వమేధ యాగము చేసినఫలం కలుగుతుందని చెబుతారు.

## వట పూర్ణిమ - వట సావిత్రీ వ్రతం

వివాహితలైన స్త్రీలు జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ నాడు ఈ పర్వాన్ని జరుపుతారు.

ఈ రోజున ఉపవాసం వుంటారు. వటవృక్షపూజకు (icus Indica) ఉద్దిష్టమైనది. స్త్రీలను వైధవ్యం రాకుండా ఈ పర్వం చేస్తుందని నమ్మకం.

ఈ వ్రతము అనాదికాలంనుంచీ వున్నట్లు కనిపిస్తుంది. ధర్ముడు (ధర్మరాజు) ఒకసారి లోమశ మహర్షిని ప్రశ్నించాడు. పూర్వం ద్రౌపది వంటి మృదుభాషిణి, సుందరాంగి, పతివ్రత ఐన స్త్రీ వున్నదా అని. అప్పుడు ఆ ఋషి ధర్ముడికి సావిత్రి కథ చెబుతాడు.

యముడు ఇచ్చిన నాలుగో వరంలో సావిత్రి జన్మ సావిత్రి అనీ, సౌభాగ్యవతి అనీ, మంగళ మహేశ్వరి అనీ తాను పిలవబడాలని కోరింది. ఆవరం పొంది సావిత్రి తిరిగి వచ్చి తన భర్త గెడ్డం ముట్టుకుంది. అతడు లేచి కూర్చున్నాడు. - Kothare's

మాళవ దేశంలో ఈ పండుగ జ్యేష్ఠశుక్ల త్రయోదశి మొదలు పూర్ణిమ వరకు మూడురోజులు చేస్తారు.

ఈ మూడు రోజులు స్త్రీలు వట వృక్షానికి, సావిత్రి, సత్యవంతుడు, యముడు వీరల పటానికి పూజ చేస్తారు. వివాహితలై సుమంగళులుగా వున్న స్త్రీలు మాత్రమే ఈవ్రతాన్ని ఆచరిస్తారు.

కొందరు స్త్రీలు ఈ పర్వాన్ని ఒక పూర్ణిమ నాడు మాత్రమే ఆచరిస్తారు. ఆనాడు వారు పూర్తిగా ఉపవాసం వుంటారు. మరునాడు ఉదయాన్ని భోజనం చేస్తారు.

మూడు రోజులు ఈ పర్వాన్ని జరిపించేవారు త్రయోదశి ఉదయం మొదలు పౌర్ణమినాటి సాయంకాలం వరకు ఉపవసిస్తారు.

పూర్తిగా నిరాహారంగా వుండలేనివారు నీళ్లు, పాలు, తేనీరు, పళ్లు సింగార (water plant) సగ్గు బియ్యము, పంచదార పుచ్చుకోవచ్చును.

కుంకుమతో కలిపిన బియ్యం (అక్షతలు), పసుపు , కర్పూరం, పువ్వులు, అగరొత్తులు, దారము, ఒక కర్రకు చుట్టిన కొన్ని వత్తులు, ఆకులు, పోకలు చిల్లరడబ్బులు - ఇవి పూజకు ముఖ్యంగా కావలసినవి.

పూర్ణిమనాటి ఉదయాన్ని స్త్రీలు వటవృక్షానికి పూజ చేస్తారు. ఈ చెట్టు కావడానికి మూడు సారులు దారం చుడతారు. అప్పుడు పూజ చేసి నైవేద్యం పెడతారు. ఆ మీద స్త్రీలు బియ్యము కాని గోధుమలు కాని ఒకరికి ఒకరు వాయనం ఇచ్చుకుంటారు. ఆ వాయనంలో మామిడి పళ్లు కూడా వుంచుతారు.

పూర్ణిమనాటి మధ్నాహ్నం పురోహితుడు వచ్చి సావిత్రి కథ చెబుతాడు. పురోహితుడు చెబితే తప్ప చెప్పుకుంటే ఈ కథకు ఫలం లేదని మాళవదేశస్థుల నమ్మిక.

## కథ

మనదేశంలో వాడుకలో వున్న సావిత్రి కథకున్నూ మాళవదేశంలో వాడుకలో వున్న సావిత్రి కథకూన్ను కొద్ది తేడాలు వున్నాయి. తేడాలు వున్న స్థలాలు పేర్కొంటాను.

నారదుడు వచ్చి ఆ రాజకుమారుని అల్పాయుష్షుని గురించి చెబుతాడు. ఐనా ఆమె తన సంకల్పాన్ని వీడలేదు. అప్పుడు నారదుడు ఆమె భర్త మరణ సమయంలో చేయవలసిన వ్రతాన్ని గురించి ఆమెకు ఉపదేశం చేసి వెళ్లిపోతాడు.

నారదుడు చెప్పిన దినం వచ్చింది. ఆనాడు సావిత్రి తన భర్తతో కూడా అడవికి వెళ్లింది. వటవృక్షాన్ని ఎక్కి ఎండు కొమ్మకొట్ట బోయాడు. ఇంతలో ఆ కొమ్మ విరిగి అతడు కిందపడి మరణించాడు.

యముడు మూడో వరం కోరుకోమంటాడు. సావిత్రి తనకు ఎనమండుగురు కొడుకుల్ని ఇమ్మని అడుగుతుంది. అడావుడిలో యముడు ఇచ్చానంటాడు. ముందుకు పోతాడు. సావిత్రి అప్పుడు తనకు భర్త లేకుండా పిల్లలు ఎలా పుడతారంటుంది. ఇక చేసేదిలేక యముడు ఆమె భర్త ఆత్మను ఆమెకు ఇచ్చివేస్తాడు.

## విమర్శ

సావిత్రి పతిభక్తి నిరూపమానమైంది. పతిభక్తే కాదు, ఆమె తెలివి తేటలు, ధైర్యసాహసాలు కూడా నిరుపమానమైనవే.

మూడు రోజుల ఉపవాసం - గింజలూ, పళ్లూ వాయనం ఇవ్వడము ఇవి సావిత్రి పతిమరణ కాలంలో చేసిన వ్రత చిహ్నాలు కావచ్చు.

కన్యలకు స్వయంగా వరుల్ని సంపాదించుకునే హక్కుగల కాలంనాటికి చెందిన కథ ఇది.

ఆత్మకూడ కనిపించే వస్తువు అనే నమ్మకం ఈ కథలో ద్యోతకమౌతూ వుంది. - **Daughter's of Malwa.**

వట మూలం బ్రహ్మ - మధ్య జనార్దనుడు - చివర శివుడు = సమగ్రంగా సావిత్రి.

నియమితరీతి ఒక సంవత్సరం ఏక భుక్తం. జ్యేష్ఠశుద్ధ త్రయోదశి మొదలు జ్యేష్ఠకృష్ణ పాడ్యమి వరకు. నాలుగో రోజున చంద్రుడికి అర్ఘ్యదానం. సావిత్రికి గంధపుష్పాదులతో పూజ. అనంతరం పూజ. ఏకభుక్త నియమం పెట్టుకునే వారికి ప్రతిదినం వటవృక్ష పూజా నియమం. నాలుగురోజులు మాత్రం పూజ చేసేవారు పాడ్యమినాడు బ్రాహ్మణులకు దానం చేయాలి.

ఈ వ్రతం రాజస్థానంలో సామాన్య ప్రచారం కలది. మహారాష్ట్ర దేశంలో కొంతకలదు. దక్షిణానస్మార్తుల్లో మాత్రమే కలదు. బ్రాహ్మణులే కాక శూద్రులు కూడా ఈ వ్రతం చేయడం కద్దు. వంగదేశంలో ఈనాడు స్త్రీలు వట వృక్ష, సావిత్రి పూజలు చేయక భర్తల పూజ చేస్తారు. భర్తలకు తలంటి పోసి కొత్తబట్టలు కట్టిస్తారు. భర్త పూజ ఐన తరువాత యమపూజ చేస్తారు. వ్రతానికి పేరు మాత్రం వట సావిత్రే అంటారు. చివరిని వటవృక్షశాఖలకు పూజ. పల్లెటూళ్లలో మాత్రం పూజ వటవృక్షాల కింద సాగుతుంది. ఇది కౌటింబిక వ్రతం. **-వ్రతోత్సవ చంద్రిక**

ఈ సావిత్రి కథ ఆంధ్రదేశంలో కొంచెం తేడాగా ఉంటుంది. వినతగింది.

మద్రదేశమునకు రాజు అశ్వపతి. అతని భార్య మాళవి. ఆ దంపతులు పద్దెనిమిది సంవత్సరాలు సావిత్రిదేవిని గఱించి తపస్సు చేసి ఒక కూతురును పొందారు. సావిత్రీదేవి వరాన పుట్టడం చేత ఆమెకు సావిత్రి అని పేరు పెట్టారు. ఏక పుత్రిక కాబట్టి ఆమెను ఎంతో గారాబంగా పెంచారు. ఆమె వరయోగ్య అయింది. ఆమె దివ్య తేజస్సుకు వెఱచి ఎవరున్నూ ఆమెను వరింపలేదు.

ఆమె ఒకానొక పర్వమున స్నానం చేసి ఉపవాసం ఉండి సావిత్రీ దేవికి ప్రీతిగా అగ్నిహోత్రమునందు హోమం చేసింది. బ్రాహ్మణులచేత స్వస్తి వచనం చేయించింది. పూజాశేష పుష్పములను తీసికొని వెళ్లి తండ్రికి నివేదించింది. అప్పుడు తండ్రి ఆమెతో 'బిడ్డా నీకు వివాహోచిత కాలం వచ్చింది. ఇంతవరకు నిన్ను ఎవరూ వరింపలేదు. నీవైన అనురూపగుణుణ్ణి వరించి నాకు తెలుపుము. యుక్తా యుక్తాలు విచారించి నిన్ను ఇచ్చి పెళ్లి చేస్తాను' అన్నాడు.

అప్పుడు ఆమె కొందఱు పెద్దలు వెంటరాగా రథమెక్కి వరాన్వేషణార్థం బయలుదేరి వెళ్లింది. దగ్గర అరణ్యంలో చదువు కొను వయోరూపవిద్యాగుణ సంపన్నుడు, ద్యుమత్సేను పుత్రుడు అగు సత్యవంతుని వరించింది. వచ్చి ఆ విషయం తండ్రికి చెప్పింది. అయితే ద్యుమత్సేనుడు ప్రస్తుతం తనసాళ్వ రాజ్యాన్ని పోగొట్టుకుని అంధుడై అరణ్యంలో ఉంటున్నాడు. ఇంతేకాక అప్పుడు అక్కడికి వచ్చిన నారదుడు సత్యవంతుడు నాటికి యేడాదినాడు మరణించునని చెప్పాడు. దానిమీద అశ్వపతి సావిత్రితో మరి ఒకని వరించమంటాడు. ఏమైనా సరే సావిత్రి తన మనస్సు మార్చుకోదు. అప్పుడు సావిత్రి సత్యవంతుల వివాహం జరిగిపోతుంది. సావిత్రి కాపురానికి వెళుతుంది.

అత్తింట సావిత్రి పతి ఆయుఃప్రమాణాన్ని ఒక్కొక్క దినంగా లెక్కించు కుంటూ ఇక నాలుగుదినాలు గడువు అని గణించుకుని ఆమె త్రిరాత్రోపవాస వ్రతాన్ని పూనింది. నాల్గవనాడు ఉదయమున అగ్నిహోత్రానహోమాలు చేసింది. సూర్యాస్తమయానంతరం పారణ సమయంగా నిర్దేశించుకొన్నది.

ఇంతలో ఫలసమిత్కుశలకు సత్యవంతుడు అడవికి ప్రయాణమయ్యాడు. అతనితో సావిత్రిన్నీ వెళ్లింది. అడవిలో అతడు గొడ్డలితో సమిధలు కూరుస్తూ తలనొప్పిగా ఉన్నదని సావిత్రి తొడమీద తలపెట్టుకుని పడుకున్నాడు. ఇంతలో సత్యవంతుడు ప్రాణములు తీసికొని వెళ్లుటకు యముడు వచ్చాడు.

మగనితల నేలమీద ఉంచి సావిత్రి లేచి నిలుచుండి అతనికి నమస్కరించి మీరెవరని ప్రశ్నిస్తుంది. తానుయముడననీ, సత్యవంతుని ప్రాణాలుకొనిపోవడానికి వచ్చాననీ చెప్పాడు. సత్యవంతుని ప్రాణాలు తీసికొని పోతూ ఉంటాడు. నియతవ్రత సిద్ధ అయిన సావిత్రి అతని

వెంట పడినది. ఆమెను అతడు వెళ్లి పొమ్మంటాడు. పతిని విడచి తాను పోజాలనంటూ ఆమె అతని వెంట వెళుతూ ఉంటుంది. అప్పుడు నీపతిప్రాణాలు తప్ప మిగతా ఏదైనావరం కోరుకోమంటాడు. అప్పుడు ఆమె మామకు దృష్టి ప్రసాదింపుమని కోరుతుంది. రెండో వరంలో ఆమె మామరాజ్యాన్ని తిరిగి పొందేటట్లు వరం అడుగుతుంది. మూడోవరంతో తన తండ్రికి నూర్గురు కొడుకులను కోరుతుంది. ఇట్లా వరాలు పొందిన్నీ ఆమెయను నినివిడున కుండా వెంటనండే ఉంటుంది. నాలుగో వరంలో తనకు సత్యవంతుని వలన నూరుగురు కొడుకులు పుట్టేటట్లు వరం అడుగుతుంది. యముడు ఆవరాన్ని ఇస్తాడు. సత్యవంతుని పాశవిముక్తుని చేస్తాడు. అతనిని తీసుకుని, సావిత్రి భర్తకళేబరము వద్దకు వస్తుంది. ఆ కళేబరాన్ని తన తొడపై పెట్టుకుని కూర్చుంటుంది. అతడు లేచి కూర్చుంటాడు. అప్పటికే రాత్రి బాగా పొద్దుపోతుంది. వారు తొందరగ ఆశ్రమానికి వెళ్లినారు. భర్త జీవితార్థము తాను సలిపిన వ్రతం అనేక విధాలను సుఖ ఫలితాన్ని ఇచ్చిన వైనం అచటివారికి సావిత్రి చెబుతుంది. సావిత్రి ఆవ్రతం వల్ల తన్ను, తల్లి తండ్రుల్ని, అత్తమామల్ని, భర్తను ఉద్ధరిస్తుంది. లోకములోనివారు అందరూ ఆమెను మహాసాధ్వి అని కొనియాడారు.

జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాడు సావిత్రీ వ్రతం చేస్తే సౌభాగ్యం వృద్ధి అవుతుంది. జ్యేష్ఠశుద్ధ త్రయోదశి మెదలు ఉపవాసము పూర్ణిమ. మూడవరోజు. నాలుగవరోజు సాయంత్రం చంద్రోదయమైన తరువాత భోజనం.

మూడురోజులు ఉపవాసం చేయలేనివారు పూర్ణిమతిథి ఒక్కనాడైనా ఉపవాసం చేసి సావిత్రీ వ్రతం చేయాలి. ఈ వ్రతం చేసే పుణ్యస్త్రీలకు వైధవ్యమనేది ఉండదు. నిరంతరసౌభాగ్యం కలుగుతుంది.

వట సావిత్రీ వ్రతాన్ని త్రయోదశినాడు ప్రారంభించి ఈనాడు ముగిస్తారని చతుర్వర్గ చింతామణి.

## ఏరువాక పూర్ణిమ

జ్యేషపూర్ణిమనాడు ఏరువాక సాగడం అను స్యూతంగా వస్తూ ఉంది. ఎడ్లను, నాగలిని పూజించి కర్షకుడు శుచివస్త్రధారియై మౌనం వహించి యేరువాక కర్మను చేయాలని కలదు. అయితే ఈ కర్మకు జ్యేష్ఠ పూర్ణిమ ఎందుకు వరణీయమైంది అనే ప్రశ్న కలగడం సహజం.

పారస్కరుడు తన గృహ్యసూత్రాలలో హలకర్మకు జ్యేష్ఠాస్వాతీ నక్షత్రాలు మంచివని చెబుతున్నాడు. జ్యేష్ఠపూర్ణిమనాడు ఓషధీపతి అగు చంద్రుడు హలకర్మకు మంచి నక్షత్రమైన జ్యేష్ఠకు దగ్గరగా ఉంటాడు.

ఏరువాకను గురించి, నాగలిని గురించిన జానపద గేయాలు ఉదాహరించి ఉన్నాను.

ఏరువాక పున్నమిని గురించి మన సినీమా సాహిత్యంలో కూడా ప్రత్యేకంగా ప్రస్తావన వుంది.

**ఏరువాక వచ్చిందిరా**
**దుక్కిటెద్దు రంకె వేసిదిరా**
**తొలకరింపు పులకరించిందిరా**
**నిండు - పూర్ణిమంబు పృష్పించెరా**
**నీ - భూదేవిని పూజసల్పరా...**
**-కొసరాజు రాఘవయ్య చౌదరి రైతుబిడ్డలో**
**ముద్దుల యెద్దుకు - ముత్యాలసరులు**
**రంగుల యెద్దుకూ - రత్నాలసరులు**
**ముద్దుల... -గూడవల్లి రామబ్రహ్మం రైతుబిడ్డలో**

ఈ రోజు వ్యవసాయదారుల నమ్మకాల గురించి తెలుసుకొందాం.

ఈ రోజున ఎవరికీ అప్పు - బదులు యివ్వరు. డబ్బు పెట్టి ఏమి కొనరు. ఇంట్లోదేమో బయటకు పోకూడదు. కావలసిన వస్తు సామాగ్రి అంతా ముందురోజునే తెచ్చుకుంటారు. ఏరువాక సాగిననాడు నిప్పుకూడా పెట్టరు. శూద్రులు కోడిని కోసుకుంటారు. బ్రాహ్మలు కొబ్బరికాయలు కొట్టుకుంటారు. ఇంట్లో పిండివంటలు.

పంచాంగంలో సున్నాలు లేనివానిచేత పాలేరయినా సరే చిన్న కుర్రాడయినా సరే నాగలి పూయిస్తారు. -ముద్దా విశ్వనాథం.

'ఎద్దులు లేని సేద్యం చద్దిలేనిపయనం' - 'ఒంటియెద్దు సేద్యం వరిగాలునొప్పి', 'గొడ్లు, వడ్లు ఉన్నవాడిదే వ్యవసాయము', 'ఎక్కువ వెల పెట్టి గుడ్డను, తక్కువ వెల పెట్టి గొడ్డును కొనకూడదు' అనే సామెతల వల్ల ఎద్దుల ప్రాముఖ్యం వెల్లడవుతూ ఉంది.

కట్టమన్ను అయితే కాపు బతుకుతాడు, దుక్కిచలవే చలవ, తల్లి పాలే పాలు: దుక్కిగల భూమి దిక్కు గల మనుష్యుడూ చెడడు, అరక అరిగితే గరిసె విరుగును. దుక్కి ప్రాముఖ్యాన్ని గుర్తించారు. కాబట్టి

దుక్కికిసాధనాలయిన ఎద్దుల ప్రాముఖ్యాన్ని గుర్తించారు.

బండలు పగిలే భరణి కార్తె ఎండలు-రోళ్లుపగిలే రోహిణి కార్తె ఎండలు వెనకబడ్డాయి. మృగశిర కార్తెతో ముంగిళ్లు చల్ల బడతాయి. ఆ మీద ఆరుద్రవాన అదునువాన. వ్యవసాయానికి అనుకూలమైనకాలం. రోహిణిలో విత్తనాలు చల్లితో రోళ్ళునిండని అల్పపుపంట అని మనరైతులకు అనుభవపునరుక్త విషయం.

పద్మపురాణపు ప్రతిని జ్యేష్ఠమాసపు పూర్ణిమ యందు దానం చేస్తే అశ్వ మేధఫలము.

జ్యేష్ఠపూర్ణిమనాడు కృష్ణాజిన దానం పుణ్య ప్రదమంటారు. కృష్ణాజినం మీద కూర్చోవడం కాని పడుకోవడం కాని కఫహారంగా ఉంటుంది. జడత్వాన్ని మాంద్యాన్ని పోగొడుతుంది.

జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ ధర్మసావర్ణిమన్వంతరాది దినము. ధర్మ సావర్ణి పదకొండో మనువు. అతడు ధర్మ దేవత పుత్రుడు వృషనామకుడు అతని కాలమున ఇంద్రుడు. ఈ ధర్మ దేవత పుత్రుడు వృషనామకుడు అతని కాలమున ఇంద్రుడు. ఈ ఇంద్రుని 'వైధృత' అనే నామాంతరం ఉంది. హవిష్యంతుడు, అగ్నిదేవుడు మున్నగు వారు సప్తర్షులు.

## జ్యేష్ఠబహుళ అష్టమి

తిందుకాష్టమీ వ్రతమని చతుర్వర్గ చింతామణి ఏడాదిపాటు ప్రతిమాసం శివపూజ చేయాలి.

వినాయకాష్టమి అని నీల మత పురాణము

త్రిలోచనపూజ, శీతలాష్టమి.

## జ్యేష్ఠబహుళ ఏకాదశి

ఆమాదేర్ జ్యోతిషీ అనే గ్రంథం. ఈ ఏకాదశిని యోగిన్యేకాదశి అని పేర్కొంటూ ఉంది.

కుబేరుడు ప్రతిదినమూ శివపూజ చేస్తూ ఉండేవాడు. ఆ పూజకు అతని తోటమాలి ప్రతిదినమూ పూవులు తెస్తూ ఉండేవాడు వాడు భార్యాలోలుడై వేళకు కుబేరుడికి పూవులు అందీయలేకపోయాడు. పూజకుపువ్వులు లేక కుబేరుడికి పట్టరాని కోపం వచ్చింది. అప్పుడు అతడు తోటమాలిని కుష్ఠురోగపీడితుడు కావలసిందిగా శపించాడు.

కుష్ఠురోగి అయి బాధపడుతూ అతడు ఈ ఏకాదశినాడు ఏకాదశివ్రతాన్ని శాస్త్రయుక్తంగా చేశాడు. దానికి ఫలితంగా అతని కుష్ఠురోగం కుదిరింది.

**జ్యేష్ఠ శుక్ల బహుళ చతుర్దశి**

**మాసశివరాత్రి అని అమాదేర్జ్యోతిషీ.**

**జ్యేష్ఠబహుళ అమావాస్య**

**శ్రాద్ధసమయ విశేషమని తిథితత్త్వము.**

## వట సావిత్రి.

మట్టి చెట్టుకింద ఉన్న సావిత్రిని రాత్రి పూజించాలి. ఈ వ్రతాన్ని జ్యేష్ఠపూర్ణిమకు చేస్తారు. లేదా జ్యేష్ఠ అమావాస్యనాడు చేయవచ్చు. ఈనాడు స్త్రీ ఉపవసించి జలముతో వట వృక్షాన్ని తడపాలి. ఆ చెట్టు చుట్టూ నూట ఎనిమిది సారులు దారం చుడుతూ ప్రదక్షిణం చేయాలి.

**జగత్పూజ్యే జగన్మాతః సావిత్రి పతిదైవతే.**

**పత్యాసహావియోగం మేవటస్థే కురుతేనమః**

ఈ విధంగా ప్రార్థించాలి. మరునాడు సువాసినీ స్త్రీలకు భోజనం పెట్టాలి. ఈ వ్రతం చేసే స్త్రీ సర్వదాసౌభాగ్యవతి అయి ఉండును.

## మిథునసంక్రాంతి

భోగశాయి పూజచేసి ఈనాడు ఉపవాసం ఉండాలని హేమాద్రి చెప్పుచున్నాడు.

ఈనాడు సుజన్మావాప్తి వ్రతం, సంక్రాంతి స్నానవ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి.



# ఆషాఢము

ఇది సంవత్సరంలో నాలుగో మాసం.

ఆషాఢమాసంలో గృహనిర్మాణానికి ఆరంభించిన భృత్య రత్న పశుప్రాప్తి అని మత్స్య పురాణము.

ఆషాఢమాసంలో ఒకసారైనా గోరింటాకు పెట్టుకోవాలంటారు.

ములగ కూర బాగా తినాలి అంటారు.

అనపపప్పు వాడాలంటారు.

**ఆషాఢ శుద్ధ విదియ**

రథయాత్రో మనోరథ ద్వితీయా జగన్నాథస్వామి రథయాత్ర.

ఈనాటి వివరణలో మన పంచాంగకర్త 'జగన్నాథక్షేత్రేరథోత్సవః' అని వ్రాస్తారు.

భక్తి పరులైన తెలుగు పెద్దలు పూరీజగన్నాథస్వామిని గురించి.

**'నీలాచల నివాసాయ**
**నిత్యాయ పరమాత్మనే**
**సుభద్రా ప్రాణనాథాయ**
**జగన్నాథాయ మంగళమ్.'**

అనేశ్లోకం తరుచు చదువుతూ ఉంటారు.

జగన్నాథుడు శ్రీకృష్ణుని అపరావతారంకదా! పైశ్లోకాన్ని పట్టి శ్రీకృష్ణుని అష్ట భార్యల్లోనూ ఒకతెయైన భద్రాదేవి ఈ అవతారంలో సుభద్రనామంతో జగన్నాథస్వామి భార్యఐనట్లు స్ఫురిస్తుంది.

ఈస్ఫూరణ ఇట్లా ఉండగా శ్రీ చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఈ సందర్భంలో వేరొక సంగతి వెల్లడించారు.

అర్జునుడికి చేపట్టిన శ్రీకృష్ణసోదరి సుభద్ర ఉన్నదికదా! ఆసుభద్ర ఒకసారి శ్రీకృష్ణుని నీకుఏమి కావాలో కోరుకోమన్నాడట. అప్పుడు ఆమె తనకు శ్రీకృష్ణుడు వంటి భర్త కావాలన్నదట. అందుమీద శ్రీకృష్ణుడు సుభద్రతో అవతారాంతర మందు నీకోరిక చెల్లుతుందన్నాడట. జగన్నాథస్వామిగా పూరీలో అవతరించినపుడు శ్రీకృష్ణుడు సుభద్రను భార్యగా స్వీకరించాడట అందుచేతనే 'సుభద్రాప్రాణనాథాయ! జగన్నాథాయ' అనే ప్రయోగం పుట్టిందిట.

ఇత్యాదిగా శ్రీ వెంకటశాస్త్రిగారు వ్రాసి ఉన్నారు. ఈ విషయమై మరి ఇద్దరు ముగ్గురు పండితులను కూడా అడిగి ఉన్నాను. వారున్నూ ఇట్లే చెప్పిఉన్నారు.

హిందూదేశచరిత్రలో మహమ్మదీయుల మొదటిదాడికి ఎదురొడ్డినిలిచిన దాహిరురాజు చెల్లిల్ని పెళ్లిచేసుకున్న అనాచారి అని చదివినప్పుడూ, పృధ్వీరాజు రాణీ సంయుక్తను హిందూధర్మశాస్త్ర విరుద్ధమైన వివాహం చేసుకున్న మ్లేచ్ఛ సాంప్రదాయపు దంపతులనీ చదివినప్పుడు ఒక విధమైన జుగుప్సపుట్టుకు వస్తుంది.

దాహిరురాజు, పృధ్వీరాజు చేసిన అశుచిప్రాపక కార్యానికి శ్రీకృష్ణుడు ఒజ్జబంతి ఐనాడా!

ఈ సందేహం నన్ను చిరకాలంగా వేధిస్తానే ఉంది. సందర్భమైనప్పుడల్లా పండితులతో ఈనాసందేహం సంగతి చెబుతానే వచ్చాను.

నాడుపూరీ జగన్నాథస్వామి రథోత్సవం ముగిసే ఆషాఢ శుద్ధపూర్ణిమ. శ్రీకంథంపాటి రామకృష్ణ శాస్త్రిగారనే ఒక పండిత ప్రకాండునితో సంభాషణవశాన్ని 'సుభద్రా ప్రాణనాథాయ! జగన్నాథాయ!' అనే శ్లోకం సంగతి ఎత్తాను. ఈ సందర్భంలో ఆయన చెప్పినసంగతులు ఆంధ్రదేశంలోని పూరీజగన్నాథ భక్తులు అందరూ తెలిసికో తగ్గవిగా ఉన్నాయి.

"రెౌత్రి సవంత్సరంలో ఆషాఢమాసంలో నేను పూరిజగన్నాథం పోయి ఉన్నాను. రథయాత్ర జరుగుతూ ఉంది. స్వామి జగన్నాథం నుంచి ఇంద్రద్యుమ్నానికి వెళుతున్నాడు. అక్కడ మూడురోజులు ఉండి శుద్ధ ఏకాదశినాటికి తిరిగి జగన్నాథం చేరుతాడు. ఆలయందగ్గరనుంచి ఒక దాని ప్రక్కను ఒక రథంగా మూడురథాలు బయలుదేరుతాయి. మొదటి రథంలో జగన్నాథస్వామి వేంచేసి ఉన్నారు. దానికి కుడితట్టున ఉన్న రథంమీద సుభద్రాదేవి ఉంది. దేవి రథానికి కుడితట్టున్న ఉన్న రథం మీద బలభద్రుడు ఉన్నాడు. ఇప్పుడు మీరు అనుకుంటూ ఉన్నట్లే అప్పుడు నేను కూడా సుభద్ర జగన్నాథస్వామి యొక్క దేవేరి అనే అనుకునేవాడిని. నాఅభిప్రాయాని కిన్నీ పైశ్లోకమే కారణం. రథాల స్థితినిబట్టి నాకు అప్పుడు ఒక సందేహం వచ్చింది. భార్య రథం స్వామిరథానికి ఎడమప్రక్కను పెట్టక కుడిప్రక్కను ఉంచారేమా అని! జగన్నాథానికి సమీపమందుండే వీరభద్రబలపురం కాపురస్థులూ, తార్కికపండితులూ, అప్పుడు అక్కడికి వచ్చి ఉన్నవారూ ఐన మధుసూదన మిశ్రుడనే ఆయన్ని ఈ విషయమై

సంస్కృతభాషలో అడిగాను. ఆంధ్రప్రాంతంలో వాడుకలో ఉన్న శ్లోకాన్ని, ఆశ్లోకానికి ఉపపత్తి కలిగిస్తూ మనవారు చెప్పేగాథనీ ఆయనకు చెప్పాను. అందుమీద ఆయన నేను చదివిన శ్లోకపాఠం అపపాఠమనీ, తమ ఓఢ్రదేశంలో ఆశ్లోకం ఆ మాదిరిగా లేదనీ చెబుతూ సరియైన శ్లోకపాఠం ఇట్లా చదివారు:

**నీలాచల నివాసాయ**

**నిత్యాయ పరమాత్మనే**

**సుభద్రా బలభద్రాభ్యామ్**

**జగన్నాథాయ మంగళమ్.**

దేవాలయ మందలి పురోహిత మంటపంలోని వృద్ధపండితులు కూడా మా ఉభయుల ఎదుట 'సుభద్రా బలభద్రాభ్యామ్! జగన్నాథాయ మంగళమ్' అనే పాఠంతోనే సదరు శ్లోకాన్ని చదివారు. చదివి మధుసూదన మిశ్రునితోబాటు వారున్నూ సుభద్ర శ్రీకృష్ణుని భార్యకాదన్నారు. సుభద్రతోనూ, బలభద్రునితోనూ కూడిఉన్న జగన్నాథ స్వామికి మంగళమనే ఆశ్లోకచరణ తాత్పర్యమన్నారు. ఐతే ఈ సుభద్ర ఎవరని నేను మధుసూదన మిశ్రుని అడిగాను. ఆయన ఇట్లా చెప్పారు. ఈ శ్లోకంలో ప్రస్తావితమైన సుభద్ర మీపుక్కిటి గాథల్లోని సుభద్ర కాదు. శ్రీకృష్ణుని అష్టమహిషిల్లోని సుభద్రకూడా కాదు. దేవకీ గర్భమున పెరుగుతూ ఉండిన బలరాముణ్ణి రోహిణీ గర్భములోకి మార్చిన దిన్నీ; తాను యశోద గర్భమున స్త్రీ శిశువుగా జన్మించి తనను దేవకివద్దకును, దేవకీ అష్టమగర్భంలో పుట్టిన శ్రీకృష్ణుని యశోదవద్దకున్నూ మార్చుటకు అవకాశము కల్పించినదిన్నీ, కంసుని చేతపైకి ఎగురవేయబడినదిన్నీ, భద్ర, సుభద్ర, భద్రకాళి మొదలైన పన్నెండు నామాలతో ప్రఖ్యాతమైనదిన్నీ అయిన యోగమాయాదేవి ఈ సుభద్ర. ఈ విషయమంతా స్థల పురాణంలో ఉందా. సోదరి సోదర సహితుడై స్వామి ఊరేగుతూ ఇంద్రద్యుమ్నానికి వెళ్లి వస్తాడు. జగన్నాథస్వామి దేవేరి లక్ష్మి ఈ ఊరేగింపుతో ఇంద్రద్యుమ్నానికి వెళ్లదు. దేవి ఆలయం ప్రాకారంలో విడిగా గర్భగుడికి కొంచెం వెనుకగా ఎడమవేపున ఉంది. తమరు వెళ్ళి చూడండి. స్వామి, సుభద్ర, బలభద్రుడు ఇంద్రద్యుమ్నానికి పోయివచ్చిన తరువాత దేవి వెంటనే తలుపు తియ్యదు. మూడురోజుల తరువాత తీస్తుంది. మూడురోజులూ స్వామి సోదర సోదరీ సహితుడై బయటనే ఉండిపోతాడు. ఇవి అన్నీ దాఖలాగా మీరు చూస్తారుగా' అన్నాడా పండితుడు.

రామకృష్ణశాస్త్రిగారు చెప్పిన ఈ విషయాన్ని పట్టి జగన్నాథస్వామి విషయంలో ఆంధ్రప్రాంతంలో పాదుకొని ఉన్న గాధ అశుచిప్రాపకమైన పుక్కిటిగాధ అని నిశ్చయమవుతూంది.

జగన్నాథము పురుషోత్తమక్షేత్రము. దీనికి సంబంధించిన ఒక కథ ఉంది.

జగన్నాథుడైన కృష్ణుడు నిర్యాణం చెందగా అతని దేహాన్ని దహనం చేస్తూ ఉన్నారు. ఆ సమయంలో సముద్రం పొంగి ద్వారకా నగరాన్ని ముంచి వేసింది. సంపూర్ణంగా దగ్ధంకాని జగన్నాథుని దేహం సముద్రంలో కొట్టుకొని పోవడం ఆరంభించింది. దానిని కొందరు భక్తులు పట్టుకుని దారువు నందు సంపుటం చేసి ఓఢ్రదేశంలోని పూరీలో స్థాపించారు. అందుచేత ఇది జగన్నాథక్షేత్రం అయింది.

ఆషాఢశుక్ల పక్షపు విదియ - జగన్నాథస్వామి వారి రథోత్సవానికి ప్రసిద్ధి.

### ఆషాఢశుద్ధ పంచమి

"ఆషాఢశుద్ధ పంచమ్యాం వచ్చెనె వృద్ధ గౌతమీ అథవా తప్పి దారేణ ద్వాదశ్యామది తప్పదు." అని గోదావరి తీరవాసుల్లో ఒక చాటూక్తి కలదు. ఆషాఢశుద్ధ పంచమిని తప్పితే ద్వాదశని గౌతమికి వరదనీరు వస్తుందని పై చాటూక్తి భావం.

'ఆడిపదినెట్టు' అని కావేరీతీరవాసులు ఒక పండుగ చేస్తారు. ఆడిపదినెట్టు అనగా ఆడామాసం పద్దెనిమిదో రోజు అని అర్థం. ప్రాయికంగా ఆ నాటికి కావేరికి కొత్తనీళ్ళు వస్తాయి. వ్యవసాయపు పనులకు తరుణం అవుతుంది. ఆడి మాసం ఇంచుమించు మన ఆషాఢమాసం.

### ఆషాఢశుద్ధ షష్ఠి

**స్కందవ్రతము -స్మృతికౌస్తుభం**

ఈ వ్రతములో సుబ్రహ్మణ్యేశ్వరుని షోడపచారాల చేత పూజించాలి. ఉపవాసం ఉండాలి. జలమును మాత్రం పుచ్చుకోవచ్చు. మరునాడు కుమారస్వామిని దర్శించాలి. శరీరారోగ్యం కలుగుతుంది.

### ఆషాఢశుద్ధ సప్తమి

వివస్వత్సప్తమీ పురుషార్థ చింతామణి వివస్వన్నామో భాస్కరస్యోత్పతిః **తత్పూజనంచ.**

విత్రాఖ్య భాస్కర పూజా అని నీల మత పురాణము. ద్వాదజ

సప్తమీ వ్రతము. చతుర్వర్గ చింతామణి.

**ఆషాఢశుద్ధ అష్టమి**

మహిషఘ్నీపూజా. స్మృతికౌస్తుభం

దుర్గాష్టమీ, పరశురామియాష్టమీ. గదాధరపద్ధతి

మహిషాసురమర్దనీపూజ.

**ఆషాఢశుద్ధ నవమి**

ఐంద్రీ దుర్గా పూజా స్మృతి కౌస్తుభం

ఐంద్రాదేవి పూజ

**ఆషాఢశుద్ధ దశమి**

జగన్నాథస్య పునర్యాత్రా మాన్యాదిః చాక్షుసమన్యాదిం

శాకవ్రత మహాలక్ష్మీ వ్రతారంభం. దధి వ్రతారంభం.

ఈనాడు మహాలక్ష్మి పూజ చేసి ఒక నెల ఆకుకూరలు తినుటమాని ఆకుకూరలు దానం చేయాలి.

ఆషాఢశుద్ధ దశమి చాక్షుషమన్వంతరాది దినము. చాక్షుషమనువు మనువుల్లో ఆరోవాడు. అతని వివరాలు వినదగ్గవి.

అనమిత్రుడని ఒకరాజు. అతని భార్య గిరి భద్ర. వారికి సర్వలక్షణ లక్షితుడైన ఒకకొడుకు పుట్టాడు. పురిటింటిలో గిరిభద్ర కుమారుని మక్కువతో అక్కున చేర్చుకుని ముద్దు పెట్టుకుంది. ఆ శిశువు ఫక్కున నవ్వాడు. ఆ వింత నవ్వుకు కాణం ఏమిటని ఆమె బిడ్డని అడిగింది. అప్పుడు ఆ కుఱ్ఱాడు ఇట్లా చెప్పాడు. నన్ను మింగడానికి జాతహారిణి అనే మార్జారం పొంచి ఉంది. అది తెలిసి కొనక నన్ను పుత్ర ప్రేమ చేత ముద్దు పెట్టు కుంటున్నావు. నీకు నాకు పరిచయం ఐదారు దినాలది. ఇంతలో ఇంత వ్యామోహంతో ఉన్నావు!

కుఱ్ఱాడు ఇట్లా చెప్పగా గిరిభద్ర కోపగించుకొని నేను చేసే పని నీకు నచ్చక పోతే పురిటింటిలో నుంచి వెళ్లిపోతాను అంటూ వెళ్లిపోయింది. ఆమె వెళ్లి పోవడంతోటే జాతహారిణి వచ్చి ఆ బాలుని తీసుకుని పోయి విక్రాంతుడనే రాజు యొక్క భార్య హైమిని ప్రసవించి ఉన్న శయ్యయందు ఉంచి అచటి బిడ్డను మఱి ఒక యింటికి కొనిపోయి అక్కడ పెట్టి, ఆ యింటిలో పుట్టిన శిశువును తివేసింది.

అంత అక్కడ విక్రాంతుడు తన కొడుకు పుట్టిన విషయం తెలుసుకుని చాలా ఆనందించి అతనికి ఆనందుడు అనే పేరు పెట్టాడు.

ఉచిత వయస్సు రాగా ఆనందునికి ఉపనయనం చేశారు. ఆ సందర్భంలో గురువు అతనిని తల్లికి దండం పెట్టమంటాడు.

అప్పుడు ఆ బాలకుడు గురువుతో ఇట్లా అన్నాడు. గురువర్యా! నేను ఏ తల్లికి నమస్కారం చేయాలి! నన్ను కన్నతల్లి ఒకతె, పెంచిన తల్లి మఱిఒకతె. అందుమీద గురువు ఆశ్చర్యపడి హైమిని నీతల్లి కాదా అని అడిగాడు. అప్పుడు శిష్యుడు 'అయ్యా'! ఈమె విశాల గ్రామమందు ఉన్న చైత్రునకు తల్లి. ఈమెనాకు తల్లి కాదు. జాతహారిణి అనే మార్జారం ఆతికమకలకు అన్నిటికీ కారణం. ఇప్పుడు నేను ఎవరికి నమస్కరించాలి! అన్నాడు.

గురువు ఈ ధర్మసంకటాన్ని తీర్చలేకపోయాడు. చైత్రుని రావించు కోవలసిందిగా విక్రాంతికి చెప్పి ఆనందుడు బ్రహ్మను గురించి తపము చేయడానికి వెళ్లిపోయాడు. కొంతకాలము తపము చేయగా బ్రహ్మప్రత్యక్షమయ్యాడు. ఆనందుడు అతనిని ముక్తిని అర్థించాడు.

అప్పుడు బ్రహ్మ ఇట్లా చెప్పాడు 'నీవు మనువు కావలసి ఉంది. జన్మాంతర కృతమైన తపమువలన నీవు ఆరవ మనువు కావలసి ఉంది. మన్వాధికారాన్ని నిర్వర్తించిన తరువాత నీకు ముక్తి కలుగుతుంది. కాబట్టి నీవు ఇప్పుడు తపంమానివేయి. పూర్వజన్మలో నీవు. నాచక్షుస్సు వలన పుట్టావు. కాబట్టి ఇప్పుడు నీవు చాక్షుషమనువు అనే నామంతో వెలయగలవు' అన్నాడు.

అందుమీద చాక్షుడు తపం కట్టిపెట్టి ఉగ్రుడనేరాజు కూతురు అయిన విదర్భను వివాహమాడాడు.

అతని మన్వంతరమున మనోజవుడు అనేవాడు ఇంద్రుడు. సుమేధ, అతి నామ మున్నగువారు సప్తర్షులు.

**ఆషాఢ శుక్ల ఏకాదశి**

ఆషాఢ శుక్ల ఏకాదశికి 'మహాఏకాదశి' అని పేరని వ్రతోత్సవ చంద్రిక అంటున్నది. గ్రంథాంతరాల్లో ప్రథమైకాదశి అనే నామం కనిపిస్తున్నది.

ఏడాదికి ఇరవైనాలుగు, అధికమాసం వచ్చినప్పుడు ఇరవై ఆరు ఏకాదశులు ఉంటుండగా ఈ ఒక్క ఏకాదశిని మహాఏకాదశి అనీ, ప్రథమైనకాదశి అని గొప్పగా చెప్పడానికి కారణం అరయ తగింది.

**తొలి ఏకాదశి**

ప్రథమైకాదశి అనుసంస్కృత నామాన్నిపట్టి తెలుగువారు దీనిని తొలిఏకాదశి అని వ్యవహరిస్తున్నారు.

చాతుర్మాస్యదీక్షాదినాల ఏకాదశుల్లో మొదటిదికావడం చేత దీనికి ప్రథమైకాదశి అని పేరు వచ్చింది.

దీనికి ఈ పేరు రావడానికి మరి ఒక కారణం కూడా ఉండి ఉండవచ్చు.

ఉత్తరాయణంలోకంటె దక్షిణాయనంలో పండుగలు, పబ్బాలు ఎక్కువ. దక్షిణాయనంలో ఆరోగ్య పరిరక్షణార్థం నియమాలు ఎక్కువగా పాటించవలసి ఉండడంచేత నియమ పాలనార్థం ఈ కాలంలో మన పెద్దలు వ్రతాలు ఉత్సవాలు ఎక్కువగా పెట్టారు. అట్టి పండుగలకు, పబ్బాలకు బోణీవంటిది ఈ ఏకాదశి.

ఇప్పటినుంచి ఒకదాని తురువాత ఒకటిగా వచ్చిపడే పండుగలకు, పబ్బాలకు ఇది తొలిది కాబట్టి దీనికి తొలిఏకాదశి అని పేరు వచ్చి వుంటుందని అనుకోవచ్చు.

తొలి ఏకాదశి పండుగను గురించి బ్రహ్మ వైవర్తపురాణంలో వివరింపబడివుంది.

ప్రాయకంగా ఇది నిష్ఠాపరులకు ఉపవాసదినం. చాతుర్మాస్య వ్రతానికి ప్రారంభదినం. ఈనాటినుంచి నాలుగుమాసాలపాటు ప్రతిదినము పురాణగ్రంథాలు పఠిస్తారు.

విష్ణువుకు ప్రియమైంది

అన్ని ఏకాదశుల్లోకి ఇది విష్ణువుకు బాగా ప్రియమైంది.

విష్ణు సంబంధంగా ఈ పర్వానికి రెండు పౌరాణిక గాథలు ఉన్నాయి.

**ఒకటి:** ఈరోజు మొదలు విష్ణుమూర్తి నాలుగు నెలలు పాతాళలోకంలో బలిచక్రవర్తి ద్వారం వద్ద ఉండి కార్తీకశుద్ధ ఏకాదశికి వెనక్కి తిరిగివస్తాడని! చెప్తారు.

**రెండు:** ఈదినం మొదలు విష్ణుమూర్తి నాలుగు నెలలపాటు క్షీరసముద్రంలో శేషశాయియై పండుకొని కార్తీకశుద్ధ ఏకాదశికి మేలుకొంటాడని పురాణాలు చెప్తున్నాయి.

ఈ రెండవ గాథను పురస్కరించుకుని ఈ పండుగకు దేవశయని అనే పేరు పురాణాలు పేర్కొంటున్నాయి. గదాధరపద్ధతి దీనిని హరిశయనం అంటున్నది. ఈసందర్భంలోనే దీనికి శయనైకాదశి అనే పేరు వచ్చింది.

విష్ణ్వాలయాల్లో ఈనాటిరాత్రి విష్ణుశయనవ్రతాలు చేస్తారు. విష్ణువిగ్రహాన్ని ఆభరణాదులతో అలంకరించి జాజిపువ్వులచేత పూజిస్తారు.

పవళింపు సేవ చేస్తారు. కీర్తనలు పాడతారు. చంద్రభాగానదీ తీరాన ఉన్న పండరిపురంలో ఈనాడు చూడతగిన గొప్పఉత్సవం జరుగుతుంది.

## గుంటూరు మండలంలో

ఇక తెలుగుదేశపు వ్యవహారంలో ఈ పండుగ జరపబడే తీరు కొంత పరికిద్దాము.

గుంటూరు మండలంలో కొన్ని ప్రాంతాలలో దీనిని "పేలాపుపిండి" పండుగ అంటారట. పేలాలు విసిరి పిండిచేసి బెల్లంలో కలుపుకుని తింటారనీ, ఆపేలాలపిండి మీద చల్లుకోవడం కూడా ఆచారమై ఉందనీ ఒకరంటున్నారు.

## గోదావరి మండలంలో

ఉభయ గోదావరి మండలాల్లో మాగాణి గ్రామాల్లో రైతులు ఈనాడు కొత్త పాలేళ్లను కుదుర్చుకుంటారు. అచ్చటి పాలేళ్లకు తొలిఏకాదశి, దానికి ముందు దినాలుఆటవిడుపు దినాలు. తొలిఏకాదశినాడు కాని, దానితరువాత నుంచి రోజునగాని కొత్త పాలేళ్లకు కొత్త కర్రబట్టలు ఇచ్చి పిలిచి తీసుకువచ్చి పిండివంటలతో భోజనం పెడతారు.

## నెల్లూరు మండలంలో

'ఏరుముందా ఏకాదశి ముందా! అని నెల్లూరు జిల్లాలో ఒకసామెత ఉంది. ఆ సామెత తొలిఏకాదశికి సంబంధించినదని శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య ఇట్లు వ్రాస్తున్నారు.

"సామెత ఆషాఢ శుద్ధఏకాదశిని గూర్చి పుట్టినది. ఆషాఢము నుంచియే మేఘోదయముగుచుండుటచే యేరువాక పనుల ప్రారంభించు వారు ఏటినీళ్లకెదురు చూచుచుందురు, సామాన్యముగా ఆషాఢ శుద్ధైకాదశి సరికట్ల పెన్నానదికి కొత్తనీళ్లు వచ్చుటకలదు. అందుచేత ఏరును, ఏకాదశియు పంతములు వేసికొని నేను ముందా! నీవు ముందా! అని త్రోసికొని వచ్చునని అలంకారోక్తి ఈ సామెత యేర్పడినది. ఇప్పటికిని సాధారణముగ ఈ ఏకాదశికి కొంచెము వెనకముందులుగా ప్రవాహము వచ్చుట కలదు.

## పిప్పల వృక్షం

ఈ ఏకాదశినాడు చాతుర్మాస్య వ్రతం ఆరంభిస్తారు.

చాతుర్మాస్య వ్రతాచరణక్రమం బ్రహ్మవైవర్త పురాణంలో కలదు. ఆషాఢమాస శుక్లపక్ష ఏకాదశినాడు ఉపవాసం ఉండి చాతుర్మాస్య వ్రతకల్పం

ప్రారంభించాలని భగవంతుడు యుధిష్ఠరునకు చెప్పినట్లు అందుకలదు.

శయనింప పెట్టిన విష్ణుమూర్తికి పూజ చాతుర్మాస్య వ్రతం మొదలుకొని ఏకాదశి, ద్వాదశి, అమావాస్య, అష్టమి, కర్కాటక సంక్రాంతి మున్నగు పర్వాలనాడు ఉపవాసాలు ఉంటూ కార్తీక శుక్ల ద్వాదశికి ఆవ్రతం పూర్తి చేయాలి.

చాతుర్మాస్యవ్రతంలో పిప్పల వృక్షానికి ప్రదక్షిణం ప్రధానం, దేవాలయాల్లో దీపారాధన.

చాతుర్మాస్యవ్రతంలో సరస్వతీపూజ కూడ ఉంది. సంవత్సరంతో వచ్చే ఇరవైనాలుగు ఏకాదశులు ఉపవాసం ఉండలేకపోయినా చాతుర్మాస్యాల్లో వచ్చే ఎనిమిది ఏకాదశులైనా ఉండడం మంచిది. ఈ ఎనిమిది ఏకాదశులలో వంకాయ, కరుబూజ, రేగి మున్నగునవి తినకూడదని వ్రతోత్సవ చంద్రికాకారుడు అంటున్నాడు.

**ఆషాఢశుక్ల ద్వాదశి**

ఆషాఢ శుక్ల ద్వాదశి చాతుర్మాస్య వ్రతారంభదినమనీ స్మృతికౌస్తుభము చెబుతూవుంది.

ఆనాడు ఈ వ్రతం ప్రారంభించడానికి వీలులేనివారు ఆషాఢశుద్ధ పూర్ణిమనాడు కానీ, కర్కాటక సంక్రాంతినాడుకాని చేయవచ్చు.

ఏనాడు ప్రారంభించినా ఈ వ్రత సమాప్తి కార్తీకశుద్ధ ద్వాదశినాడే.

**యతులకు**

ఇది యతులకు ముఖ్యమైన వ్రతం. వ్రతంచేసే యతులకు ఆశ్రయం ఈయవలసిన బాధ్యత గృహస్థులు వహించాలి.

గృహస్థులున్నూ ఈ వ్రతాన్ని ఆచరింపవచ్చును.

యతులు మున్ముందుగా వ్యాస మహర్షి పూజచేయాలి. ఆమీద ముండనం చేయించుకోవాలి. మళ్ళీ వ్రతసమాప్తి అయ్యేవరకు క్షురకర్మ చేయించుకోకూడదు.

చాతుర్మాస్యవ్రతం చేసేవారు వ్రతంపూర్తి అయ్యేవరకు నిమ్మపళ్ళు, అలసందెలు, ముల్లంగి, గుమ్మడికాయ, చెరుకుగడలు - వీనిని వర్జించాలని శాస్త్రవచనం.

వీనిని బొత్తిగా పరిహరించి మొదటినెలలో కూరలు మాత్రయున్నూ, రెండవ నెలలో పెరుగున్నూ, మూడవ నెలలో పాలున్నూ, నాల్గవ నెలలో ద్విదళ (రెండాకులుండే) పత్రశాకములున్నూ అన్నాధరువులుగా ఉపయో

గించాలి. కూరలు, పచ్చళ్ళు వగైరా ఇతరములు ఏవీ తీసుకొనకూడదు.

ఉసిరిక ఒలుపు యథేచ్ఛగా వాడవచ్చును. ఈ నియమాలన్నీ శరీర స్వాస్థ్యంకోసమే కావడం సులభంగానే వూహింపవచ్చు.

సన్యాసి అగువాడు గ్రామైకరాత్రుడై (అనగా ఒక్కొక్కరాత్రి ఒక్కొక్క వూరిలో గడిపేటువంటివాడై) ఉండాలి. కాని వర్షాకాలము నాలుగు నెలలు అతడు ఒక్కచోటనే గడపవచ్చును. అట్లు గడపడమే చాతుర్మాస్యవ్రతం.

## బౌద్ధులలో

ఈ చాతుర్మాస్యవ్రతం హిందూ మతస్థులలోనే కాక బౌద్ధ మతస్థులలో కూడా ఉంది. హిందువులలోవలె బౌద్ధులలో కూడా అది ఆషాఢంలోనే ప్రారంభమవుతుంది.

ఈచాతుర్మాస్యవ్రతం క్రైస్తవమతంలో కూడా (లెంట్ నామంతో) నలుబది దినాల ఉపవాసాల పండుగగా ఉందనవచ్చు.

హిందూమతస్థులు ఈపండుగను జరిపే తీరు కొంత తెలిసికొన్నాము. బౌద్ధులు దీనిని ఎట్లా జరుపుతారో తెలిసికోవడానికి ముచ్చటగా ఉంటుంది.

రంగూన్‌లోని విద్యావేత్తలలో ఒకరైన 'శ్రీమతాన్ ఇ' అనువారు ఈ పండుగ బౌద్ధులచే ఆచరింపబడేతీరును ఇట్లు వ్రాస్తున్నారు.

'జూలై నెలలో ఏదో ఒకరోజున బర్మీయుల 'వాసో' (WASO) అనేమాసం ఆరంభమవుతుంది. వాసోమాసపు పూర్ణిమకు బౌద్ధుల చాతుర్మాస్య వ్రతం మొదలవు తుంది.

## 'వాసో వృక్షం'

మతవిధులు ప్రబలంగా పాటింపవలసిన ఆ వ్రతం వారిలో వనాల్లో విచ్చలవిడిగా తిరిగే విధులతో మొదలవుతుంది. పౌర్ణమి వెళ్ళిన పాడ్యమినాడు యువకులు యువతులు కలసి వనాలకు చిట్టడవులకు వెళతారు. వాసో వృక్షం ఆ రోజుల్లో ముమ్మరంగా పూసి ఉంటుంది. ఆ పూలు పసుపు పచ్చగా చాలా ఆకర్షనీయంగా ఉంటాయి.

యువకులు, యువతులు వేడుకగా తిరుగుతూ ఆ పువ్వులు గంపలకొద్దీ కోసుకుని ఇంటికి వస్తారు. వాటిని గృహదేవత పూజలో ఉపయోగిస్తారు. దేవాలయాలకు వెళ్లి బుద్ధదేవునికిన్నీ ఇస్తారు. బౌద్ధ విహారాల్లో కూడా వానిని విరివిగా వాడతారు.

బౌద్ధ బిక్షకులకు బహుమానాలు ఈయడము ఈనాటి ప్రధాన

కృత్యం. గృహస్థులు విడివిడిగా కాని నలుగురు ఐదుగురు కలిసి కాని డబ్బుపోగు చేసి బౌద్ధభిక్షకులకు బహుమాన ప్రదానాలు సాగిస్తారు.

## పంచశీల పఠనం

బౌద్ధ భిక్షకులను బర్మా భాషలో 'పొంగేయిన్' అంటారు. వారిని గృహస్థులు ఆహ్వానిస్తారు. తివాసీలు పరచిన పొడుగుపాటి అరుగులమీద వారిని వరసగా కూర్చోపెడతారు. ఒక్కొక్క భిక్షునికి తాము ఈయతలచిన బహుమానాలు ఆయా భిక్షునిముందు అరుగు మీద ఉంచుతారు. జనులు వారియుందు క్రిందుగా కూర్చుంటారు. బౌద్ధ సన్యాసులు ఆ మీద పంచశీలాలు ఎలుగెత్తి పేర్కొంటారు. వారు చెబుతూఉండగా వాటిని ఆ ప్రజలు ఎలుగెత్తి చెబుతారు.

ఈతంతు జరిగాక విందు భోజనాలు జరుగుతాయి. తృప్తిగా భోజనంచేసి వెళ్ళిపోతారు. తరువాత గృహస్థులు ఫలహారాలు చేస్తారు. ఆటలు, పాటలు మున్నగువానితో వాళ్ళు ఆనందిస్తారు.

ఇట్లా ఈ పండుగలో మత లౌకిక ధర్మాలు రెండూ మేళవింపు పొందుతాయి. బౌద్ధ భిక్షకులకు యిచ్చే వస్తువులలో కొత్త దుస్తులు, కొవ్వువత్తులు, పూవులు, పాదుకలు, గొడుగులు, కంబళ్ళు మున్నగు అనేక వస్తువులు వారి ఆశ్రమవాసానికి అనువుపడేవి ఉంటాయి.

బౌద్ధ భిక్షకుల ఈ వ్రతం జూలై, ఆగస్టు, సెప్టెంబరు. అక్టోబరు - ఈ నాలుగు మాసాలు నడుస్తుంది. వాసోనెలలో మొదలై 'తాడింగ్యాట్' అను నెలలో ముగుస్తుంది. తాడింగ్యాట్ అనగా బర్మాభాషలో ముగింపు అని స్ఫురణ. నాలుగు మాసాలు ఉపవాసాది దీక్షకు మోక్షచింతనాలికి ముగింపు అని అర్థం.

## బుద్ధుని రాక

ఈ నాలుగు మాసాలు వారు తమ ఆశ్రమాన్ని విడిచి దూరప్రదేశాలకు పోరు. ఒకవేళ వెళ్ళినా అన్యస్థలాల్లో నిద్రించక ఆ రాత్రికే తమ ఆశ్రమానికి వచ్చేస్తారు.

బౌద్ధులలో ఒక నమ్మిక ఉంది. మానవ లోకంకంటే ఉత్తమమైన లోకంలో బుద్ధుడు ఈ నాలుగు నెలలు తన తల్లితో ఉంటాడని. ఆసమయంలో ఇక్కడ మతబోధ, జ్ఞానబోధ, జరుగుతుంది. ఉపవాసాలతో ప్రార్థనలతో ఈ రోజులు వెళ్ళదోస్తారు. తాడింగ్యాట్ మాసపు పౌర్ణమినాడు అదియే బౌద్ధ మతస్థుల చాతుర్మాస్య వ్రతానికి ఆఖరిరోజు గురుదేవుడు బుద్ధుడు భూమికి దిగివస్తాడు.

దీపమాలికలు వెలిగించి ఆనాడు అతనికి బౌద్ధులు అందరూ స్వాగతోపచారాలు చేస్తారు.

వాసో పూర్ణిమ మన ఆషాఢ పూర్ణిమకు తాడింగ్యూట్ పూర్ణిమ మన కార్తీక పూర్ణిమకు సరిపోతాయి.

## ఆషాఢ పూర్ణిమ

ఆషాఢ శుద్ధ పూర్ణిమకు వ్యాసపూర్ణిమ అని పేరు.

ఈ పర్వము యతులకు అతిముఖ్యమైనది. వారీనాడు మహా భారతము మున్నగు సంహితా గ్రంథాలకు రచయిత అయిన వ్యాసుని పూజిస్తారు. వ్యాస పూర్ణిమ పర్వాన్ని ఆదిలో. శంకరాచార్యులు ఏర్పాటు చేశారని చెబుతారు.

ఈ పూజా విధానం గమనింపతగింది.

కొత్త అంగవస్త్రం భూమి మీద పరుస్తారు. దాని మీద బియ్యం పోస్తారు. ఆ బియ్యం మీద నిమ్మకాయలు ఉంచుతారు. ఇది శంకరులు, అతని నలుగురు శిష్యులు వచ్చి దానిని అందుకొంటారని నమ్మకం. పూజ అయ్యాక ఆ బియ్యం తలా ఒక పిడికెడు తీసుకువెళ్లి తమ తమ యిళ్లల్లో బియ్యంలో కలుపుకుంటారు.

బియ్యం, కొత్తవస్త్రం లక్ష్మి చిహ్నం. శుభసందర్భాల్లో బియ్యం యథాశక్తిని రాసి పోసి లక్ష్మిని ఆహ్వానించటం హిందూ గృహాల్లో పరిపాటి. నిమ్మపళ్లు కానుకగా ఇచ్చుపళ్లు. అవి కార్యసిద్ధి సూచిస్తాయి. బియ్యము, నిమ్మపళ్లు ఉంచడం లక్ష్మి కటాక్షం కోసం.

దక్షిణాదిని కుంభకోణంలో, శృంగేరిలో శంకర పీఠములు ఉన్నాయి. వ్యాసపూర్ణిమ అక్కడ నితాంత వైభవంతో జరుపబడుతుంది. ఆ పర్వ సందర్భంలో అక్కడికి వేల కొలది తైర్థికులు వస్తారు.

వ్యాసపూర్ణిమ గురుపూజా దినమని పాంచజన్యము పత్రిక (28-7-34) ఇట్లా అంటూ ఉంది.

"ఇందు వ్యాసపదము గురుపరము. నాడు లోకమంతయు తమతమ గురువుల నారాధించుకొని తరింప వలయునని శాస్త్రాదేశము. స్వస్వరూపాను సంధానమున కన్న భిన్నమగు నన్యారాధననెడగని, యతిశేఖరులనే యీనాగాచార్య పీఠార్చనల నాచరింపవలసినదిగా శాస్త్ర మాదేశించి ఉన్నది. గుర్వారాశనము విశేష ప్రయోజనకారియునాయు, అనుల్లంఘ్యమనియు చెప్పుటకు మనకు రెండు ప్రబల ప్రమాణములు

కలవు. 'యస్యదేవే పరాభక్తిః యధా దేవేయాతథా గురౌ' అని శేతాశ్వతరోపనిషత్తు నందు పఠితమైంది. ఇందు వేదమాత, ఈశ్వరారాధన తోటి తుల్య గౌరవమును, సమాన ప్రాధాన్యమును నిచ్చి చున్నది గురుపూజనమునకు, కాని స్మృతికర్తలింకొక మెట్టెక్కుడధిష్ఠింప జేయచూచినారు. గురువును "దైవేఋష్టే గురుస్త్రాతా, గురౌఋష్టేనకశ్చన" యని దైవానుగ్రహమునకు గుర్వనుగ్రహమంతటి యత్యంతాని వార్యమగునట్టిది. అనగా దైవానుగ్రహమునకు గుర్వనుగ్రహ మంతటి యత్యంతాని వార్వమగునట్టిది. గనుక సాధనమపేక్షించి గాని దాని యెడననజ్ఞతను జూపిగాని సిద్ధిని పొందజూచుట అవివేకమును హస్యాప్పదమునునగునని వారి యుద్దేశ్యము. వ్యాసపూర్ణిమ యనుదాని యందలి వ్యాసపదమాధికారిక పదపరముగాని వ్యక్తిపరము కాదనునదొకటియు, ఆనాడొనర్చు గురు పీఠార్యనలలో నిప్పుడు దేశమందమలు లోనున్న యతికర్తృక పూజ మాత్రములు ఉప లక్షకములు మాత్రమేననియు, ఆనాడు సర్వులు సర్వవిధములు తమ తమ గుర్వర్చన జేసి గురుభక్తిని వెల్లడించి పెంపొందింపజేసికొనుట విధియనియు మా విశ్వాసము.".

వ్యాసపూర్ణిమ యందలి వ్యాసపదము వ్యక్తిపదము కాదనచున్నారు. ఈ విషయం కొంత విచారింప వలసివుంది.

ఎంతో మంది ఋషులు ఉండగా ఒక్కవ్యాసుని పేరిటచే ఈ పూజ జరుప బడుటకు ఏమిటి హేతువు! ఈపూజలో ప్రత్యేక పూజలు అందే ఆదిశంకరులు వ్యాసభగవానుని అపరావతారమని చెబుతారు. కాగా ఇది వ్యాసపూజకు ఉద్దిష్టమైనది. వ్యాసపూజ అనగా ఆదిశంకరుల పూజ అనగా వ్యాసపూజ. సన్యాసులందరూ ఆదిశంకరులు తమగురువుని ఎంచుకుంటారు. కాగా నేడు సన్యాసులందరూ వ్యాసుని రూపంలో తమ గురువును కొలుస్తున్నారన్నమాట అందుచేత ఇది వ్యాసపూజా దినమైంది.

శ్రీ శంకరాచార్యుల వారి జయంతికి వేరే ఒక దినము ఉద్దిష్టమై ఉంది. కాగా దీనిని గురుపూజా దినముగానే భావింపవలసివుంది.

**మహాశిషాఢ - వ్యాసపూజ**

ఈ దినమందు అష్టాదశ పురాణ నిర్మాత అయిన వ్యాసమహర్షిని పూజించాలి.

శ్లో: శంకరం శంకరాచార్యం గోవిందం బాదరాయణం
సూత్రభాష్యకృతౌవందే భగవంతౌ పునఃపునః

అని పూజించిన బ్రహ్మత్వసిద్ధి కలుగునని చెబుతారు.

వైష్ణవ పురాణమును ఆషాఢ పూర్ణిమకు దానమిస్తే విష్ణు లోకము కలుగును. వ్యాసభగవానుడు సకల కళానిధి, సకలశాస్త్రవేత్త. సోమకుడు అనే రాక్షసుడు వేదాలను ఎత్తుకు పోయినపుడు అవి ఒకదానితో ఒకటి కలిసి పోయాయి. కొంతకాలానికి శ్రీ మహావిష్ణువే వ్యాసావతారం ఎత్తి ఆ వేదాలను విభజించి చక్కపఱచాడు. చిక్కుపడిన వేదములను విభాగించిన విద్యావేత్తయేకాక అతడు శస్త్ర చికిత్సావేది కూడ. గాంధారి ఈసుపూని దిగజార్చుకొన్న గర్భస్థ పిండాన్ని పరిరక్షించి ఆ పిండంలో నూట ఒక్క శిశువులు ఉండడం గుర్తించి ఆ విధముగా ఆ పిండాన్ని నేర్పుతో విభాగించి నేతి కుండలో నిక్షిప్త మొనర్చి పోషించేటట్లు చేసిన వైద్యవరుడు, వైద్యవిద్యానిధి, మేధానిధి, ఆత్మవిద్యానిధి అయిన వ్యాస భగవానుని పూజించడానికి ఉద్దిష్టమైనపర్వమిది.

ఆషాఢ శుద్ధ పూర్ణిమ రుద్ర సావర్ణి మన్వంతరాది దినము. రుద్ర సావర్ణి పన్నెండో మనువు. అతడు రుద్రపుత్రుడు ఈ మన్వంతరంలో ఋతధాముడు ఇంద్రుడు, తపస్వి, సుతపస్వి మున్నగువారు సప్తర్షులు.

## శివశయనోత్సవం.

ఆషాఢ శుద్ధ పూర్ణిమ శివశయన వ్రతం చేయాలని, వ్రతగ్రంథాలు చెబుతున్నాయి. ఈనాటి వివరణలో స్మృతి కౌస్తుభము శివ శయనోత్సవం, 'శివే పవిత్రారోపణమ్' అని పేర్కొంటూ ఉంది. ఈ ఉత్సవాన్ని శైవులు ఎక్కువగా చేస్తారు. పాపాలను తన జడలతో కలిపి కట్టి వేసి పెద్ద పులి చర్మాన్ని శయ్యగా ఏర్పఱచుకొని శివుడు ఆషాఢశుద్ధ పూర్ణిమ మొదలు నాలుగు మాసాలపాటు నిద్రపోతాడు. ఆషాఢ శుక్ల ఏకాదశి నుంచి విష్ణు శయన వ్రతం చేసేటట్లే ఆషాఢ శుద్ధ పూర్ణిమ మొదలు శివశయన వ్రతం చేస్తారు.

## కోకిలా వ్రతము

కోకిలావ్రతము కామ్యవ్రతాల్లో ఒకటి. ఆ వ్రతభావన చమత్కారమైనది.

ఈనాడు సాయంకాలం నదికి వెళ్లాలి. స్నానం చేయాలి. తెలికపిండితో కోకిల ప్రతిమను చేయాలి. దానిని పూజించాలి. ఇట్లా నెల

రోజులు చేయాలి. దీనిని బాలిక ఆచరిస్తే అందమైన మగడున్నూ, బాలుడు ఆచరిస్తే అందమైన భార్యయున్నూ దొరుకుతారు.

కోకిల పక్షి, తెలికపిండి ఇందు ప్రధాన ద్రవ్యాలు ఆషాఢ మాసంలో సేవించవలసిన పదార్థాల్లో తెలికపిండి ఒకటి. ఆషాఢాని కోకిలకు అంకిళ్లు పడిపోతాయి అని చెబుతారు. కోకిల అప్పటి నుంచి వలస వెళ్లిపోతుంది. కాగా ఆషాఢమాసంలో తెలికపిండితో కోకిల ప్రతిమను తయారు చేసి పూజించడంలోని ఆంతర్యం తఊచవలసి ఉంటుంది.

ఈ కోకిలా వ్రత విషయం స్మృతి కౌస్తుభంలో కలదు.

కోకిలాదేవి ద్రుపదుని భార్య.!

## జితేంద్రరాయజాతర

మహబూబ్ నగర్ జిల్లా కసుమర్తి గ్రామం దగ్గర భీమానది కృష్ణానదిలో కలుస్తున్నది. ఈ నదుల సంగమం స్థానంలో ఒక చిన్న ద్వీపం ఉంది. అందు శ్రీకృష్ణద్వైపాయన బృందావనం అనే ఆరామం ఉంది. అక్కడి అధిష్ఠానదేవత జితేంద్రరాయ పేరిటివాడు వ్యాసపూర్ణిమకు ఇక్కడ జాతర జరుగుతుంది. వేలాది జనం వస్తారు.

## అషాఢ బహుళ పాడ్యమి

మృగశీర్షావ్రతమ్. స్మృ.

కోకిలా వ్రతమ్.స్మృ

ధర్మావాప్తి వ్రతం.చ.

## ఆషాఢ బహుళ విదియ

'క్షీరసాగరే సలక్ష్మీక మధుసూదన పూజా' ఆమాదేర్ జ్యోతిషీ.

అష్టనాగపూజా. మనసాపూజా.

శ్రీజయతీర్థ

విజయతీర్థ పుణ్యదినం.

## ఆషాఢ బహుళ అష్టమి

ఆషాఢ కృష్ణ అష్టమి రౌచ్యమన్వంతరాది.

రౌచ్యుడు పదమూడవ మనువు. అతనికే రేచ్చుడు అనే మరి ఒక పేరు ఉంది.

రౌచ్యుడు రుచి అనువాని కుమారుడు. రుచిమహర్షి. అతడు నిస్సంగుడై భూమి మీద తిరుగుతూ ఉండెను. అతడు వివాహం చేసి కొనలేదు. అందుమీద ఒకసారి అతనికి పితరులు కనిపించి పెళ్లి చేసుకొని

సంతానం పడసి తమకు ఉద్ధతి కలిగించమని చెబుతారు. అందుమీద రుచి బ్రహ్మను గురించి తపస్సు చేస్తాడు. బ్రహ్మ ప్రత్యక్షమై నీ పితరులు చెప్పినట్లు వివాహం చేసుకోమంటాడు. అటు పిమ్మట రుచి నదీ తీరాన పితృతర్పణం చేస్తాడు. పితృదేవతలు వచ్చి 'బిడ్డా'! నీకు ఒక మంచి యిల్లాలు లభింపగలదు. ఆమె వలన నీకు మన్వంతరాధిపతిఅగు మనువు పుట్ట గలడు, అతడు రౌచ్యుడు అనే పేరుతో వ్యవహరింపబడును. అని చెప్పాడు.

ఇంతలో నది మధ్యలో నుండి మనోహారిణి అయిన ప్రమ్లోచ అనే అప్సరస వెడలి వస్తుంది. ఆమె రుచితో ఇట్లా చెబుతుంది. అయ్యా! వరుణ పుత్రుడైన పుష్కరుని వలన నేను ఒక కన్యను పడసి ఉన్నాను. ఆమె జగదేక సుందరి. ఆమె పేరు మాలిని. ఆమెను నీకిచ్చి పెళ్లి చేయాలని నాకు అభిలాషగా ఉంది.

రుచి మహర్షి మాలినిని వివాహ మవుతాడు. మాలిని యందు రుచికి ఒక కొడుకు పుడతాడు. అతడు రేచ్చుడనే పేరుతో త్రయోదశ తమ మన్వంతరాధి పత్యము వహించును.

ఈ మన్వంతరమున దివస్పతి నామకుడు ఇంద్రుడు. ధృతి మంతుడు, తత్త్వదర్శి మున్నగువారు సప్తర్షులు.

## ఆషాఢ బహుళ ఏకాదశి

కామికైకాదశి

ఆమాదేర్ జ్యోతిషీ అనే గ్రంథం ఈ ఏకాదశిని కామదైకాదశి అని పేర్కొంటూ ఉంది.

ఈనాటి ఏకాదశీ వ్రతాచరణం వల్ల అభీష్టములు ఈడేఋతాయి.

## ఆషాఢ కృష్ణ అమావాస్య

## దీపపూజ

ఇంటిలో వున్న ఇత్తడి దీప స్తంభాలు, కుందెలు అన్నీ శుభ్రంగా కడుగుతారు. కొయ్యపలకల్ని పేడతో అలికి దాని మీద ముగ్గులు పెడతారు. కుందెలు. దీపస్తంభాలు ఆ పలకం మీద వుంచుతారు. స్త్రీలు ముస్తాబై దీపాలు వెలిగించి పసుపు కుంకుమలతో పూజ చేస్తారు. లడ్డూలు, మోరుండలు నైవేద్యం పెడతారు. బ్రాహ్మడికి, ముత్తైదువుకి పెట్టుకుంటారు. సాయంకాలం దీపం వెలిగించి ఇంటి నలుమూలలా చూపిస్తారు.

## కర్కాటక సంక్రమణం

## సంక్రాంతులు పితృతిధులు

కర్కాటక సంక్రాంతినాడు వరాహపూజ ఉపవాసము ఉండాలని హేమాద్రి చెబుతున్నాడు.

సుజన్మావాప్తి వ్రతం, సంక్రాంతి స్నానవ్రతం మున్నగు వ్రతాలు ఈనాడు చేస్తారని చతుర్వర్గ చింతామణి.

ఈనాటి నుంచి దక్షిణాయనము. సూర్యుడు దక్షిణమునకు పోతూ ఉంటాడు. దక్షిణాయనము పితృమహిమకు అర్హమైనకాలము. ఈ అయనంలో చనిపోయిన పుణ్యాత్ముడు పితృమహిమను పొంది చంద్ర సాయుజ్య మందునని వేదవచనము.

కర్కాటక సంక్రమణ దక్షిణాయ పుణ్యకాలః

కర్కాటక సంక్రమణము దక్షిణాయనమునకు ఆరంభము.







# బహుముఖప్రజ్ఞానిధి

సుగృహీతనామధేయులు ఆంధ్ర శేషగిరిరావుగారు సుప్రసిద్ధ వయోవృద్ధులు. జ్ఞానవృద్ధులు. జన్మస్థలము పశ్చిమ గోదావరి తణుకుతాలూకాలోని ముక్కాముల. వాసస్థలము విశాఖపట్టణ జన్మదినము శోభకృన్నామ సంవత్సర భాద్రబహుళ విది గురువారము 10-09-1903 వ తేదీ విద్యారంగ రాజమహేంద్రవరము. ఆంధ్రవిశ్వకలాపరిషత్ తొలిజట్టు పట్టభద్రులు. సంస్కృతాంధ్రసాహి వేత్తలు. ఆయుర్వేద వైద్యవిశారదులు. పత్రికాసంపాదకులు. ప్రముఖ గ్రంథకర్త ప్రసిద్ధవ్యాసకర్తలు. కాకినాడ కాంగ్రెస్ మహాసభలలో కరపత్రములుగా పంచిపెట్టిన భారతిలో వ్యాసకర్తలు. (1923). రాజమహేంద్రవర సారస్వత సమాజమును స్థాపించిన సాహిత్యారాధక (1922).

గృహలక్ష్మి (1929-32), ప్రజామిత్ర (1938-42), ఆనందవాణి (1945-5 ఆంధ్రవాణి (1952), వేదిక (1970-71), పత్రికల సహసంపాదకులు.

ఆంధ్రభూమి (1933-42), ఆరోగ్యసుధ (1948-52), ఆంధ్రకీర్తి (1978-81) పత్రి స్వయం సంపాదకులు.

వీరి గ్రంథములు త్రివిధము, ఆంధ్రుల కీర్తిచంద్రికలు అచ్చొత్తు ఆహారవిజ్ఞానమును అందించునవి. ఆరోగ్యవిజ్ఞానమును అందిచ్చునవి.

ఆంధ్రరమణీమణులు మొదటి భాగము 1931, రెండవ భాగము 1933, మూ భాగము 1993, ఆంధ్రరాజభక్తులు 1946-51, (అయిదేండ్లలో ఏడు ముద్రణలు), ఆం విదుషీమణులు మొదటి భాగము 1950, మొత్తము 1995, ఆంధ్రసారస్వత వ్యాసావళి 19 ఆంధ్రవీరయువకులు 1954, హైదరాబాదుచరిత్ర 1956, ఆంధ్రకవుల అద్భుత మహి కథలు 1981, ఆంధ్రబాలల వికటకవితావినోదిని 1982. (ఆంధ్రరాజభక్తులు బరంపు విశ్వవిద్యాలయము వారి ప్లస్॥ పరీక్షకు, ఆంధ్రరమణీమణులు మూడవ భాగ ఆంధ్రవిశ్వకళాపరిషత్ మెట్రిక్యులేషన్‌కు పాఠ్యగ్రంథములైనవి.)

ఆకుకూరలు1947, కాయకూరలు1947, దుంపకూరలు1947, తేనె19 ఆవుపాలు1949, వేసవి1949, చనుపాలు1950, వెన్న-నేయి1950. ఫలజాతులు మొ భాగము1951, దంతరక్షణ 1951, నిద్ర 1951, విటమినులు 1951, ఖనిజలవణాలు 19 శిరోజరక్షణ 1951, చర్మరక్షణ 1951, ఫలజాతులు రెండవ భాగము 1952.

వీరి వ్యాసములు బహువిధములు. చారిత్రికములు, సాహిత్యపరము హాస్యప్రధానములు, విజ్ఞానప్రదములు, ప్రముఖుల పరిచయములు, స్థల విశేషములు, పండు పరమార్థములు మొదలైనవి. మొత్తము త్రిశతాధికము 315.

తెలుగు సరస్వతికి వీరి తిక్కన నవ్వులు కస్తూరీతిలకము. మహారాష్ట్రపాలక వాఙ్మయ సేవ (1950) కర్పూర నీరాజనము.

21-7-95

- ఆచార్య కొర్లపాటి శ్రీరామమూ